సరస్వతీ గ్రంథమాలిక—౧౧.

# పూర్ణయోగము



శ్రీ అరవిందయోగి వ్యాఖ్యానము ననుసరించి
వ్రాయబడిన బంగాళీ గ్రంథమున కాంధ్రీకరణము.



సరస్వతీ నికేతనము,

బందరు.

౧౯—౨౧ ]  [ వెల రు ౨-౦-౦

సరస్వతి గ్రంథమాలిక.

# ప్రచురింపబడుచున్న గ్రంథములు

—— o ——

ధర్మము :—శ్రీ అరవిందయోగి విరచితము.

భారతశిల్పము :—శిల్పాచార్యులగు శ్రీఅవనీంద్రనాథ టాగూరు విరచితము.

ఉపన్యాసమంజరి :—మహాకవి శ్రీరవీంద్రనాథటాగూరు రచితము.

మహాజ్ఞానవాశిష్ఠము :—ముముక్షువైరాగ్య ప్రకరణములు.

విద్యార్థి— (నవల).

౧౯౨౧ సంవత్సరము ఏప్రిలు నెలలో "ధర్మమను" గ్రంథమును చందాదారులకు అందజేయుదుము.

——:O:——

# రాజపోషకులు

శ్రీరాజారావు కుమార వేంకట మహీపతి సూర్యారావు బహద్దరు జమీందారుగారు, పిఠాపురము.

శ్రీరాజా నాయని వెంకట రంగరావు బహద్దరు జమీందారుగారు, మునగాల.

శ్రీ మోతే గంగరాజుగారు, జమీందారు, విస్సన్నపేట.

# ప్రధానపోషకులు

తుమ్మలపల్లి గోపాలకృష్ణమూర్తి పంతులుగారు
కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు
కేడింబి హనుమంతరావు పంతులుగారు
వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు
వేమూరి రామచంద్రరావు పంతులుగారు
కేమవరపు రామదాసు పంతులుగారు
గొల్లపూడి సీతారామశాస్త్రిగారు
మద్ది రాధాకృష్ణయ్యగారు
దేశిరాజు హనుమంతరావు పంతులుగారు
ఆత్మూరి రామమోహనరావుగారు
అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు
గద్దె వెంకటరంగయ్యనాయుడుగారు
చీమకుర్తి బసవయ్యశ్రేష్ఠిగారు

ఆత్మూరి జగన్మోహనరావుగారు

పురాణం సూరిశాస్త్రిగారు

కోకా అహోబలరావు నాయుడుగారు

నడింపల్లి నరిసింహారావు పంతులుగారు

మద్ది వెంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు

భోగరాజు పట్టాభిశీతారామయ్యగారు

అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు

వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు

కోపల్లె హనుమంతరావు పంతులుగారు

---

## పోషకులు

కట్టమూడి చిదంబరరావు పంతులుగారు

మాధవపెద్ది కాళిదాసుగారు

మాడభూషి వేదాంతం నరిసింహాచార్యులుగారు

ఏకా లక్ష్మీనృసింహారావు పంతులుగారు

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు

శిష్టా వెంకటకృష్ణయ్యగారు

కుప్పా శ్రీరామ శర్మగారు



# విజ్ఞాపనము

—— :0: ——

శ్రీ అరవిందయోగి శిష్యులగు ప్రివర్తక పత్రిక సంపాదకు లీగ్రంథమును వంగభాషయందు రచించిరి. వారి యనుమతివడసి నేనీగ్రంథమును ఆంధ్రుల కర కమలములయం దర్పింపుచున్నాను. ఈగ్రంథ ప్రకటనకు సహాయమొనర్చిన, రాజపోషకులు, ప్రధానపోషకులు, పోషకులు, మొదలగు వారికిని; సరస్వతీ గ్రంథమాలిక చందాదారులకును కృతజ్ఞుడనై యున్నాను.

ఇట్లు,
ప్రకాశకుడు.
సరస్వతీగ్రంథమాలిక.

# విషయసూచిక.

# పూర్ణయోగము.

## యోగోద్దేశము.




గవత్స్వరూపానుభవమే యోగము. ఎవరి విశ్వాసము ననుసరించి వారు భగవత్స్వరూపమును నిర్ణయించుకొనవచ్చును. అందువలన నెక్కువ లాభనష్టములు లేవు. మానవుని కంటె నున్నతమును, బృహత్తరమును, సర్వవ్యాపకమును, సర్వాతీతమును నగు నొకసత్పదార్థము గలదని విశ్వసించిన జాలును.

భక్తునకును - భగవానునకును, అహమునకును - ఈశ్వరునకును, జీవునకును - శివునకును, ఆత్మకును - పరమాత్మకును, బౌద్ధమతానుసారము సంస్కారమునకును - శూన్యమునకు నుండు సంబంధమును సంయోగమందురు. ఈ సంయోగసంబంధము నుండి యోగ

సాధనము ప్రారంభ మగుచున్నది. మానవునియందే భాగము, ఎంతవరకు భగవానునితోడ సంయుక్తమై భగవత్స్పర్శ ననుభవించుచున్న దను విషయముపై, యోగసాధన ప్రణాళికయు, పరిణతియు, నాధారపడి యుండును.

మానవుడనిన నొక విశుద్ధమైన, మిశ్రరహితమగు అఖండపదార్థ మని దలంపజనదు. విభిన్నమైన విపరీత గుణసమష్టిని మానవుడని యెరుంగవలయును. ప్రకృతి యందలి సోపానము లన్నియు మానవునియం దిమిడి యున్నవి. మానవునియందు మూడు సోపానములు సుస్పష్టముగ గన్పడుచుండును. (౧) దేహము - ప్రాణములతోఁ గూడినది ప్రథమసోపానము. ఇందు ప్రాణ శక్తి (జీవశక్తి) దేహమును సజీవితముగ నొనర్చుచుండును. (౨) మనస్సు ద్వితీయసోపానము. బుద్ధి, విచారము, చింతనము, భావము, మొదలగు వాని క్రీడ యిందు జరుగుచుండును. (3) ఆధ్యాత్మబోధ తృతీయసోపానము. విజ్ఞానమయమును, ఆనందకందమును, అమృతనిలయము నగు స్వస్వరూప మిందు విరాజిల్లుచుండును.

మానవప్రకృతి, మనోలీలలయందు, ఆత్మా
భాసను - ఇంగితమును, గ్రహింపుచుండును. కాని
జ్ఞానముతో నాత్మనుగుర్తించుటయే సృష్టియొక్క
పరమలక్ష్యము. దేహము ప్రాణముతోగూడిన ప్రథ
మ సోపానమందు మానవునకు పశుభావము గలుగు
చున్నది. మనస్సు - బుద్ధితో గూడిన ద్వితీయసోపాన
ము నందునప్పుడు మనుష్యునకు మానవభావము
లభించుచున్నది. జ్ఞానానందములతో గూడిన
తృతీయసోపానమును జేరునప్పుడు, మానవునకు దేవ
భావము పుట్టుచున్నది. దేవభావమునే సిద్ధభావ
మనియు భాగవతభావమనియు నెఱుంగవలయును. ఏవ
ప్రగతి ననుసరించి, నేడు మానవుడు పశుభావము
నుండి మానవభావమునకును, మానవభావమునుండి దేవ
భావమునకును, ఆరోహణ మొనర్చుచున్నాడు. మాన
వుని పశుభావమునుండియు మానవభావమునుండియు
తప్పించి దేవభావమును బొందింపజేయుశక్తిని యోగ
శక్తియందురు. దేవభావమును బొందుటకు చేయుసాధ
నను, అనగా నడచుమార్గము జీవితవిధానము మొదలగు
వానిని యోగసాధన మందురు.

భారతవర్షమం దనేకవిధము లగు సాధనమార్గములు కలవు. అవి యన్నియు మానవునియందలి త్రివిధ సోపానముల నాశ్రయించి యున్నవి. మొదటిది హఠయోగము. ఇది మానవుని స్థూలదేహమునకు సంబంధించి యుండును. శరీరమును, ప్రాణశక్తిని, కేంద్రముగ నేసర్చుకొని, దానియందు భగవత్స్పర్శ ననుభవించుటకు చేయుసాధనను, హఠయోగమందురు. రెండవది రాజయోగము. ఇది మానవుని మనస్సుపై నాధారపడియుండును. రాజయోగము మనస్సుయొక్క యేదేని యొకవిశేషవృత్తిని, లేక లీలనుమాత్ర మాశ్రయింపక, మనస్సుయొక్క మూలప్రకృతి యగు చిత్తద్వారమున (మానససత్తా) భగవత్స్పర్శ ననుభవింప బ్రయత్నింపు చుండును. అనగా కేంద్రీభూత మగు సూక్ష్మశరీరమునకు సంబంధించినదానిని రాజయోగమని యెరుంగవలయును. మూడవది త్రిమార్గయోగము. మానవునియందుండు ఆధ్యాత్మికవృత్తు లగు జ్ఞాన భక్తి కర్మల పై త్రిమార్గయోగ మాధారపడియుండును. జ్ఞానము - ప్రేమ - కర్మప్రేరణ (ఇచ్ఛాశక్తి, will) అను మూడుప్రకరణములు, మనస్సునందు గలవు.

జ్ఞానయోగము, భక్తియోగము, కర్మయోగము లను మూఁడుయోగములును వరుసగ నీమూఁడుప్రకరణముల మీఁద నాధారపడి వానిసహాయమున మానవుని భాగ వతసత్తాయందు నిమగ్నముగ నొనర్చును. త్రిమార్గ యోగమునకు కేంద్రస్థానము ఆత్మ, లేక జీవుఁడు- పురు షుఁడు. కాని స్థూల సూక్ష్మశరీరములు కావు. జ్ఞానము ప్రేమ శక్తిద్వారమున నాత్మతోడ పరమాత్మకును, జీవునితోడ భగవానునకును పురుషునితోడ పురుషోత్త మునకును సాక్షాత్సంబంధమును స్థాపించుకొనుటయే ఆధ్యాత్మిక యోగముయొక్క ముఖ్యోద్దేశము.

పలువిధము లగు సాధనమార్గముల గుణదోష ముల విచారించుటకు ముందు సాధనోద్దేశమును సాధన లక్ష్యమును దెలిసికొనవలయును. సాధనోద్దేశము నను సరించి దానిఫలాఫలములను నిర్ణయించుటకు వీలగును. కావున సాధనయొక్క ఉపయోగానుపయోగములను నిర్ణయించుటకు బూర్వము లక్ష్యమును నెఱుంగవల యును.

కైవల్యముక్తి జీవన్ముక్తి యని యోగసాధనా లక్ష్యములు ద్వివిధములు. మాయావాదుల సిద్ధాంతము

ననుసరించి, గజత్తును దుస్స్వప్నమనియు, మృగతృష్ణ భ్రాంతియనినమ్మినప్పుడు, బౌద్ధమతస్థులంబోలి మానవుని సృష్టిని క్షణిక వేదనాసమిష్టియని యంగీకరించినప్పుడును, మన మీజగత్తునందుండుట కిచ్ఛగింపము. అప్పుడే దేని యొకవిధముగ నీదుస్స్వప్నమునుండియు, భ్రాంతినుండియు, దప్పించుకొని పలాయనంబగుటయే మానవుని ముఖ్యకార్యమగును. దీపశిఖను బోలి నిర్వాపిత మగుటయే పరమపురుషార్థ మగును. జీవితము నడంచుకొని, జగత్తునుండు సకలసంపర్కములను వీడి దానికతీతమందుండు దేనియందో కలసిపోవుటను కైవల్యముక్తియందురు. కైవల్యముక్తియే మనసాధనకు లక్ష్యమైనయెడల, వివిధమార్గములయందలి గుణదోషముల విచారించి సమన్వయమొనర్చుకొనవలసినయావశ్యకత యుండదు. అప్పుడే దేని యొకమార్గమున జగత్సంబంధముల నన్నిటినుండి తప్పించుకొని పలాయన మగుటయే యభీష్టసిద్ధియగును. పలాయన మగు మార్గములగూర్చి విచారించుటవలన చేకూరు లాభనష్టములు లేవు. విభిన్నస్వభావములు ప్రకృతుల ననుసరించి, మార్గములు వేరగుచుండును. అందువలన నొకనికి రుచించు మార్గము మరియొ

కనికి రుచింపదు. ఒకనికి సుగమముగ నుండుమార్గము మరియొకనికి దుర్గమముగ నుండును.

జగత్తు మనకర్థశూన్యముగఁ గన్పడుచుండ లేదు. జగత్తు మోహముకాదు. భ్రాంతియుకాదు. దుస్స్వప్న మునుగాదు. జగత్తును ఆనందమ్మునకు నిలయమని దలంచిననుగూడ మనము జీవనమును నిరాకరింపక, దానినాలింగనం బొనర్చుకొని, ముక్తులమును సిద్ధులము నగుటకుఁ బ్రయత్నింపవలయును. అప్పుడు యోగసాధన మందు, సంపూర్ణనూతనమూర్తి ప్రత్యక్షమగును. మానవు డను మందిరశిఖరమందు మాత్రమే భగవాను డు నివసించుచుండు నని తలంపఁజనదు. ఆశిఖరమునుఁ జేరుట కేర్పడిన సోపానముల సమ్మిష్టియందుమాత్రమే, భగవానుడు విరాజిల్లుచుండు నని యోచరాదు. మానవ మందిరమందలి సమస్త భాగములయందును, సంపూర్ణ ముగ భగవానుడు విరాజిల్లుచున్నాడు. అవియన్నియు భగవానునకు నివాసధామములు. కావున మానవమం దిరము నంతను నెక్కుమారుగఁ బరిశుభ్ర మొనర్చవల యును. మందిరమందలి సమస్త భాగములయందొక్క తరి యోగాగ్నినిఁ బ్రజ్వలింపజేయవలయును. శరీరము

నతిక్రమించుటకు శరీరమును, మనస్సు నతిక్రమించుటకు మనస్సును, జ్ఞానప్రేమ కర్మల నతిక్రమించుటకు జ్ఞాన ప్రేమ కర్మలను, వ్యక్తిత్వమును నాశనమొనర్చుకొనుట కు వ్యక్తిత్వమేర్పడినదని దలంపరాదు. దేహము,మనస్సు, ఆధ్యాత్మికవృత్తులు, భగవానుని బొందుట కేర్పడిన మార్గములు ఉపాయములు మాత్రమని యెంచరాదు. శరీరముయొక్క పశ్చాద్భాగమందుమాత్రము భగవాను డున్నాడని తలంపరాదు. శరీరముకూడ భగవాను డని యెఱుంగవలయును. మనస్సునకు వెనుక భగవాను డున్నా డని తలంపక, మనస్సుకూడ భగవానుడని తెలిసికొన వలయును. భగవాను డాధ్యాత్మికవృత్తులకు వెలుపల నున్నాడని యెంచక, అధ్యాత్మవృత్తులుగూడ భగవాను డని గ్రహింపవలయును.

సమస్తసాధనమార్గముల యావశ్యకతను గ్రహిం పవలయును. శరీరము, మనస్సు, ఆత్మ, ఈమూడును సమానాదరణీయములు. కావున మానవుని యందంతటను భగవానుని జాగరిత మొనర్చుకొనవలయును. ఏదియో యొక యంగద్వారమున గాక, సమస్తాంగముల తోడను భగవానుని, నాలింగనం బొనర్చుకొనవలయును. అందు

వలన మనమేదియో యొక విశేషసాధనమార్గము నాశ్రయించుటతోడ దృప్తినొందము. మనము కోరునది యఖండమగు పూర్ణయోగము. మనయందుండు సమస్త స్రోతములును భగవన్మయములు కావలయును. సకల క్షేత్రములు ఫలపుష్పములతోడ విరాజిల్లవలయును. మనము వ్యక్తిగతసిద్ధిని మాత్రము కోరుటలేదు. మానవ జాతియొక్క సంపూర్ణసిద్ధిని గోరుచున్నాము. మానవ మండలి శుద్ధమును ముక్తమును పరిపూర్ణమునై విరా జిల్లుటకు వ్యక్తిగతసాధన ప్రతిమూర్తియై యలరారు చుండవలయును. మన మెప్పుడును మానవసంఘనిర్వాణ మును గోరము. మానవజాతి యనంత వైచిత్ర్యముల తోడ విలసిల్లుచుండుటను వాంఛించుచుందుము. అందు వలన మానవమండలియొక్క సమస్తప్రేరణలును, ప్రయా సములును, కర్మలును, భగవానునియందు విలీనముగా వలయును. ఇదియే మనలక్ష్యము. అందువలన ఏదియో యొక విశేషసాధనమార్గము నవలంబించి మానవజాతికి భిన్నముగ బ్రయత్నించుట కిచ్ఛగింపము. కావున సమస్త సాధనమార్గములకును సమన్వయసూత్రమును గనుగొన వలయును. కాని యది వ్యక్తిగతప్రయోజనమునకు

మాత్రము సంబంధించి యుండజనదు. మానవజాతియొ క్క సమిష్టిసాధనకు సంబంధించి యుండవలయును.

కావున మనము పూర్ణయోగమును లక్ష్యమందుంచుకొని వివిధయోగసాధనలయందలి మంచిచెడుగులను బరిశీలింపవలయును. ఈకార్యమొనర్చుటకు బూర్వము వివిధయోగసాధనలవలన గలుగు విశేషఫలములను గ్రహింపవలయును.



# హఠ యోగము.



అన్నమయ ప్రాణమయ కోశములయందు ప్రకృతి నివసించుచుండును. ఈకోశద్వయమును దేహము ప్రాణము అని నుడువుచుందురు. వీనిని పరిశుద్ధమొనర్చి వశపరచుకొనుటయే హఠయోగము యొక్క ముఖ్యలక్ష్యము. సామాన్యజీవితమున కవసరమగునంతవరకు దేహప్రాణము లేర్పడియున్నవి. ప్రకృతి యొక్క యనంతభాండారమునుండి ప్రవహించుచుండు నొకసూక్ష్మధార నాశ్రయించి, దేహప్రాణములు నిలచుచున్నవి. వంశపారంపర్యమువలనను, పరిసరములకు సంబంధించిన ప్రవాహమువలనను, దేహప్రాణముల ప్రకృతి నియంత్రితమును ఖండితము నగుచుండును. శరీరావయవముల సంచలనమునకు తగినంతవరకు, ప్రాణశక్తి క్రీడింపుచుండును. అయ్యది నిత్య నైమిత్తిక కర్మజీవనమందు వ్యాపించి, తగినంతవరకు పనిచేయుచుండును. కాని యంతకు మించిన కార్యములను జేయఁజాలదు. హఠయోగము సాధారణమానవశరీరప్రాణములయందు

ప్రకృతి గలుగజేయుధర్మమును, సామంజస్యవిధానమును, నతిక్రమించి బృహత్తరధర్మమును, పూర్ణతరసామంజస్యమును, స్థాపించుటకు బ్రయత్నించును. శరీరము శీతోష్ణములు, జరామరణములు, క్షుత్పిపాసలు మొదలగు వానికి ద్యాసముచేయుచుండును. చిరాభ్యాసగతమగు కర్మసముదాయమందు బంధింపబడియుండును. కాని ప్రాణవేగము ననుసరించి శరీరము శతవర్ష పరిమితిని గూడ నతిక్రమించును. హఠయోగి నిరంతరము తనయందు ప్రకృతియొక్క ప్రాణశక్తి మహాప్రవాహరూపమున బ్రవహింపుచు దానియందు శరీరమందలి సమస్తబంధనములును, ఖండితసంస్కారములును, బాసిల్లుచుండవలయునని తలంచుచుండును. కాని శరీరప్రాణములను సాధారణజీవితమున కనుగుణ్యముగ నుండున ట్లొనర్చుకొనుటతోడ దృప్తినొందదు. శరీరము బలిష్ఠమును ఆరోగ్యయుతము నై దీర్ఘకాలమువరకు నుండవలయునని ప్రయత్నించును. ప్రకృతియొక్క యనంతజీవనశక్తిని ధారణజేయు సామర్థ్యమును వాంఛింపుచుండును.

ఈయుద్దేశసిద్ధికిగాను హఠయోగి ఆసనములు, ప్రాణాయామము, అనుద్వివిధమార్గములనవలంబించును.

ఆసనములవలన శరీరము చంచలరహితమై స్థిరముగ నుండును. సాధారణముగ శరీరమెప్పుడును చంచలమై యుండును. అందువలన నది యేదియో యొకకార్యమును జేయకయుండజాలదు. ఏలయన ప్రకృతిభాండారమందలి ప్రాణశక్తి విరామములేక శరీరమందు ప్రవహింపుచుండును. కాని యాప్రవాహమును శరీరము ధారణచేయజాలదు. అందువలన వివిధాంగములయందు, సంచలనము గలుగుచుండును. ఆచలనద్వారమున ప్రాణశక్తి బహిర్గతమగుచుండును. వివిధకర్మముల నొనర్చుటవలన మిగిలిన శక్తి క్షయమగుచుండును. కావున శరీరమును శాంతముగను చంచలరహితముగ నొనర్చుకొనుటవలన ప్రాణశక్తిని శరీరమందు ధారణచేయవచ్చును. ప్రాణశక్తిని బాగుగ ధారణచేయగలిగినయెడల, శరీరము బలయుతమును, ఆరోగ్యయుతమునై, సౌందర్యమున నలరారుచుండును.

"హఠయోగి" పలువిధములగు జటిలప్రక్రియల ద్వారమున శరీరమందలి యపరిశుద్ధతను దొలగించుకొని, నాడీమండలిని పరిశుద్ధముగ నొనర్చుకొనును. నాడీశుద్ధివలన ఉచ్ఛ్వాసనిశ్వాసము లక్ష్యలేక నడచు

చుండును. ఉచ్ఛ్వాసనిశ్వాసముల సంబంధ మగు ప్రక్రి యను ప్రాణాయామ మందురు. ప్రాణశక్తియొక్క ప్రధానమగు స్థూలక్రియలను ఉచ్ఛ్వాసనిశ్వాసము లందురు. ప్రాణాయామోద్దేశములు ద్వివిధములు. మొదటిది కాయసిద్ధి. అనగా ఆసనములవలన గలిగిన కాయసిద్ధిని పరిపూర్ణ మొనర్చును. అప్పుడు ప్రాణశక్తి శరీరమందు స్వేచ్ఛగ విహరించును. దానివేగముగూడ మిక్కిలి వృద్ధినొందును. సాధారణముగ శరీరమును దాస్యమందుంచు నియమముల నతిక్రమించును. ప్రాణశక్తిని స్వవశమందుంచుకొనుటవలన, శరీరముతోడ నత్యద్భుతకార్యములను నిర్వహింపవచ్చును. శరీరమారోగ్యయుతమై వీర్యసౌందర్యములఁ జెన్నారుటయేకాక, శాశ్వతముగ జీవితమును ధారణజేయవచ్చునని హఠయోగులు విశ్వసింపుచున్నారు. కుండలినీశక్తిని మేల్కొలుపుట రెండవకార్యము. నిద్రింపుచుండు కుండలినీశక్తిని మేల్కొలిపి, సాధారణమానవుల కలభ్యమును నపరిచితము నగు పలువిధనూతనసన్నృత్తులను బహిర్గత మొనర్చును. అప్పుడు సాధకునకు సృష్టియందలి యదృశ్యసోపానములు దృశ్యమగును. అకల్పితజగత్తు,

అత్యద్భుతసృష్టి, మహత్తరశక్తి బయల్పడును. మాన
వునియం దుండు సాధారణవృత్తు లన్నియు పరిస్ఫుట
మగుటయే కాక, అవియన్నియు విపులశక్తి కాధారము
లై కార్యము లొనర్చుచుండును. ఈయైశ్వర్యసిద్ధికొరకు
హఠయోగి పలువిధములగు గౌణప్రక్రియల నవలంబన
ములుగ గైకొనును.

ఇంతవరకు హఠయోగమువలన గలుగుఫలము
లను వివరించియున్నాను. సాధారణముగ మానవుడు
అణిమాద్యష్టసిద్ధులచే నాకర్షింపబడునని నుడువుటయం
దాశ్చర్యము లేదు. హఠయోగమువలన శరీరము నాశన
రహితమగును. అసాధారణశక్తి గలుగును. కాని వాని
వలన మానవుడు తృప్తినొందునా? శాంతియుతుడగునా?
విత్తహరణమువలన బ్రయోజనం బేమున్నదని మైత్రేయి
చెప్పినవాక్యము స్ఫురించుచున్నది. "యేనాహంనామృ
తాస్యాం కిమహంతేనకుర్యామి" "దేనివలన నేను
అమృతత్వమును బొందనో, దానిని నేను చేయుదునా?"

హఠయోగమునం దిచ్చటనే యభావము కాన్పిం
పుచున్నది. హఠయోగి భగవానుని సహజముగ మరచి
పోవును. యోగముయొక్క ముఖ్యలక్ష్యమగు భగవత్సా

ర్య ననుభవించుటను మరచి యైశ్వర్య మోహమందు దగుల్కొనును. అందువలన యోగులు ఐశ్వర్యమును సిద్ధులను దలంచి మిక్కిలి భయావహులై "భూతప్రేత ముల చర్యలకును, ప్రలోభనములకును, నెంతదూరమం దుండగలిగినయెడల నంతమంచిది" అని నుడువుచుందురు. మరియు, అయిశ్వర్యసిద్ధి గలిగినయెడల వెంటనే దానిని బరిత్యజింపవలయునని శిష్యులకు బోధింపుచుందురు. కాని యట్లుబోధించుట యుత్తమముగాదు. ఏలయన, మన మైశ్వర్యమును గోరవచ్చును. కాని, యది భగవ దైశ్వర్యమై యుండవలయును. భగవదైశ్వర్యము ఉప లబ్ధియు నొక్కమారుగ బ్రకాశింపజాలవని నుడువజనదు. కాని హఠయోగి యైశ్వర్యము లభించినంతనే భగవంతుని మరచి లోభివలెం బ్రవర్తింపుచుండును.

మనము గోరునది పూర్ణయోగము. అది మానవ జాతికిని జగత్తునకును సంబధించియున్నది. విశ్వ కల్యాణముకొరకు జగత్తునందలి కర్మను నియమించుట దీనిఫలము. పూర్ణయోగి హఠయోగసిద్ధిని విడనాడడు. కాని హఠయోగుల బోలి దాని నాశ్రయించియుండు టకు బ్రయత్నింపడు. జగత్తుతోడ మానవున కుండు

పలువిధసంబంధములయందు సంపూర్ణసంబంధము గలిగి యుండుట పూర్ణయోగముయొక్క లక్ష్యము. హఠయోగి జటిలప్రక్రియలయందు నిమగ్నుడై సమస్తశక్తిని కాలమును తనకొరకు వినియోగించుచుండును. అందువలన నాతడు జగత్తునకును తనకును నుండు సమస్తసంబంధముల నుండి విడిపడుచున్నాడు. భీషణకృచ్ఛ్రసాధనము నొనర్చి హఠయోగమువలన నొందు ఫలమును రాజయోగ తాంత్రికయోగములద్వారమున నతిసులభముగ బడయవచ్చును. హఠయోగమువలన మిక్కిలి ప్రయోజనమున్నమాట నిజము. కాని దానిమూల్యమునకు లభించు ఫలము మాత్రము విషతుల్యము. అందువలన నామూల్యముతోడ నంతకంటె మహత్తరమగు ఫలమును బడయవచ్చును.

—:o:—

# రాజయోగము.

రాజయోగమునకు కేంద్రస్థానము మనస్సు. ఇది శరీరప్రాణముల నాశ్రయించియుండదు. రాజయోగము మనస్సును వశపరచుకొని మానవుని భాగవత సత్తాయం దధిష్ఠింపజేయుటకు బ్రయత్నించును. కావున మున్ముందు మనస్సును పరిశుద్ధముగను సుసంయుతముగను శాంతముగను నొనర్చును. అనగా మానసిక రాజ్యమందలి సమస్తచింతనలు భావనలు వాసనలు ప్రేరణములు మొదలగువానిని నియంత్రిత మొనర్చును. మనస్సుయొక్క విచిత్రలీలలును పలుముఖముల బ్రవహించువృత్తులును చిత్తమందు బుట్టుచున్నవి. మన మేకార్య మొనర్చినను, దేనిని గూర్చి భావించినను, దెలిసికొన్నను ఆతరంగములన్నియు చిత్తసాగరమున బుట్టి తిరిగి దానియందు విలీనమగుచున్నవి. దానియందు సంస్కారరూపమున నిలచుచున్నవి. కావున మనస్సునకు మూలమగు చిత్తముమీదనే రాజయోగముయొక్క దృష్టియుండును. చిత్తము స్వాధీనమైనయెడల మనస్సు తనంతట తాను వశమగును. అందువలన పతంజలి మహర్షి యోగశాస్త్రమందు "యోగశ్చిత్తవృత్తి

నిరోధః" అనుదానిని ప్రథమసూత్రముగ నిర్వచించి యున్నాడు. చిత్తవృత్తినిరోధము యోగము. మానవుని చిత్తస్రోత మెల్లప్పుడును పలుముఖముల బ్రవహింపు చుండును. అత్యద్భుతమగు చిత్తవృత్తులవిక్షోభమువలన మానవుని హృదయము తల్లడిల్లుచుండును. అందు వలన తననుదాను తెలిసికొనజాలనివాడు తనయందు విరాజిల్లుచుండు మహత్తరమగు భాగవతసత్తాను దెలిసి కొనజాలడు. ఆపరమపురుషుని స్పర్శ ననుభవింపలేడు. భృత్యుఁడు ప్రభుపీఠము నలంకరించి రాజ్యమొనర్చు విధమున చిత్తవృత్తులు భగవానుని స్థానచ్యుత మొనర్చి ప్రభుత్వముచేయుచుండును. అందువలన రాజయోగి చిత్తవృత్తుల యుద్ధృతము నడంచుటకు, అష్టాంగసాధన నవలంబించును. యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణ ము సమాధి అనువానిని అష్టాంగము లందరు. యమ నియమములు రెండును చిత్తచాంచల్యవేగమును వృ త్తులస్వేచ్ఛావర్తనమును కొంతవరకు తగ్గించి అహింస సత్యభాషణము మితాహారము శుచి సంతుష్టి ఈశ్వరచింతనము మొదలగు విధినిషేధములద్వారమున సాధకుని చిత్తవిక్షోభదాసత్వమునుండి చాలవరకు

దప్పించును. మనస్సును నియమగతముగ నొనర్చి దానిని క్రమముగ స్థిరశాంతియం దుంచుటకు బ్రయత్నించును. కేవలము మనస్సుతోడ మనోశాంతి గలుగుటకు వీలులేదు. ఏలయన శరీరప్రాణముల యధికారము మనస్సుమీద మిక్కుటముగ వ్యాపించియుండును. అందువలన రాజయోగము ఆసనములు ప్రాణాయామము మొదలగు వ్యవస్థల నేర్పర్చుకొనియున్నది. కాని హఠయోగు లొనర్చు క్లేశదాయకమగు వందలకొలది యాసనములుగాని పలువిధములగు జటిలప్రాణాయామ క్రియలనుగాని గైకొనక అవసరమునకు తగినంత వరకు సహజమైన సరళమయిన ఆసనములను ప్రాణాయామప్రక్రియలను గ్రహించియున్నది. స్థిరసుఖాసనములుమాత్రమే ముఖ్యమగు ఆసనములు. అనగా మనస్సు స్థిరముగనుండుటకును ప్రాణాయామము సహజమగుటకు వీలగువానిని ఆసనములందురు. ఉచ్ఛ్వాస నిశ్వాసములగతిని నిర్బంధించుటను ప్రాణాయామమని యెరుంగవలయును. ఇట్లొనర్చుటకు రెండుకారణములు గలవు. (౧) నిశ్వాసప్రశ్వాసముల రుద్ధమొనర్చుట వలన చిత్తవృత్తినిరోధము సులభమగును. (౨) నిశ్వాస ప్రశ్వాసలక్రీడలను స్వవశమం దుంచుకొనుట చేత

ప్రాణశక్తియందు నిద్రించుచుండు కుండలినీశక్తి మేల్కొనును. చిత్తమును గప్పియుండు తమస్సు పటాపంచలగును. అప్పుడు చిత్తము స్వచ్ఛమగు సత్త్వప్రకాశమున వెలుంగును. చిత్తమును సత్త్వద్యోతిసంపన్నముగ జేయుటయే ఆసనప్రాణాయామముల లక్ష్యము. అందువలన నీ అభ్యాసాధనమున కతిరిక్తమును నవాంతరము లగు ప్రక్రియాదులను రాజయోగము బరిత్యజించును. అయినను ప్రాణాయామమువలన అలౌకికశక్తులు ఐశ్వర్యసిద్ధి గలుగును. కాని సిద్ధులు మొదలగునవి రాజయోగిని ఆకర్షింపజాలవు.

చిత్తము శాంతియుతమై ప్రసన్నత్వముబొంది చింతాశూన్యమును నిశ్చలము నగుటకు బ్రయత్నించు నప్పుడు ప్రాణాయామము ఇంద్రియములను విషయముల నుండి మరల్చి క్రమముగ నొక్కస్థానమందు తన్మయత్వము నొందించును. ప్రత్యాహారధ్యానధారణముల ద్వారమున "తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః" సమాధి గలిగినయెడల దానిని రాజయోగసిద్ధి యందురు. సమాధి అవస్థయందు బహిరంతఃకరణములు నిశ్చలమగును, శాంతియుతమగును. సంపూర్ణనివృత్తి గలుగును. సమాధియం దున్నప్పుడు నీవు - నేను, ధ్యానము

యము, మొదలగు ద్వంద్వము లుండవు. మహత్తర మగు నొక్క చైతన్యమమాత్రముండును. సమాధి యవస్థ సిద్ధించినప్పుడు చిత్తసంస్కారములన్నియు సమూలముగ నాశనమగును. "దోషబీజక్షయా త్కైవల్యం" దోషబీజక్షయము వలన కైవల్యము గలుగును.

రాజయోగమువలన మనము ముఖ్యముగ రెండు విషయములను నేర్చుకొనుచున్నాము. (౧) ఇంద్రియములకు దాసులమై మన మెల్లప్పుడును స్థూలమందు నివసింపుచుందుము. అందువలన నింద్రియాతీతమగు విషయములు మనకు గోచరింపవు. రాజయోగము ఇంద్రియచాంచల్యము నడంచి మనస్సును నిస్తబ్ధముగను చింతాశూన్యముగను నొనర్చును. అప్పుడు సాధకుని యందు చైతన్యము మేల్కొనును. ఇంద్రియలబ్ధమగు ప్రతీతియందు సాధకుని జ్ఞానము బంధింపబడియుండదు. జ్ఞానప్రవాహము పొంగిపొరలుచుండును. దానిని యదార్థమైన అవ్యవహిత జ్ఞానమని యెరుంగవలయును. పదార్థముల యంతర్గతమందలి సత్పదార్థము తనంతటతాను ప్రతిభాతమగునప్పుడు జీవుడు ఆధ్యాత్మికస్వరూపమందు ప్రతిష్ఠితు డగును. దీనిని స్వారాజ్యసిద్ధియందురు. (౨) అంతర్జగత్తును జయించి కేవల మాత్మచైతన్యమందు మునింగి

యుండుటయే కాక సమాధియవస్థయందు కేంద్రీభూత మగు చిచ్ఛక్తి ద్వారమున బహిర్జగత్తునుగూడ వశపరచి కొనవచ్చును. అందువలన సాధకుని స్వభావమును కర్మజీవనమును పరిసరముల నియంత్రితమొనర్చి నడి పింపగలుగును. అట్టిస్థితిని సామ్రాజ్యసిద్ధి యందురు. కాని యిక్కాలమున రాజయోగులు సామ్రాజ్యసిద్ధిని గమనించుట లేదు. దానిని రాజయోగసాధనమునుండి పారదరిమియున్నారు. ప్రాచీన కాలమందలి రాజ యోగులు స్వరాజ్యసిద్ధిని సంపూర్ణ మని తలంచి యెరుం గరు. వారు సామ్రాజ్యసిద్ధినే పరిపూర్ణసిద్ధియని గ్రహించి యుండిరి.

రాజయోగము శరీరప్రాణముల నతిక్రమించి మనోక్షేత్రమునుండి సాధకుని పరిపూర్ణముగ నొనర్చి ఆధ్యాత్మికజీవనాస్వాదమును గలిగించును. ఇది రాజ యోగమువలన గలుగు ఫలము. కాని రాజయోగము సమాధ్యవస్థనుమాత్రము ముఖ్యమని తలంచుచుండును. అట్లు తలంచుటయే రాజయోగమందలి ముఖ్యలోపము. అతీంద్రియజగత్తునందలి చేతనమును స్థూలమందు మేల్కొలిపి ఆత్మశక్తి ద్వారమున జగత్తును నిర్మించు టయే పూర్ణయోగియొక్క లక్ష్యము. రాజయోగి

స్థూలసంబంధములను తెంచివైచి మనోప్రాణముల లీలలను నిస్తబ్ధములనర్చి, ఒక్కతురీయలోకమందుండుటకుమాత్రమే ప్రయత్నించును. కావున రాజయోగి జాగ్రదవస్థను హేయముగదలంచి స్వప్నముననో సుషుప్తియందో సంచరించుచుండును.



# త్రిమార్గయోగము.

## జ్ఞానయోగము.

జ్ఞాన- భక్తి- కర్మయోగములను త్రిమార్గయోగ మందురు. త్రిమార్గయోగక్రియ రాజయోగము ననుసరించి యంతఃకరణముల నాశ్రయించియుండదు. మనః ప్రకరణముల నియంత్రిత మొనర్చి వశపరచుకొనుటకు బ్రయత్నింపదు. మనస్సునకుండు ప్రధానగతులు (వృత్తులు) మూడింటియం దొక్కదానిని గైకొని దానిసహాయమున మానవుని మార్పునొందింపుచుండును. కాని రాజయోగమునుబోలి త్రిమార్గయోగము మానవుని నలువైపుల ముట్టడించి మార్చుటకు బ్రయత్నింపదు. అది మానవుని యాంతరంగిక మూలపదార్థమును గైకొని, దాని కేంద్రమును భేదించును. అందువలన మానవు డతిసులభముగ బరివర్తనము నొందును. అంతఃకరణమునందు ప్రధానధర్మరూపమున నుండు ముఖ్యపదార్థమును కొందరు జ్ఞానమనియు, మరికొందరు ప్రేమయనియు వేరొకకొందరు కర్మయనియు జెప్పుదురు. అందువలన నాసాధనమార్గములకు జ్ఞానయోగము, భక్తియోగము, కర్మయోగ మను నామములు వచ్చినవి. మానవునియందుండు త్రివిధవృత్తుల

గతిని, అల్పమును స్థూలమును ఖండము నగు విషయ
ములమీద నుండి మఱలించి, సూక్ష్మమును బృహ
త్తరమును పూర్ణము నగు భగవానుని దిక్కునకు
ద్రిప్పుటయే త్రిమార్గయోగముయొక్క మూలసూత్ర
ము. మానవుని బుద్ధి హృదయము కర్మలకు భగవ
త్స్పర్శ గలిగినయెడల, క్రమముగ శరీరమందలి క్షేత్ర
ములన్నియు పవిత్రములగును. రాజయోగమునకును
త్రిమార్గయోగమునకును మరియొక భేదముగూడ గలదు.
రాజయోగము మనశ్శరీరముల మార్పునొందించి, వానిని
పరిశుద్ధముగ నుంచుటకు ప్రయత్నించును. భాగవత
సత్తాయం దుంచుటకు కఠోరసాధనలద్వారమున పలు
విధప్రక్రియలతోడ శుద్ధముగను సిద్ధముగను పూర్ణము
గనొనర్చుటకు గడంగును. కాని త్రిమార్గయోగ మట్టి
ప్రయాసమునకు బూనుకొనదు. ఆసనములు, ప్రాణా
యామము, చిత్తవృత్తినిరోధము మొదలగు ప్రక్రియలను
జేపట్టవలయునని విధింపదు. త్రిమార్గయోగము మాన
వుని సహజస్వాభావికావస్థయందు మానవునిగనే పరిగ
ణించును. సహజముగ మానవుడు తెలిసికొనుటకును
ప్రేమించుటకును కర్మనొనర్చుటకును ప్రయత్నింపు
చుండును. కావున వానిమూడింటిసహాయ్యమున మాన

వుని మార్పునొందించు టెట్లను విషయము విచారణీయము. కాని మనోశరీరములొనర్చు కఠినవ్యాయామములవలన బ్రయోజనం బేమున్నది ?

రాజయోగము చిత్తమునుమీదను, జ్ఞానయోగము బుద్ధిమీదను, ఆధారపడియుండును. మానవునకు దెలిసికొనవలయునను ప్రవృత్తికలదు. ఆప్రవృత్తి నాశ్రయించి జ్ఞానయోగముండును. జ్ఞానయోగముయొక్క లక్ష్యము భగవానుడు. భగవానుని బొందవలయుననిన మున్ముందు భగవానుని దెలిసికొనవలయును. అజ్ఞానమును నశింపజేసికొని జ్ఞానమునుగాంచుటను జ్ఞానయోగ సాధనమందురు. సత్యస్వరూపుడగు భగవానుడు ఆత్మయై విరాజిల్లుచున్నాడు. కావున ఆత్మసాక్షాత్కారమును జ్ఞానయోగసిద్ధి యందురు. జ్ఞానయోగమును ద్విభాగములుగ నొనర్పవచ్చును. ప్రథమభాగమును వివేకవిచారమందురు. సత్యమును దెలిసికొనుటకు ముందు విచారము నాశ్రయింపవలయును. విచారము వలనగాని సత్యాసత్యములను నిర్ణయింపజాలము. మనను గూర్చి మనకు దెలిసినంతగా నితరములనుగూర్చి తెలిసికొనుటకు వీలులేదు. అందువలన విచారము మనతోడ బ్రారంభమగును. మనయందుండు సత్యవస్తువు

దేహమూ, ప్రాణమూ, మనస్సూ, అనువిచారణకు గడంగి నప్పుడు దేహమనఃప్రాణములు నశ్వరములు, చంచలములు, క్షణికము లని గ్రహింతుము. 'సత్' అనగా సత్యము. సత్యము భూతభవిష్యద్వర్తమాన కాలముల యందు మార్పునొందునది కాదు. అట్లుండుటయే దాని ధర్మము. అందువలన వ్యతిరేక పథము నాశ్రయించి (నేతి-నేతి) గభీర భావమున దేహ మనఃప్రాణముల యసత్యతను గ్రహించి వానికతీతముగ నుండు సత్పదార్థమే సత్యమను జ్ఞానము గలిగినప్పుడు వివేకము మేల్కానును. సహజప్రేరణవలన వివేకము సత్యాసత్యముల కుండు భేదమును జూపించును. విచారము మిథ్యాప్రతీతిని రూపుమాపును. వివేకము సద్వస్తువును దేదీప్యమానముగ వెలుగ జేయును. మనయందుండు నిగూఢ సత్యము బుద్ధికి గ్రాహ్యమగునది కాదు. బుద్ధిద్వారమున దానిభావనామూర్తిని మాత్రము తెలిసికొన గలము. ఆభావమును నుపలబ్ధియందు వస్తుతంత్రముగ జేసికొనుటయే జ్ఞానయోగముయొక్క ద్వితీయ భాగ మందుము. ఆభావముతోడ బరిచయమును బొంది మనస్సును భావమయముగ నొనర్చి దానియం దేకాగ్రతయు తన్మయత్వమును బొందవలయును. సత్యమును (ఆత్మను)

బొందవలయుననిన శ్రవణ మనన నిధిధ్యాసలకు గడంగ వలయును. అవహిత చిత్తమున సత్యమంత్రమును విడుచు సత్యనామము సంజ్ఞల పరిచయమందు చిత్తమును మనస్సును నర్పించవలయును. సద్వస్తు చింతనమందు మునుంగవలయును. ఇట్లు క్రమక్రమముగ పరమతత్వ మును భావింపుచు కేవలము సద్వస్తుప్రతీతియందు నిలచినప్పుడు బాహ్యప్రతీతి నశించును. దేహ ప్రాణ మనస్సుల లీల మిథ్యామరీచికాతుల్య మగును. గుహా హితమగు ఆత్మతత్వము వికసించును. అప్పుడు సాధకు నకు అన్యచైతన్యముండదు. ఆతడు తురీయమందుండును. శుద్ధముక్తబుద్ధు డగును. జగత్తునందలి జ్ఞానము ఇంద్రి యగ్రామమునుండి నిర్విశేషముగ ముక్తినొందును. దానిని కైవల్యప్రాప్తి బ్రహ్మసిద్ధి యని యందురు.

సచ్చిదానందస్వరూప మగు బ్రహ్మపదార్థమే జ్ఞానయోగముయొక్క మహత్తరదానము. ఏసత్తునాశ్ర యించి సమస్తసత్తాలు గలుగుచున్నవో ఏచిత్తు సమస్తజ్ఞానమునకు మూలమో ఏయానందము పలువిధ సుఖదుఃఖములయందు అంతర్వాహినియై ప్రవహింపుచు న్నదో అదియే సచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మ ము. మానవునియందుండు గభీరతమమగు ఆత్మవస్తువును

జూపుటయే జ్ఞానయోగముయొక్క లక్ష్యము. హద్దులు ఖండములు స్థూలము మొదలగువాని కతీతమందుండు అనిర్వచనీయపూర్ణతత్త్వము, ఏకమును నిత్యసత్యమును పరిణామరహితమును అవిసంవాదియు శాశ్వతమును సనాతనమును ద్వంద్వరహితమునై యున్నది. అచ్చట శోకమోహములు లేవు. అతృప్తి లేదు. కాని జ్ఞానయోగము మానవుని తురీయమును నతీంద్రియము నగు వస్తువునం దుంచుటకు ప్రయత్నించి ఇహలోకయాత్రను ఇంద్రియగ్రామమును తుచ్ఛముగదలచి అగ్రాహ్యమొన ర్చుచున్నది. ఇది జ్ఞానయోగమందలి యభావము. దేహ మనోప్రాణముల లీల కేవల మనృతమును అసత్యమును గాదు. కాని వానిని సచ్చిదానందమయములుగ నొనర్ప వలయునను విషయమును జ్ఞానయోగి మరచుచుండును. నిత్యసత్యాన్వేషణ కుపక్రమించి సత్యముయొక్క శాఖ ప్రశాఖలతోగూడి ఫలపుష్పశోభితమై యలరారు స్థూలప్రకటనమూర్తిని జ్ఞానయోగి విసర్జించుచున్నాడు. జ్ఞానయోగి ఖండములను హద్దులను దప్పించుకొను చున్నాడు. కాని దానితోడ వైచిత్ర్యమును గోల్పోవుచు న్నాడు. ఏకత్వమును బొందుచున్నాడు. కాని యేకత్వము యొక్క వికాసమగు బహుత్వమును మరచుచున్నాడు.

పూర్ణయోగ సాధకుడుగూడ ఏకమును గోరును. కాని యాయేకమందుసమస్తమును బ్రతిష్ఠిత మొనర్చుకొనును. ఆయేకమును బహుత్వమందు వికసింపజేయుచుండును. బ్రహ్మపదార్థమును దేహప్రాణమనస్సులయందు బ్రకాశింపజేయును. ఏకత్వము - బహుత్వము, అతీంద్రియము- ఇంద్రియముల మధ్య దుర్భేద్యమగు ప్రాకారమును జ్ఞానయోగము నిర్మింపుచున్నది. కాని పూర్ణయోగి యాప్రాకారమును భగ్నమొనర్చి ఆరెంటియొక్క సామంజస్యమును కనుగొనును.

జ్ఞానయోగి తనయందుండు బ్రహ్మపదార్థమును దెలసికొనును. ఏకాంతభావమున బ్రహ్మపదార్థమును తనయందుమాత్రమే యుపలబ్ధినొందుటకు బ్రయత్నించును. కాని తనయందలి సత్పదార్థమును జగత్తునకు కేంద్రముగ దలంపక జగత్తునందలి పదార్థములను చైతన్యముయొక్క ఛాయయనియు మాయాలీలయనియు గ్రహింపక, వానియందు బ్రహ్మము నుపలబ్ధినొంది, ప్రతి వ్యష్టిగతచైతన్యమందునను పూర్ణబ్రహ్మమును దర్శింపవలయును. అప్పుడు జగత్తుయొక్క బాహ్యాభ్యంతరములయందు బ్రహ్మసాక్షాత్కారమగును. సమస్త ద్వైతములయందు అద్వైతోపలబ్ధి గలిగినప్పుడు జగత్తు

బ్రహ్మముల మధ్య మాయావాదులు చెప్పు కల్పితవ్యవధానము లేదని గ్రహింతుము.

బ్రహ్మపదార్థమందుండు చైతన్యముమాత్రము జ్ఞానయోగి లక్ష్యమందుండును. కాని చైతన్యధర్మమగు ప్రకాశము వికీర్ణము విస్ఫురణముల (శక్తి) నాతడు హృదయంగమ మొనర్చుకొనజాలడు. "చిత్ తపః" అను రెండును ఒక్కవస్తువనియు తపస్సునుండి 'చిత్' పుట్టినదనియు గ్రహింపవలయును. జ్ఞానయోగి విశుద్ధచైతన్యమును వాంఛించుచుండును. కావున నిష్క్రియుడగు అక్షర బ్రహ్మమును బొందుచున్నాడు. కాని చైతన్యమందుండు ప్రకాశాత్మకమగు ప్రేరణ, ఉద్గమనశీలశక్తి "సపర్యగాత్" వినాదధ్యానముండిన యెడల బ్రహ్మకర్మ పరుడైనాడని తెలిసికొందుము. అచలమగు స్థాణువు లేవ యచలత్వమును స్థాణుత్వమును రక్షించుకొనుచు గతియందు పరిణామమందు ప్రకటితమగుచుండుటను గ్రహింతుము. బ్రహ్మ యొక్క స్వరూపసత్తానుండి యీజగత్తుద్భవిల్లుచున్నది. దానియందే ప్రతిష్ఠితమగుచున్నది. సచ్చిదానందముల పరమశాంతిననుసరించి విశ్వశక్తి చంచలమును నిత్యలీలాయుతము నగుచున్నది. మనమీవిధముగ జ్ఞానయోగసాధనచేసినయెడల "శివమేవాద్వైతం శాంతం శివం సుందరం"

అనుదానిని జగత్తునందలి ప్రతివస్తువునందును ప్రతిగతి భంగిమయందును పరిస్ఫుటముగ గాంచగలము. మన చింతనలను భోగములను కర్మజీవనమును మన యభ్యంతరమందలి విమలమగు శాంతిమీదను, ముక్తియొక్క ప్రదీప్తచైతన్యముగు అఖండజ్ఞానముమీదను క్రీడించునటుల చేయగలము. అప్పుడు సాధారణజీవనమును బరిత్యజింపవలసిన యావశ్యకతయుండదు. జగత్కర్మలకు దూరముగదొలగుట యనవసరమగును. ఆసమస్తమును బ్రహ్మజ్ఞానముతోడ బ్రాహ్మిస్థితియందు సులలితముగను, లీలాయుతముగను జేయగలుగుదుము.



# త్రిమార్గయోగము.

## భక్తియోగము.

జ్ఞానయోగము మస్తిష్కమును, బుద్ధివృత్తిని, సత్యమును దెలిసికొనవలయునను ప్రేరణలనుండి మానవుని యాధ్యాత్మికసత్తాయందు బ్రతిష్ఠించుటకు ప్రయత్నించును. భక్తియోగము మానవునిహృదయమును ప్రేమవృత్తిని సౌందర్యాసక్తిని గైకొనును. జ్ఞానయోగిలక్ష్యము బ్రహ్మము, తురీయచైతన్యము. భక్తియోగిలక్ష్యము భగవానుడు, తురీయమగు ఆనందము. జ్ఞానయోగమువలన ఆత్మోపలబ్ధి గలుగును. అనగా స్వస్వరూపమును (స్వసత్తా) దెలిసికొని "నేను" అనుదానియందు విలీనమగును. భక్తియోగము ఆత్మసమర్పణమును ప్రణతియు నొనర్చి 'నేను' అనుదానిని 'నీవు' అనుదానియం దర్పించును. 'నేను' అనుదానియందు 'నీవు' అనుదానిని మిళితమొనర్చి ఆనందమందును, తృప్తియందును నోలలాడును. ప్రేమతృష్ణను మించిన ప్రబలవృత్తి మానవునియందు మరియొకటి లేదు. మానవుడు చింతింపుచుండును. కర్మ నొనర్చు

చుండును. కాని యవి యన్నియు బహిర్విషయములు. మానవుని కేంద్రస్థానము హృదయము. కావున హృదయ ద్వారముననే మానవుని నడిపింపవచ్చును. మానవుని మార్పునొందింప వలెనని బృహాత్తరమగు సత్పదార్థము తోడ నాతనికి పరిచయము గలిగింపవలయును. ఆ ప్రేమా కర్షణమున నడిపించుటవలన సహజముగ ఫలసిద్ధియగును. మానవుడు మానవుని ప్రేమింపుచుండును. మానవుని స్థాలమందు భగవానుని స్థాపించి, మానవుని మార్పు నొందింపవలయును. అప్పుడు మానవు డెంతసులభ ముగ మారునో గ్రహింపగలుగుదుము. మానవుడు నిరంతరము పరిపూర్ణ ప్రేమ నన్వేషింపుచుండును. కాని యది కేవలము మానవునియం దెట్లుసంభవించును? భగవానుడు పరిపూర్ణ ప్రేమమయుడు, అఖండభోగ మూర్తి, పరమసుందరుడు. కావున ప్రేమరసమందు నిగూఢమైయుండు రసరాజగుభగవానునియందు ఏకాంత చిత్తమున నిమగ్నము గావలయును. ఈశ్వరునియందు పరానురక్తి నార్జించుకొనుటను భక్తియోగమందురు. ఇట్టి యనురాగము గలిగినవారలకు చిత్తశుద్ధియు ముక్తియు అప్రయత్నముగ లభించును.

భక్తియోగము భగవానుని మానవగోచరునిగను

తనవానిగను జేసికొనును. మానవుడు తనకనురూపమగు-
వస్తువును గోరుచుండును. అట్టి వస్తువుతోడనే కలయిక
కలుగును. భక్తియోగము నవలంబించు మానవుడు
అతీంద్రియమును తురీయమును మహత్తరమునగు ఆదర్శ
మునకు దూరమందున్నానని తలంపడు. ఏలయన భక్తి
యోగము మానవుని మానవునిగమాత్రమే భావించి
సాధనప్రణాళికను నిర్ణయించును. మానవు డీజగత్తు
నందు పలువిధసంబంధములచేత బంధింపబడియున్నాడు.
ఆయా సంబంధములయందు తన హృదయధారను ప్రవ
హింపజేయుచున్నాడు. పుత్రులు - బాంధవులు స్నేహి
తులు - భార్య - సేవకులు మొదలగువారిమీదనుండు
ప్రేమ పలువిధ సంబంధములను స్థాపించుచున్నది.
మానవు డిట్టి సంబంధములలో నేదియోయొక సంబంధ
మును భగవానునితోడ గల్పించుకొనినయెడల
సులభముగ భగవానుని బొందనగునని భక్తి
యోగము నుడువును. భగవాను డత్యద్భుత
మును ననధిగమ్యమగు పదార్థముగాదు. "పితేవ
పుత్రస్య సఖ్యేవసఖ్యుః ప్రియః ప్రియాయాః" శాంత
ము - దాస్యము - సఖ్యము - వాత్సల్యము - మధు
రము - అని ప్రేమరసవిభాగము లయిదు. ఈ భావ

ములు మానవుని హృదయమం దున్నవి. మానవు నాకర్షించుచుండు భావమును మానవునిదిక్కునుండి మరలించి భగవన్ముఖముగ నొనర్చి భగవన్మయముగ జేసికొనవలయును. భక్త సీరుడగు హనుమంతుడు - అర్జు నుడు- యశోదాదేవి - శ్రీరాధికారమణియు, దాస్య సఖ్య వాత్సల్య మధుర రసములయం దోలలాడియున్నారు.

అనుకూలభావమున నేకాక ప్రతికూలభావము నను, మిత్రభావమున నేకాక శత్రుభావమునను, భగవ త్సాధన చేయవచ్చును. ఏదయిన వస్తువును గోరునప్పుడు మున్ముందు దానిప్రయోజనమును దాని తోడ మన కుండు సంబంధమును నిర్ణయించుకొందుము. మిత్ర భావమునం దెట్టి దృఢసంబంధ ముండునో శత్రు భావమం దట్టి ఘనతరసంబంధ ముండును. మిత్రుడు పరిస్ఫుటముగ గోచరించుచుండువిధమున శత్రువుగూడ సుస్పష్టముగ గనుపడుచుండును. శత్రుమిత్రుల యస్తి త్వము మానవునియందు జాజ్వల్యమానముగ వెలుంగు చుండును. కావున భగవానుని శత్రుభావమున బొందవచ్చును. కొన్నిసందర్భములయందు మిత్రభావ ము కంటె శత్రుభావమున సాధకుడు త్వరితముగ ఫల సిద్ధిని బడయును. ఏలయన, శత్రుభావమున సాధకుని

యం దావరించియుండు అశుద్ధతయు వికృతియు నేకో న్ముఖమై భగవానుని నెదుర్కొనును. అప్పుడు భగ వానుడు స్థూపాకారముదాల్చునట్టి యాయశుద్ధత నెక్క మారుగ ధ్వంసమొనర్చును. మిత్రభావమందు భగ వానుడు సాధకుని ప్రతియంగమందలి దోషమును గ్రమక్రమముగఁ దొలగించును. కావున దానికి కొంత కాలము పట్టును. అందువలన మిత్రభావమున ముక్తి యేడుజన్మలకనియు, శత్రుభావమున ముక్తి మూడు జన్మలకనియు, భాగవతమందు చెప్పబడియున్నది. ప్రణ యముయొక్క వెనుకదిక్కును ద్వేషమందురు. కావున ఘోరతరవిద్వేషమును ప్రణయముగమార్చుట యత్యంత సులభము. కాని యుదాసీనత యున్నచోట మాత్ర ము ఈ ప్రియసంబంధమును గలిగింపజాలము.

భగవానుడతీంద్రియుఁడును దేహరహితుడును సచ్చిదానందుడును మాత్రమే కాదు.. జగత్తునందలి స్థూలరూపమగు మానవుని ఇంద్రియములు మొదలగు వాని లీలయందు భగవానుని యానందస్వరూపము మూర్తిమై గోచరింపుచుండును. ఇదియే భక్తియోగ ముయొక్క మూలతత్వము. జగత్తునందలి సమస్త భోగ్య వస్తువులును, వానిని భోగించుటకు యంత్రస్వరూపము

లగు సమస్తేంద్రియములును, వానికాధారమగు దేహ జగత్తులును నిత్యసత్యములై యున్నవి. వీనిలో ప్రతిదానియందును సత్పదార్థముగలదు. పరస్పర సంబంధములయందు సత్సంబంధము గలదు. వాని పూర్ణ ప్రతికృతిని (ప్రతిబింబమును) భగవాను డనుచున్నాము. స్థూలముయొక్క ప్రకాశము, విభవము, మొదలగున వన్నియు భగవానునియందు సంపూర్ణముగ నున్నవి. భగవానునియం దవి యుండుటవలననే వెలుపల నీవికా సము గలుగుచున్నది. కావున భగవానుడు సకలైశ్వర్య ములకును- వీర్యమునకును- శ్రీకిని- ఆధారుఁడు. ఆయన యందే సమస్త భోగములు, రసములు, ఆనందములు, విరాజిల్లుచున్నవి. స్థూలవస్తువుయొక్క స్థూలవికాస మందు భగవద్వస్తువుతోడను భగవద్వికాసముతోడను సంబంధమును స్థాపించుకొని ఆ రసమునం దోలలాడుట యే భక్తుని లీలయైయున్నది.

భక్తుడు జగత్తును మిథ్యయని నుడువక దానిని భగవానుని నిగూఢలీలయొక్క బాహ్యమూర్తియనియు రాసలీలకు స్థానమనియు నెరుంగును. కాని యీజగత్తు తోడ భగవానున కుండు సంబంధము, సాక్షి లేక యుదాసీన రసగ్రాహక సంబంధమై యున్నది. భగవ

దానందమందు భక్తుఁడు భాసిల్లుచుండును. కాని భాగవత తపశ్శక్తి మానవుని (passive) భోక్తగమాత్రమే యొనర్పక అది కర్త (active) వలన నియుక్తమగుచున్న దను విషయమును నాతడు గ్రహింపజాలడు. భక్తుఁడు జగత్తునం దేది యేవిధముగ నుండునో దానియందు సమరసాత్మకమగు విపులానందమందు నిమగ్నుఁడగుచుండును. కాని ఆయానందలీలయందొాక విశేషలక్ష్యము- గతి- ప్రణాళిక గలదనియు వానిని మానవుడు ప్రజ్ఞాద్వారమున నంతరమం దుపలబ్ధి నొందుననియు కర్మద్వారమున దానిని విరాజిల్ల చేయవలయునను విషయమునం దాతఁడు సంపూర్ణముగ నుదాసీనుఁడై యుండును. అందువలన జగత్తాతని నేత్రముల కర్థస్ఫుటమగును. కావున నిదిజాగ్రతయగు వస్తుతంత్రముకాదు. భావప్రాదేశికమందలి సహజోన్మత్తతవలన భక్తిసాధకుఁడు సాధారణ జగత్తునుండి క్రమక్రమముగ జారిపోవును. ఇదియు భక్తిమార్గమందలి యభావము.

జ్ఞానికి భగవానునితో నుండు సంబంధము అతీంద్రియమును సృష్టికి వెలుపలనుండునదియై యున్నది. కాని భక్తుఁ డీసంబంధమును స్థూలతరమగు మానవునకు సన్నికటమొనర్చుచున్నాడు. ఇదియు భక్తిమార్గము

యొక్క విశిష్టత్వము. జగత్తుతోడను మానవజాతితోడను సంబంధముగలిగి సిద్ధజీవనమును దివ్యసామ్రాజ్యమును ప్రేమయందు ప్రతిష్ఠించుకొనును. మానవునకు మానవున కేకాక మనుష్యునకును సృష్టిపదార్థములకును ఆనంద సామంజస్యసంబంధము స్థాపితము గావలయును. ఆసమ రసలీలనే భక్తిమార్గము చూపుచున్నది. మానవున కుండు రూపతృష్ణయందును భోగవాసనలోను ఇంద్రియ పరిచలితజీవనమందును భగవానుని భోగేచ్ఛ దాగి యున్నది. అందు భగవదానందము స్రవింపుచున్నది. కావున వానినన్నిటిని వీడక భగవానునియందు పరిశుద్ధ ముగను పూర్ణముగ నొనర్చుకొని దివ్యజీవనమును బొంద వచ్చునని భక్తియోగము బోధించును.



# త్రిమార్గ యోగము.

## కర్మయోగము.

కర్మయోగి భగవానుని కర్మజీవనమందు వాస్తవముగ దర్శింపుచుండును. భగవానుఁడు జ్ఞాత భోక్త యేకాక, నియంతయు ఈశ్వరుఁడై యున్నాఁడు. భగవానుఁడు మహాకర్మి. ఈ కర్మశీలమగు జగత్తు భగవానుని యంగచలనము మాత్రము. భగవానునియొక్క స్పష్టమగు స్థూలప్రకాశ మీ జగత్తునందు మానవుని తోడ ఓతప్రోత భావమున మిశ్రితమైయున్నది. దీనికి వ్యతిరేకముగ నెవ్వఁడును క్షణకాలమైనను నిల్వఁజాలఁడు. అట్టి కర్మరాజియందు కర్మయోగి భగవానునితోడ సంయుక్తమగుటకుఁ బ్రయత్నింపుచుండును. కర్మయోగమందు మూఁడవస్థలు గలవు. మానవు డెట్టి పరిస్థితులయం దే విధమగుకర్మ యొనర్చినను దానిని భగవానుని యుద్దేశించి చేయవలయును. కర్మపుష్పాంజలిని భగవానుని పాదపద్మములయం దర్పింపవలయును. ఏలయన సాధారణముగ మానవుఁ డహంకారాంధుఁడై కర్మచేయుచుండును. అహంకారమే మానవునకును భగవానునకును మధ్యనుండు అంతరాయము. కావున

అహంకార మను గోడను బగులగొట్టినయెడల అనంత మందు సంచరింపవచ్చును. అందువలన సుఖదుఃఖ ములు - జయాజయములు - మొదలగువానియం దుదా సీనుడై కర్మకొరకు కర్మ నొనర్చుచుండవలయును. కాని తనకొరకు దాను కర్మను జేసికొనఁగూడదు. భగవదాజ్ఞానుసారము కర్మజేయుచున్నా ననుభావ మున కర్మను చేయవలయును. ఫలకాంక్షరహితముగ గర్మనొనర్చుటయే కర్మయోగముయొక్క మూలసూ త్రము. దీనిని నిష్కామమనియు ఆత్మసమర్పణమని యు దెలిసికొనవలయును. ఆత్మసమర్పణమును నిష్కా మభావమును దృఢమై, పరిపూర్ణస్థితి నొందినప్పుడు, అణుమాత్రమైనను ఫలాఫలముల వాసన యుండదు. కర్మమీాద నుండు కర్తృత్వజ్ఞానము సంపూర్ణముగ నశిం చును. అప్పుడు కరణీయము, అకరణీయ మను విష యము స్ఫురింపదు. ఉత్సర్గ మొనర్పవలసినది యుం డదు. ఏలయన నేను చేయుచున్న కార్యమే లేనప్పుడు నే నర్పింపవలసినది, యోచింపవలసినది, యే ముం డును? నా ద్వారమున భగవానుఁడు తనకార్యములను దాను జేసికొనుచున్నాడు. భగవానుని విరాట్శక్తి సాధకునియం దావిర్భవించినప్పుడు సాధకుడు స్వాతంత్రి

విహీనమగు యంత్రమును బోలి భగవదిచ్ఛానుసారము కార్యము లొనర్చుచుండును. ప్రబలవాయుసమ్ముఖమందలి పత్రమునుఁబోలి గిరగిర తిరుగుచుండును. అప్పుడు సాధకుఁడు కర్తగాఁడు, ద్రష్ట. పురుషుఁడు చూచుచుండును. ప్రకృతి సమస్త కార్యములు సేయును. శేషావస్థయందు భగవత్ప్రకృతియొక్క పూర్ణ ప్రేరణ సాధకునియందు కర్మనొనర్చును. అప్పుడు నేనను జ్ఞాన ముండదు. నా దృష్టి భగవానునిదృష్టి యగును. 'నేను' అనునది పరమపురుషునియందు విలీనమగును. దేహమనోప్రాణములు దివ్యప్రకృతియందు మిళితములగును. పరమపురుషుని యీషణమువలన నడచుచున్న విశ్వప్రకృతితోడ వ్యక్తిగతమగు సాధకుని ప్రకృతి కూర్పఁబడును. అప్పుడు భగవానుఁడు సాధకుని సంస్కారగతమగు ప్రేరణను ధరించి పరిసరములయందలి నిర్దిష్టకర్తవ్యముల గమనించి కర్మ నొనర్చును. వానియందు తనను దాను బంధించుకొనడు. భగవానుఁడు అలౌకికశక్తిద్వారమున తనయిచ్ఛానుసారము నూతనప్రేరణయందు నూతనకర్మను వికసింపఁజేయుచుండును.

కర్మయోగి కర్మవిముక్తికొరకు కర్మనుఁజేయును.

జీవునకు కర్మగలదు. కావున జీవుడు కర్మబద్ధుడు. కర్మ నశించినయెడల జీవునకు కైవల్యము గలుగును. కాని కర్మకు విముఖుఁడగుటవలన కర్మనాశనముగాదు. కర్మనుజేయుచు కర్మక్షయ మొనర్చుకొనవలయును. అహంకారముతోడ కర్మనొనర్చినయెడల నది బాధన మగునుగాని ముక్తినొసంగదు. కావున నేకర్మనొనర్చి నను దానిని యజ్ఞమూర్తియగు భగవానునియందు దావాహు తిగ నొసంగుచు సమస్తకర్మలను క్షయమొనర్చుకొనవల యును. కర్మబీజము నాశనమైనను, శరీర మున్నంతకాల ము పూర్వసంస్కారముల ప్రేరణమువలన దేహము కర్మల జేయుచుండును. కాని చివరకీదేహముతోబాటు పంచభూతముల బంధనములుగూడ నశించినప్పుడు, సాధ కుడు స్వస్వరూపమును బొందును. ఆతడు తిరిగి సంసార చక్రమందు దిరుగడు. తిరుగవలసిన యావశ్యకతయుం డదు. ఇదియే కర్మయోగియొక్క లక్ష్యము.

కాని కర్మయోగము నిట్టిసంకీర్ణపథమున నడిపింప వలసిన యావశ్యకత లేదు. మానవుని బంధించునది కర్మ కాదు. అజ్ఞానము, అహంకారము. కర్మ భగవత్స్వ రూపమునుండి యుద్భవిల్లినది. చిచ్ఛక్తి ద్యుతితోడ బ్రకాశింపుచుండు కర్మయందు భగవదానందము వెల్లి

విరియుచున్నది. కావున మున్ముందు అహంకారమును అజ్ఞానమును నాశనమొనర్చుకొనవలయును. అందువలన కర్మనశింపదు. మనల విడువదు. ఏలయన కర్మ సత్యమను గభీరమునగు ప్రదేశమందు స్థాపింపబడియున్నది. అహంకారమును అజ్ఞానమును నాశమొనర్చుకొనిన యెడల కర్మప్రవాహము విశుద్ధమును విపులమునై ప్రవహింపుచుండు ననువిషయమును మనము గ్రహింపగలము. ముక్తిగలిగినపిమ్మటనే యథార్థమగుకర్మ ప్రారంభమగును. అప్పుడు సాధకుఁడు అంతరంగమందు బ్రాహ్మీస్థితియందుండి వెలుపల విపులకర్మజీవనలీలను సృష్టింపుచుండును. అనగా నప్పుడేకర్మ జేసినను నదియంతరాత్మ యొక్క (తురీయ- భాగవత ప్రతిష్ఠిత) కర్మయగును. మరియు నిది స్థాణువిముక్తమై యనంతసత్తాయందు ప్రకటితమగుచుండును.

రెండుకారణములవలన త్రిమార్గయోగము మనకు సంతృప్తిని గలిగించుటలేదు. (౧) వీనిలక్ష్యము రూపవిహీనమగు ఆధ్యాత్మిక స్వరూపమైయున్నది. అది భూతముయొక్కయు, రూపముయొక్కయు పరిపూర్ణత్వము ఆధ్యాత్మికసత్యమను విషయమును త్రిమార్గ

యోగము గమనించుటలేదు. (౨) జ్ఞాన- ప్రేమ- కర్మ లను వృత్తులు మూడును, మానవునియందు ఓత ప్రోత భావమున నల్లుకొనియున్నవి. అందువలన వానిని జ్ఞానయోగము - భక్తియోగము - కర్మయోగము లని వేరువేరు మార్గములుగ విభజించుట కల్పితసృష్టియగు చున్నది. పరిపక్వతజ్ఞానికి ఈశ్వరునియందు పరానురక్తి తనంతట తానుగనే కలుగును. భగవానుని ప్రేమించు చుండువానియందు జ్ఞానము స్వభావసిద్ధముగ విలసిల్లు చుండును. జ్ఞానప్రేమల సార్థకత కర్మయందు గలదు. కర్మయోగియొక్క కర్మ, జ్ఞానప్రేమలయందు విరాజిల్లు చుండును. పూర్ణ యోగసాధకుడు జ్ఞానప్రేమకర్మల నొక్కమారుగ నెనర్చుచుండును. కాని తనయం దుండువానిని భాగించి యందొకదానిని మాత్రము గైకొని మిగిలినవానిని బరిత్యజింపడు.

యోగమార్గముల విశేషగుణములను జూపించి, వానియందలి యభావములను గనుపరచియున్నాను. కాని మన మే మార్గమున నడువవలయును? మన లోపల వెలుపల నుండు సమస్తసోపానములు - సత్తాలు - శక్తులయొక్క, పూర్ణాభివ్యక్తిని మనము గోరుచున్నాము. మనము భగవానుని సర్వతోముఖ

ధ్యానమున వాంఛించుచుందుము. అనగా భగవానుని స్వరూపమును రూపైశ్వర్యమును గోరుచుందుము. ఈ యుద్దేశసిద్ధికి హఠయోగము, రాజయోగము మొదలగువానియం దొక్కొక్కటి కొంతవరకుఁ దోడ్పడుచున్నవి. కాని యాయోగముల నన్నిటి నొక్కమారుగ సాధనచేయజాలము. ఏలయన ప్రతియోగమార్గమునకును విశేషనియమములును ప్రత్యేకక్రియలును గలవు. వానియం దొకదానికిని మరియొకదానికిని జటిలమును - సూక్ష్మము నగు విరోధములు గలవు. అందువలన యోగసాధనల నన్నిటిని నొక్కమారుగ జేయవలయుననిన మహావిపత్తుసాదు దగులొందుము. ఒకదాని తర్వాత మరియొకదానిని జేయవలయుననినను దుర్ఘటము. అయ్యది యొక జన్మయందే కాక బహుజన్మలయందుగూడ కొనసాగునది కాదు.

కావున నీసమస్తమార్గముల కొకసమన్వయసూత్రమును గనుపెట్టవలయును. ఆసూత్రమువలన సమస్తయోగములయొక్క నిగూఢరహస్యము బయల్పడవలయును. అట్టి సూత్రము లభించినయెడల నది మన లక్ష్యమునకు తగియుండును. కావున యోగమార్గమం దలి బాహ్యాంగములను పరిత్యజించియుండవలె యావాంతర

సంబంధములను దూర మొనర్చుకొనవలయును. సమస్త మార్గములకు ప్రాణమై సంపూర్ణముగ నిండియుండు సజీవ సత్యమును గ్రహించి, ఆసత్యప్రకాశమున గైకొనవలసినంత గైకొని, మిగిలినదానిని విసర్జించి, మనము గమ్యస్థానమును జేరవలయును.



# వేదాంత యోగము.

## తాంత్రిక యోగము.

:0:

యోగసాధనల నన్నిటినిఁ బరిశీలించి చూచిన యెడల వానియందు జ్ఞానము నిగూఢమై కన్పట్టుచుండును. అందువలన యోగమార్గముల నన్నిటిని వేదాంత యోగములని చెప్పవచ్చును. జ్ఞానయోగులు, భక్తియోగులు, కర్మయోగులు మొదలగువా రందరు జ్ఞానముమీద నాధారపడుదురు. మరియు జ్ఞానమును లక్ష్యముగను ఉపాయముగను గైకొని సాధనను చేయుచుందురు. జ్ఞానయోగివిచారవితర్కములు జ్ఞానముయొక్కయొకదిక్కునుమాత్రము వెల్లడించును. ఆజ్ఞానము బుద్ధియందున్నది. భక్తియోగుల కర్మయోగుల జ్ఞానము బుద్ధియందు బుట్టినదికాదు. కాని యదియును జ్ఞానమే. భక్తుని జ్ఞానము హృదయము నాశ్రయించి యుండును. ఆజ్ఞానము ప్రేమ విశ్వాసముల ద్వారమున వికసింపుచుండును. కర్మయోగిజ్ఞానము ఇచ్ఛాశక్తియొక్క పశ్చాద్భాగమం దుండును. ఆజ్ఞానము ఇచ్ఛాశక్తిద్వారమున కర్మయందు మూర్తీభవించును. రాజయోగ హఠయోగ సాధనల యంతర్గతమందుగూడ

జ్ఞానప్రాధాన్యత గన్పట్టుచున్నది. ఈయోగము లన్నిటి యందును పురుషుఁడు సాధకుఁడు. ఆత్మ ద్రష్టయు, జ్ఞాతయు, భర్తయు, భోక్తయు నై సాధనచేయుచుండును. మరియు విడనాడవలసినవాటిని విసర్జింపుచు, గైకొన వలసినవాటిని గైకొనుచు, ఆధారముల నలంకరింప వలసిన విషయముల నిర్ణయింపుచుండును. కావున నీ యోగమార్గము లన్నిటికిని పురుషుడు లక్ష్యము. చైతన్య మయమగు ఆత్మసత్తాతోడ గలియుటయే యోగసిద్ధి.

భారతవర్షమందు మరియొక విధమగు యోగ విధానము గలదు. దానిని తాంత్రికయోగ మందురు. ఆసాధన జ్ఞానముమీాద నాధారపడి యుండదు. దానికి పురుషుఁడు నియంతగాఁడు. తాంత్రికయోగమందు సాధకుఁడు ప్రకృతి; ఉపాయము శక్తి. పురుషుడు సాధకుడుగను, జ్ఞాన ముపాయముగ నుండు వేదాంత యోగసాధవల మూలమందు ఉదాసీనతయుండును. అందువలన సాధకుఁడు జగల్లీలల నుండి తనను వేరుపరచికొని దూరముగ దొలంగును. కాని తాంత్రికయోగి జగల్లీలలను గాగలించుకొనును. ప్రకృతి యందు నిగూఢమైయుండు ఆద్యాశక్తి (తపశ్శక్తి) తన యిచ్చవచ్చిన మార్గమున నడిపించును. వేదాంతులు

ప్రకృతిని మాయామయిగ నెరుంగుదురు. ప్రకృతి యంధప్రాయముగ నడచుననియు, దానియందు గన్పడు చైతన్యఛాయ పురుషుని స్పర్శవలన గలుగుచున్నదని యు దలంతురు. అందువలన వేదాంతులు ప్రకృతికి సర్వస్వ మర్పింపరు. ప్రకృతిని సహజస్వచ్ఛందగతితోడ బ్రవహింపుచు విలసిల్లజేయుట వారి లక్ష్యముగాదు. తాంత్రికయోగి ప్రకృతిని చిన్మయి యని యెరుంగును. అందువలన ప్రకృతి ప్రేరణమీద సంపూర్ణముగ నాధార పడి నడచుటకు తాంత్రికు డణుమాత్రమైనను వెను దీయడు. ప్రకృతిఛాయనుండి పురుషుని క్రమక్రమముగ విముక్తి నొందించుటయే వేదాంతయోగి యుద్దేశము. తాంత్రికయోగి జగచ్ఛక్తియొక్క సమస్తలీలలు సత్య మనియు, ఆనందపూర్ణములనియు, దలంచి ప్రకృతిని యాలింగనం బొనర్చుకొనును. అందువలన తాంత్రిక యోగి పురుషునిమీద ప్రకృతిని స్థాపింపుచున్నాడు. ఆధ్యాత్మికజీవనమందు శక్తిని సామ్రాజ్ఞిగ గైకొని యున్నాడు.

వేదాంతయోగి సాధారణజీవితమందలి యసం పూర్ణతకును, ఆధారముల యసమర్థతకును, అపరిశుద్ధత కును దూరమందుండి, జీవితమును నిగ్రహ మొనర్చు

కొనును. మరియు వానిదిక్కున నుండు జీవితముయొక్క సమస్తమనోగతులను దిప్పుకొనును. ఆధారముల బాహ్యాభ్యంతరములయం దుండు విశుద్ధపూర్ణాద్వైతపదార్థమును ధ్యానమువలనను, చిత్తైకాగ్రతతోడను, ప్రకాశింపజేయు చుండును. "జీవనముయొక్క పూర్ణధురి జీవనమందున్నది. ఆధారముల శుద్ధివిధానము ఆధారములయందే కలదు. కాని యవి వేరుస్థలమందు లేవు." అని నుడువు చుండువాడు తాంత్రికయోగి. మరియు నాతడు విశుద్ధచేతనాదీప్తమగు అనంతశక్తిని, అవ్యవహితకర్మప్రేరణను, ప్రకృతియం దుపలబ్ధి నొందుచున్నాడు. అందువలన జీవనమం దధిష్ఠించియుండు నామహాదేవియొక్క తర్జనీ సంకేతమువలన జీవితముయొక్క చంచలకర్మసముదాయమును, భోగసమూహమును, ప్రాకృతద్వారమున నడిపింపుచు దానున్నతిని బొందుచుండును.

వేదాంతసాధనవిషయము సత్పదార్థము; ఉపాయము వైరాగ్యము. తాంత్రికసాధనవిషయము తపశ్శక్తి; ఉపాయము భోగము. వేదాంతయోగి పురుషుని ఆశ్రయించును. తాంత్రికయోగి ప్రకృతిని ఆశ్రయించును. కాని యీద్వివిధసాధకులును సత్పదార్థమునకు విరుద్ధముగ శక్తిని, శక్తికి విరుద్ధముగ సత్పదార్థము

నుంచుటవలన, అర్ధసత్యమును మాత్రము గ్రహింపు చున్నారు. వేదాంతయోగులు శక్తిని వీడి సృష్టి భోగములయం దానందవిరహితమగు సన్యాసులను సృష్టించియున్నారు. తాంత్రికయోగులు సత్పదార్థమును మరచి అనాచారరతులగు భైరవభైరవీలను గల్పించి యున్నారు. వేదాంతులు త్యాగమును మహోత్కృష్టముగ జూపించినటుల, తాంత్రికులు భోగమును సర్వోత్తముగ గనబరచి యుండిరి. కాని వీరిద్దరును సహాయముగ నుండు దానిని లక్ష్యమునకంటెను నత్యధికముగ నాదరించియున్నారు. సత్పదార్థమునకును శక్తికిని, పురుషునకును ప్రకృతికిని, త్యాగమునకును భోగమునకును ఏవిధమగు విరోధము లేదు. ఇం దొకదానిక్రింద రెండవది యున్నదనినుపవజనదు. ఈ రెండునుసమానమనియెరుంగ వలయును. పూర్ణయోగముయొక్క సామంజస్య మిచ్చటనే యున్నది. ఆత్మ (పురుషుఁడు) ఈశ్వరు డనియు, ఈశ్వరునికర్మయొనర్చు శక్తిని ప్రకృతి యనియు, పూర్ణయోగి యెరుంగును. సత్పదార్థ (పురుషుఁడు) మఖండమును విశుద్ధమును అనంతము నగు ఆత్మసత్తాస్థై యున్నది. ఆ విశుద్ధసత్తాయొక్క ప్రేరణమువలన శక్తి (చిచ్ఛక్తి) క్రీడింపుచుండును. కర్మలయందుండు స్థితి గతి

విరామముల సంబంధము పురుషప్రకృతులయందు గలదు. శక్తి (కర్మప్రేరణ) యస్థిర చైతన్యము యొక్క యానందమందు విలీనమగునప్పుడు స్థితి లేక విరామము గలుగుచున్నది. దీని యపరనామము త్యాగము. పురుషుఁడు స్వశక్తియొక్క పలువిధకర్మల యందు తనను దాను వెల్లడించుకొనునప్పుడు కర్మయు, సృష్టియు, గలుగుచున్నది. ఇదియే యానందము. అనగా 'ఉండుట' కాదు; 'అగుట'. దీని యపరనామము భోగము. అగుటయే యానందము. అదియే సృష్టి; జగత్ప్రకాశ ప్రసూతికి మూలకారణము. మరియు దేనిసహాయమున, నేయుపాయమున, ఆనందవస్తురాజిని సృష్టిచేయుచు ఏకము అనేక మగుచున్నదో, అదియే తపశ్శక్తి.

ఈతపశ్శక్తియే పురుషుని చిచ్ఛక్తి. అనగా చిన్మయపురుషుఁడు తన విశుద్ధసత్తాయందు నిగూఢమై యుండు అవ్యక్తయనంతరూపమువిూద తన చేతనమును క్రీడింపఁజేయునప్పుడు పదార్థముల భావమయరూప ముద్భూతమగును. వ్యష్టియొక్క ఋతమయమును, సత్యమయము నగు అంతరాత్మను విజ్ఞానమందురు. ఈవిజ్ఞానము (సత్యభావము) సకలజ్ఞానముల

కును సకలశక్తులకును ఆధారమగు ఆత్మసత్తానుండి విని సృతమగుటవలన నది స్వసార్థకతకును, పరిపూర్ణత నొందుటకును నిర్గమింపుచున్నది. దేహమనోప్రాణముల యంతర్గతమందు విజ్ఞానధర్మ మణగియున్నది. ఈవిజ్ఞాన మొక నైసర్గిక ప్రేరణబలమువలన దేహమనఃప్రాణముల యందు రూపగ్రహణ మొనర్చి తననుదాను జాగరూక మొనర్చుకొనుటకు ప్రయత్నింపుచుండును. సకలయోగ సాధనలు విజ్ఞానమువిూదను, సత్యమువిూదను, ఋత మువిూదను, బృహత్తులవిూదను ప్రతిష్ఠింపబడి కార్యము లొనర్చుచుండును. ఈవిషయమును యోగమార్గము లన్నియు అంగీకరింపుచున్నవి. భగవద్గీతయందు భగ వానుఁ డిట్లు చెప్పియున్నాడు. "శ్రద్ధాన్వితుడు, భావ సమన్వితు డగువా డేదికోరిన నది వానికి లభించును. ఏవని కేవిధమగు శ్రద్ధయుండునో భావముగలుగునో వాని కది లభ్యమను. "యోయత్ శ్రద్ధః స ఏవసః"



# పూర్ణయోగస్వరూపము

—:o:—

మానవుఁడు ప్రకృతిని బరికింపుచుండుభావము ననుసరించి, యోగము ప్రారంభమగును. ప్రకృతి తనశక్తిద్వారమున పురుషునికి ఆత్మవికాసమును ఆత్మ చరితార్థతను గలిగింపుచున్నది. ప్రకృతి ద్వివిధముల నడచుచుండును. దానికి ద్వివిధలీలలు గలవు. అందొకటి సాధారణ నిత్య నైమిత్తిక జీవితమందుండును. రెండవది నిగూఢమగు దివ్యలీల. ఇందొకలీల పైమెట్టునను, రెండవలీల క్రింది మెట్టునను జరుగుచుండును. అహంకారమునకు వశవర్తులమై అజ్ఞానము, అశక్తి, దుఃఖము మొదలగువానియందు దగుల్కొని, వానిచేతి కీలుబొమ్మల బోలి యాడుచుందుము. ఈ లీల క్రిందిమెట్టునందు జరుగుచుండును. దీనిని ప్రాకృతజీవనమని యెఱుంగవలయును. అహంకారమును వీడి క్షుద్రత్వమును భేదబుద్ధిని అతిక్రమించి జ్ఞానశక్తియొక్క యానందలీలల యందు దగుల్కొనునప్పుడు ప్రాకృతికజీవనము నతిక్రమించెదము. అప్పుడు ప్రకృతియొక్క పరామూర్తిని బొందుదుము. దివ్యజీవనము గలుగును. క్రిందనుండి పైకి బోవుటను యోగమందురు. ఇది రెండువిధముల

జరుగుచుండును. ఇందొకటి క్రిందనుండి యొక్కమా రుగ పైమెట్టున కేగుట. అనగా ప్రకృతియొక్క అప రాలీలను పూర్తిగ వర్జించి యన్యత్రి యేగుటయగును. రెండవది క్రిందిమెట్టునం దుండుదానిని మార్పుజేసి పరి శుద్ధముగ నొనర్చుకొని పైమెట్టును జేరుట.

మన లక్ష్య మేదియైనను మానవుఁడు క్రిందిమెట్టు నం దున్నాడు. కావున క్రిందిమెట్టు నాశ్రయించియే పైమెట్టును జేరవలయును. కాని యోగమార్గము లన్నియు క్రిందిమెట్టును బరిత్యజించి, ప్రాకృతప్రేరణల యందలి ఒక్క విశేషగతి నాశ్రయించి, మిగిలినవాని నన్నిటిని విడనాడి, దానిసహాయమున భగవానునియందు గలియుటకు బ్రయత్నించును. కాని దీనిని పూర్ణ యోగి కోరడు. ఆతడు ప్రాకృతజీవనమందు అప్రా కృతదివ్యలీలలను వికసింపజేయుటకు బ్రయత్నించును. ఏలయన ప్రకృతియొక్క ప్రాకృతలీలయందు భగవ త్ప్రేరణ పరిస్ఫుటమై యున్నది. అంతర్యామియొక్క పూర్ణవికాసమువలన గలుగు పూర్ణచరితార్థతను పూర్ణ సత్య మందురు. దానియందు ప్రకృతియొక్క పూర్ణ సార్థకత కలదు. అందువలన పూర్ణయోగి జీవనమం దలి యొక భాగమందుగాని లేక విశేషప్రకరణముల

యందుగాని తననుదాను బంధించుకొనడు. ఆతడు జీవితము నంతను యోగమయముగ నొనర్చుకొనును. జీవనమందలి సమస్తవైచిత్ర్యములు, సకలజటిలసమస్యలు, ఉత్తమాధమకార్యములు మొదలగువాని నన్నిటిని యోగమం దంతర్భుక్తముగ నొనర్చుకొనును. సాధారణ మానవజీవితమందు ప్రకృతి యఖండభావమున లీల లొనర్చుచున్నది. కావున పూర్ణయోగి సిద్ధజీవనమందు ప్రకృతియొక్క పూర్ణలీలలను గోరుచుండును. భేదమిచ్చటనే యున్నది. మానవుని సాధారణజీవితము ప్రకృతియొక్క స్థూలగతికి ఆధారము. యోగయుక్తమగు మానవజీవనము దివ్యప్రకృతికి నిలయము. కావున మానవుని సమగ్రసత్తును పరివర్తనం బొనర్చి దానిని భాగవతసత్తాయందు గైకొనవలయును.

మానవుని సత్తాను భాగవతసత్తాతోడ మిళిత మొనర్చి తిరిగి దానిని బొందుటయే యుపాయము. భగవానుని ప్రభావమువలన మనప్రకృతిని భగవత్ప్రకృతికి ననురూపముగ నొనర్చుకొని అందు భగవానుని ప్రతిష్ఠించుకొనవలయును. మానవుని సాధనకు సాధకుఁడు భగవానుఁడు. ఆతఁడు వ్యక్తిగతసత్తా నాశ్రయించి మనల యంత్రములఁబోలి నడిపించుచు దివ్యరూపమున బ్రిక

టిత మగుచున్నాడు. ఏలయన మనజీవితమును పూర్ణ సత్తా యనునవి తపశ్శక్తియొక్క పరికాశములని యెరుంగవలయును. అభ్యంతరస్థితమగు దివ్యప్రకృతి యందు మన మఖండభావమున నిహితమయియుండు విధమున తపశక్తియం దుండవలయును. మరియు తపశ్శక్తి లీలను విస్తరింపజేయ గలిగినయెడల అది యవ్యర్థప్రేరణమువలన సాకృతశక్తిని పరివర్తిత మొనర్చి యచ్చట తన దివ్యమైన అఖండప్రకృతిని స్థాపించును. ఖండమును తమసావృతము నగుదాని యందు దివ్యమును సర్వజ్ఞము నగు శక్తి యవతరించును. అది క్రమక్రమముగ మన నిత్య నైమిత్తిక ప్రకృతి నంతను విశుద్ధజ్ఞానోద్భాసితముగను వీర్యపరిపూతముగను నొనర్చును. మానవజ్ఞానమునకును నశ్వరకర్మలకును మారుగ దైవలీలను విలసిల్లజేయును.

భాగవతభావమును పూర్ణవిజ్ఞానశక్తిని వికసింప జేయునది పూర్ణయోగము. సాధనదిక్కునుండి చూచిన యెడల అహంకారవిసర్జనమని గ్రహింపవలయును. అహంకారమున కతీతమందుండు వస్తువునకు అహంకారమును, మిగిలిన క్షేత్రముల నన్నిటిని, క్రమముగ నర్పింప వలయును. కాని యీసాధనమార్గము సరళమైనది

కాదు. ఈమార్గమందు నడచుటకు విపులశ్రద్ధయు, అకుంఠితసాహసమును, చలింపనిధైర్యమును గావలయును. ఏలయన దీనియందు మనము మూడుమెట్లను గాంచుచున్నాము. చివరమెట్టును జేరగలిగినయెడల సాధనమార్గము కంటకవిహీనమును తీవ్రగామియు నగును.

(౧) అహంకారమునకు సంబంధించిన కార్యములను భగవత్స్పర్శముతోడ పూర్ణ మొనర్పవలయును. (౨) సమస్త నీచప్రకృతిని దివ్యప్రేరణసహాయమున విశుద్ధముగ జేసికొని దానిని భాగవతప్రకృతియందు పరివర్తితము గావింపవలయును. (3) చివరకాయవస్థ పూర్ణత నొందవలయును. ఈమార్గము సుగమమైనను దుర్గమమైనను స్వశక్తివలన మనమీమార్గమున నడువజాలము. కావున మున్ముందు అహంకారమును వీడి నడచుచుండవలయును. అప్పుడు భాగవతశక్తి యలక్ష్యమగు యవనికనుండి సాధకుని దుర్బలస్థానముల నాక్రమించి శ్రద్ధను, సాహసమును, ధైర్యమును గలిగింపుచుండును. ఆశక్తి యంధునకు దృష్టిని గలిగించును. "పంగును" గిరోల్లంఘున మొనర్పజేయును. అప్పుడు బుద్ధికి యొక విధానము లేక మూర్తియు అంతర్నిహితమగు ధర్మమును గోచరించును. దాని యవ్యర్థగతి భద్రి

మును కళ్యాణమును జుట్టి చుట్టి తిరుగుచుండును. అప్పుడు హృదయ మొక ప్రభువును దర్శించును. ఒక సఖుని గాంచును. విశ్వమాతను దిలకించును. ఆప్రభువు ఆసఖుడు ఆతల్లి, సాధకుని మార్గమందు పడిపోకుండ పట్టుకొని నడిపించుచుందురు.

ఈమార్గమం దుండుబాధలు, విపత్తులు మరి యొకమార్గమందు లేవు. కాని యీసాధనలక్ష్యమును ప్రయాసముయొక్క విపులత్వమును దలంచుకొనునప్పుడును, మానవప్రకృతిని బరివర్తనంబొనర్చి దానిసకలాంగములను సమ్పూర్ణముగ గాపాడుచు వానినొక్క ధర్మమున జీవితకర్మయందు ప్రతిష్ఠిత మొనర్చుటతోడ బోల్చి చూచినప్పుడును, ఈపథమువంటి సుగమపథము మరి యొకటి లేదనియు, ఇట్టి సునిశ్చిత మార్గము వేరొకటి యుండుట యసంభవ మనియు, దెలిసికొందుము.

— —

# పూర్ణ యోగ ప్రణాళిక.

---

అపరాప్రకృతిమీద పరాప్రకృతి అఖండభావమున క్రీడించునప్పుడు ప్రాకృతస్వభావమందు భాగవత స్వభావ మవతరించును. అప్పుడు సాధకుని కార్యప్రణాళికయందు మూడులక్షణములు కనపడును. (౧) పూర్ణ యోగమందు ధారావాహికయగు నియమపరంపర గన్పట్టదు. మిగిలిన యోగములయందు నియమపరంపర లక్షితమగుచుండును. ఆయోగసాధకు లెప్పుడును నియమవశులై ప్రవర్తింపుచుందురు. క్రమముగ నొక మెట్టునుండి మరియొక మెట్టున కెక్కుచుందురు. కాని పూర్ణయోగసాధకుడు ముక్తమార్గమున స్వేచ్ఛాగతితోడ సంచరింపుచుండును. వానియందు సాధనశక్తి యిష్టమువచ్చినటుల బనిచేయును. కాని యేదియో యొక విశేషవిధానము ననుసరింపదు. అయినను నది క్రమక్రమముగ వృద్ధినొందుచు నిగూఢభావమున సాధనచేయుచుండును. సాధకుని వ్యక్తిగత ప్రకృతియం దుండు శుద్ధికిని సిద్ధికిని సంబంధించిన అంతరాయములను సహాయముల ననుసరించి శక్తి నియమితమగుచు నడచుచుండును. యోగసాధకు

లంద రొకభావమున, నొకవిలాసమున, అనగా ఋజుమా ర్గమున సరళరేఖయందు నడచుచుందురు. కాని పూర్ణ యోగసాధకుఁ డభ్యంతరమందలి నిగూఢప్రయోజనము ననుసరించి చుట్టిచుట్టి తిరుగుచు నడచుచుండును. పూర్ణ యోగసాధకులయం దొక్కొక్కరిది యొక్కొకమార్గ ము. ప్రతిసాధకుఁడును తన స్వభావానుసారముగ స్వసాధన కుపాయముల సృష్టించుకొనును. కాని యి ట్లనుటవలన పూర్ణయోగసాధకులయందు సాధా రణాధర్మము లేదని తలంపఁజనదు. సంకీర్ణమార్గ ములు పూర్ణయోగసాధనయందు లేవు. కాని దాని యం దొకప్రణాళికను శాస్త్రమును మనము గాంచ వచ్చును. ప్రకృతియొక్క కార్యప్రణాళికయందు విము క్తమును స్వాచ్ఛందము నగు గతి నిగూఢముగ నున్నది. కాని యది జడయంత్రమును బోలి యలంఘ్యగతిని నడ చుటలేదు. అయినను దానియం దొక నియమమును ధర్మమునుగలదు. కాని యవి యుదారములును సూక్ష్మ ములై యున్నవి. అవి సమస్తస్వాతంత్ర్యములను స్వేచ్ఛా చారములను నాలింగనం బొనర్చుకొని యుండును. అట్లుండుటయే ప్రాణధర్మము. కావున పూర్ణయోగ మందు ప్రాణధర్మము సంపూర్ణముగ విలసిల్లుచుండును.

(౨) పూర్ణయోగకార్యప్రణాళిక యఖండమై సాధకుని సమగ్రప్రకృతికి సంబంధించి యున్నది. అతీతుల పరిణతిస్వరూపమగు స్వభావమునకు మనమాధారులమై యున్నాము. అందువలన నందేవిధమగు ప్రయోజనోపకరణములను విసర్జింపగూడదు. సమస్తమును పరివర్తిత మొనర్చి భాగవత సత్తాతోడ నింపవలయును. మనయందుండు ప్రతి పదార్థమును నొకమహాశిల్పి గైకొని వానియం దతిక్షీణముగనుండు ప్రకాశమును జాజ్వల్యమానముగ నొనర్చును. మన యుపలబ్ధియు దృష్టియు స్పష్టమయిన కొలదిని నిమ్నతరప్రకృతియం దున్నామని గ్రహింతుము. మన దైనికజీవన మెట్టి యుపకరణములతోడ నడచుచున్నను, దానియం దెట్టి హేయమగు వికృతులను గాంచుచున్నను, వాని యన్నిటియం దొక్క సత్యధర్మమును కర్మను గాంచెదము. మరియు పూర్ణయోగము భగవానుని పూర్ణత్వమును బహిర్గత మొనర్చు చుండుటను దిలకించెదము.

(3) పూర్ణయోగమందు భాగవతశక్తి సాధకుని సమగ్రజీవనమును ఉపాయముగ గైకొని కార్యమును జేయుచుండును. మన యభిజ్ఞతయు, బాహ్యజగత్తుతోడ మనకుండు ప్రత్యేకసంబంధములును, ఎట్టి యకిం

చత్కారములైనను, ఆ సకలము నాశ్రయించియే పని చేయుచుండును. సాధకుని యభ్యంతర మందలి ప్రత్యేకానుభూతియు, మర్మయాతనయు, సాధనపథమందలి ప్రతిపదమందునను సహాయ మొనర్చుచు సిద్ధిని గలిగించుటకు నడిపింపు చుండును. అప్పుడు సాధకుని నేత్రములు తెరువబడును. భగవానుఁడు జగత్తునందు కార్యము లొనర్చుచుండు భావము హృదయంగమ మగును. సాధకుని యంతఃప్రకృతిగూడ నా ప్రణాళిక ననుకరించును. అంధకారము నుండి వెలుతురు బహిర్గతమగుచుండుటను గాంచగలము. దుర్బలుల యందునను పతితుల యందునను గూడ శక్తి యొక్క యభివృద్ధిబీజములు గోచరించును. దుఃఖదాయకమును కష్టకరము నగు వానినిగూడ నానందఝురితోడ నిర్మింపుచుండుటను జూడ నచ్చును. ప్రాకృతజగత్తునందు చూచు లీలావిలాసమును ఆధ్యాత్మిక జగత్తునందు గాంచుచుందుము. ప్రాకృతజగత్తునందు శక్తి మిక్కిలి నెమ్మదిగ పనిచేయుచుండును. అప్రాకృతమం దతితీవ్రముగ కార్యము లొనర్చుచుండును. అప్పుడు యంత్రము, ప్రభువును గుర్తించును.

ప్రకృతియొక్క యోగమును విశ్వజీవన మం

గును. ప్రకృతి తనయందు నిగూఢముగనుండు భగవానుని ప్రకటితమొనర్చుటకు ప్రయత్నించుచుండును. విశ్వప్రకృతి కార్యము మానవునియందు పరిపూర్ణమగునప్పుడు మానవుడు ప్రాకృతికసోపానముల నతిక్రమించి యాధ్యాత్మికసోపానమును జేరును. అప్పుడు ప్రాకృతిక శక్తిస్థానమందు యోగశక్తి యావిర్భవించును. మరియు నాపూర్ణయోగశక్తి చంచలమైయుండు మానవుని ప్రకృతిశక్తిని యడంచి మానవునియందంతటను వ్యాపించి కార్యము లొనర్చుచుండును.



# పూర్ణ యోగ ఫలము.

—:0:—

పూర్ణయోగసాధనప్రణాళిక పూర్ణమును అఖండమునై యున్నది. దానిఫలముగూడ పూర్ణమును అఖండము నని యెఱుంగవలయును.

ప్రథమమునుండియు భాగవతసత్తాను సంపూర్ణముగ నుపలబ్ధినొందుటను పూర్ణయోగమందురు. భగవానుని పూర్ణముగబొందుట యనసర్థమేమి? భేదవిరహితమును అద్వితీయము నగు ఏకత్వమునుమాత్ర ముపలబ్ధినొందుటగాదు. భగవానుని యనంతరూపవైచిత్ర్యమును ఉపలబ్ధినొందుటను పూర్ణయోగమని యెఱుంగవలయును. ఆత్మయం దేకత్వము నుపలబ్ధినొందుటయే కాక, దానిని కర్మయందును, సృష్టియందును, ప్రాణికోటియొక్క పలువిధలీలలయందును హృదయంగమ మొనర్చికొనవలయును.

అందువలన పూర్ణమును అఖండము నగు ముక్తి కావలయును. సాయుజ్యముక్తి యఖండముక్తి కాదు. ఏలయన దానియందు ఆత్మయొక్క వ్యక్తిగతమగు సత్తా భేదజ్ఞానమందును, ద్వంద్వబోధయందును, భాగవత సత్తాను స్పర్శింపుచుండును. సాలోక్యముక్తి నిగూడ

అఖండముక్తియని నుడువుటకు వీలులేదు. ఏలయన సచ్చిదానందములయందు (భగవత్ప్రకాశమందు) సాధకుని చేతనము మేల్కొనును. పూర్ణ యోగమువలన సాధర్మ్య ముక్తి గలుగును. ఏలయన మానవుని ధర్మమును భగవానుని ధర్మమును వేరుగావు. మానవుడు నిమ్నసోపానమందుండి, భాగవతసత్తాయందును భగవ త్ప్రేరణయందును సకలకర్మలను చేయుచుండును. అప్పుడు భగవానుడు మనుష్యరూపమును ధరించియున్నాడని దెలిసికొందుము. జ్ఞాన ప్రేమ కర్మల పూర్ణసామంజస్యము వలన నీయఖండోపలబ్ధియు, అఖండముక్తియు గలుగును. 'నేను' అనునది లోపించి యన్నిటియందును, అన్నిటినివీడి యఖండలక్ష్యమందు నేకీభూతమగును. చేతనము, జ్ఞానము విభజింపబడనప్పుడు కైవల్యము యొక్క యేకత్వానంద ముపలబ్ధినొందు విధముననే నానావైచిత్ర్యములయందలి రసమును గ్రోలుదుము. సత్తాయొక్క నిగూఢస్థానమందు ప్రేమమయునితోడ మిళితమై జగత్తునందలి బహువిధసంబంధములయందు ప్రేమానందముల బ్రసరింప జేయుచుందుము.

ఈభావమున జగత్తును, జీవనమును, ఆలింగనం బొనర్చుకొన గలిగినయెడల అంతరాత్మయం దుదార

ముక్తి లభించును. అప్పుడు జగత్తునుండి విముఖులమగుటకు బ్రయత్నింపము. జగత్తు నాశ్రయించి యుందుము. దేహమనోప్రాణములయందు భాగవత్ప్రేరణాప్రవాహము బ్రవహింపుచుండుటను గాంచగలము. మానవుని ద్వారమున జగత్తునందు భాగవతకర్మ నెరవేరుచుండుట ప్రత్యక్షమగును.

భాగవత జీవనమందు గలుగునది ముక్తిమాత్రము గాదు. దానియందు శుద్ధి, భుక్తి, సిద్ధి యను నవి గూడ గలుగును. అఖండశుద్ధి యొకదిక్కున భాగవత సత్తాను సాధకుని సత్తాయందు పరిపూర్ణముగ ప్రతిఫలింప జేయును. మరియొకదిక్కున సత్తాయొక్క సత్యాధర్మమును, కర్మను, ఋతమును, సాధకుని కర్మజీవనమందు వికసింప జేయును. సాధకుని యుపాధిశుద్ధిగానంతవరకును, భాగవతప్రేరణ ప్రణాళికగ పరిణమించనంత దనుకను పూర్ణముక్తి లభింపదు. పూర్ణశుద్ధిగలిగినప్పుడు పూర్ణ భుక్తి గలుగును. అప్పుడు జగత్తున కతీతమందుండు ఆనందమును భోగింపగలము. జగత్తునందలి సమస్తవస్తువుల రసమును ననుభవింపగలము. అనగా నప్పు డానందస్వరూపముయొక్క ప్రతీకరూపముననను, విగ్రహరూపముననను, సమస్తము ననుభవింతుము. ఆధారములు

శుద్ధియై దానియందలి ప్రతిసోపానమందును భగవద్ధా నందము ప్రతిష్ఠింపబడినప్పుడు సాధకుఁడు మానవధర్మా వలంబి యగు భగవానుఁడగుచున్నాడు. ఆయవస్థను సిద్ధి యందురు. మానవప్రకృతియందు భగవానుఁ డావిర్భ వించును. సాధకుని సత్తాయందును ప్రేమానందముల యందును జ్ఞానకర్మలయందును భగవానుఁడు ప్రకటిత మగును. మరియు నాయీశ్వరుఁ డొక్కమారుగ నేక ముగను ననేకముగను, జ్ఞానముగను శక్తిగను, సత్తుగను తపస్సుగను, ప్రకటిత మగుచుండును. అప్పుడు సాధ కుఁడు మానవుఁడుగ పూర్ణుడగును. కాని యేదియో యొకభాగమునుగాని, యేదియో యొకయంగమునుగాని, ప్రతిష్ఠానమునుగాని విసర్జింపక సమస్తము నాలింగనం బొనర్చుకొని అఖండసమగ్రతయందు మహిమాన్వితుఁ డగును. హఠయోగ రాజయోగముల యందు గలుగు కాయసిద్ధియు మనోసిద్ధియుగాక మనశ్శరీరములకు పూర్ణ సిద్ధి పూర్ణయోగమందు గలుగును. అట్లు కలుగనియెడల పూర్ణయోగమువలన ప్రయోజనంబుండదు. మనోశరీరము లయందు నిగూఢమై యుండు ఆధ్యాత్మికధర్మము వికసింప వలయును. మనస్సుకొరకు మనస్సు, శరీరముకొరకు శరీర మని తలంపరాదు. మనోదేహములు భగవానుని

క్కారకేర్పడియున్నవి. ప్రాకృతజగత్తునందు మనకు మూడుసోపానములు గన్పట్టుచున్నవి. వానిని స్థూలజగత్తు, మానసికజగత్తు, ఆధ్యాత్మికజగత్తని నుడువుచుందుము. పూర్ణయోగ మీ మూడింటియందును సామంజస్యమును గలిగింపుచుండును. సమస్తమున కాధారమును బునాదియై యుండునది స్థూలజగత్తు. కార్యములేక ప్రణాళిక (యంత్రముగనుండునది) మానసికజగత్తు. ఆదర్శమును, లక్ష్యమును, సాధ్యమును, ఝరియు నగునది యాధ్యాత్మిక జగత్తు. ఈయాధ్యాత్మికజగత్తు మధ్యవర్తియగు మానసికజగత్తు సహాయమువలన స్థూలజగత్తును స్థాపింపుచున్నది. పూర్ణయోగము జగత్తునందలి సమస్తకార్యములయందును లిప్తమై జగదతీతమగు ఆధ్యాత్మిక ప్రతిభను మూర్తివంతముగ జేయుచుండును.

ఈయఖండత్వమును, పూర్ణత్వమును, విశ్వమానవునితోడ సంబంధించి యున్నది. ఇది వ్యక్తియందు బంధింపబడి యుండినయెడల పూర్ణముగాదు. సంపూర్ణమగుటకును వీలులేదు. ఏలయన పూర్ణముగ భగవానుని యుపలబ్ధినొందినయెడల భగవానుఁడు మనయందు విరాజిల్లుచుండువిధమున మనవెలుపలను, సమస్తమానవులయందును, విరాజిల్లుచుండును. కావున సమస్తమాన

వుల పూర్ణతయందు, సిద్ధియందు, మానవుని పూర్ణత యు సిద్ధియు సంభవమగును. అప్పుడు విశ్వమానవుని తోడ నైక్యము ననుభవింపగలము. ఆయైక్యానుభవము సాధకుఁ డనుభవింపుచుండు అమృతమును, సమస్త మానవులు గోరులునట్లు చేయుచుండును. కావున వ్యక్తిగత సిద్ధియొక్క లక్ష్యము విశ్వమానవసిద్ధి యని యెరుంగ వలయును.

పూర్ణయోగము, మానవుని స్థూలజీవనమును వ్యక్తియొక్క, జాతియొక్క, విశ్వమానవజాతియొక్క సమస్త కార్యములను దివ్యభావమున నోలలాడించును. విపులమగు ఆధ్యాత్మికసత్తాయందు సమస్తమును అఖండ సామంజస్యము నొందించును. ఆమహాప్రయత్నము వ్యష్టిగతసాధనకును, సమిష్టిగతసాధనకును, లక్ష్యమును ఫలము నని యెరుంగనగును. ఇందువలన మానవుని బాహ్యాభ్యంతరములయందు స్వర్గరాజ్యము స్థాపితమగు ను. సమస్త దేశములయందును సకలయుగములయందు ను ఋషులు, కవులు, సాధకులు, గోరుచుండు కృత యుగము మానవమండలికి లభ్యమగును. మనము నవీన యుగసాధకులము. జగత్తులోను మానవునియందును మానవజాతియందును భగవానుఁడు దాగియున్నాడు.

కావున భూమండలమందు కృతయుగము వచ్చునటుల మనము చేయవలయును. ఇట్టి సాధనయే యదార్థ సాధన.

— —

# యోగసాధన.

## యోగోద్దేశము.

యోగమువలన ముక్తిగలుగునని మనము చిర కాలమునుండి నమ్ముచున్నాము. కాని యీనమ్మకము నెకింత మార్చుకొనవలయును. ఏలయన ముక్తియన "లయము" అని భావింపఁజనదు. లయము నన్వేషింప దగదు. మనలక్ష్యము లయమైనయెడల ఆత్మపరిణామ మును ఖండీకృత మొనర్చిన వార మగుదుము. భగవ దిచ్ఛకు మారుగ మనయిచ్ఛను నెలకొల్పుటకు బ్రయ త్నించుట యగును. అహంకారము అజ్ఞానము మొద లగు ద్వంద్వములనుండి దప్పించుకొనుటను ముక్తియని యెఱుంగవలయును. యోగముయొక్క ప్రథమపాదము ముక్తి. శుద్ధి, ముక్తి, భుక్తి, సిద్ధి యని యోగాంగము లు నాలుగు. ఇందు శుద్ధి, ముక్తి యను రెండును యోగ ముయొక్క ప్రథమపాదములు. వీనివలన సాధనక్షేత్ర ము సంసిద్ధమగును. యోగముయొక్క పూర్ణసార్థకత భుక్తి, సిద్ధి యందు న్నది. భగవత్ప్రేరణవలన గలుగు అభ్యాసములు సంస్కారములతోడ మనము పరిపూర్ణ ము గావలయుననిన పురాతనాభ్యాసములు గతానుగతిక

మగు అంధసంస్కారములనుండి దప్పించుకొనవలయు
ను. దేవభావమును బొందుటకుగాను మానవస్వభావము
నుండి విముక్తి నొందవలయును. "తేనత్యక్తేన భుంజీ
థాః" త్యాగద్వారమున భోగింపవలయును. జ్ఞానము,
శక్తి, ఆనందము, ప్రేమ, స్వాస్థ్యము, సౌందర్యము
మొదలగు వానివలన పూర్ణులముగావలయును. అప్పుడు
మనము భగవానుని బోలి యభ్యంతరమున స్వరాట్టు
గను బాహ్యమందు సామ్రాట్టుగను నుందుము. అప్పుడే
యోగసిద్ధి గలిగినదని గ్రహింపవలయును.

ఈవిషయమునుగూర్చి యొకింత విపులముగ
జర్చించెదను. యోగముయొక్క ముఖ్యసూత్రమును
మనము సరిగ గ్రహించుటలేదు. ఏలయన జ్ఞానారంభ
మునకును, జ్ఞానసిద్ధికిని, వైరాగ్యమే ముఖ్యసాధనమని
యనేకుల యభిప్రాయము. కాని వైరాగ్యము నిత్యము
కాదు. అది మనస్సుయొక్క తాత్కాలికావస్థ. సాధన
కాలమందు దీనిప్రయోజన మత్యద్భుతము. పురాతన
మగు ధృడసంస్కారములు అభ్యాసములు మొదలగునవి
స్వప్రయత్నమువలన దొలంగనప్పుడు భగవానుఁడు
మనయందుండు వైరాగ్యమును మేల్కొలుపును. అందు
వలన పూర్వసంస్కారములు అభ్యాసములు దొలంగును.

చిత్తచాంచల్యమును అశాంతియు, జ్ఞానమునకును భగవ
త్ప్రేరణకును విఘ్నములను గలిగింపుచుండును. అప్పు
డభ్యాసమువలన దొలంగని చాంచల్యమును అశాంతిని
వైరాగ్యమువలన నశింపజేసికొనవచ్చును. కాని మనస్సు
స్థిరమై విషయసంపర్కములవలన పూర్వసంస్కారముల
తో గలసి యాందోళనను జేయనప్పుడు జ్ఞానము
స్వతస్సిద్ధముగ ప్రకాశించును. స్వప్రేరణవలననే శక్తి
వృద్ధియగుచుండును. అప్పుడు మన మొనర్పవలసిన
సాధనయనునది యుండదు. సిద్ధియొక్క క్రమవికాసము
మాత్రముండును. ఆ సిద్ధి పూర్వకల్పితముగాని, లేక
యెదియో యొకస్థిరమైన నిర్దిష్టమార్గమును గాని యను
సరింపదు. సహజసిద్ధమగు నియమము ననుసరించి
మానసపుడు ప్రవర్తింపుచుండును. ఉచ్ఛ్వాసనిశ్వాసల
విడచుచుండును. అటులనే స్వతస్సిద్ధముగ స్ఫురించు
నియమవశమున యోగము స్థిరమగును. అది ప్రకృతి
యందలి యాదిశక్తివలన వృద్ధినొందుచుండును. అట్టి
స్థితియందు కష్టసాధ్యములగు బ్రయత్నములతోడ బని
యేమున్నది? వైరాగ్యవిముఖత్వమువలన లాభమేమి?
కావున ఆసక్తిని విడువవలయును. వైరాగ్యముమీద
నుండు ఆసక్తియు ఆసక్తియేగదా? అందువలన లోభ

మును విసర్జించునటుల వైరాగ్యమునుగూడ త్యజింపవల యును. క్షేత్రమును అవస్థల ననుసరించి లోభ వైరాగ్య ములు రెండును బ్రయోజనీయములును, అనిష్టదాయక ములునై యుండును.

బౌద్ధభావవివశులు "జగత్తు దుఃఖమయము, సదావిధముగ దీనినుండి దప్పించుకొనుటయే పరమ పురుషార్ధము" అని నుడువవచ్చును. మాయావాదమున జిక్కుకొనినవారలు "జగత్తునుండి దప్పించుకొనుటకు మన మీ జగత్తునకు వచ్చియున్నాము" అని పలుక వచ్చును. కాని యట్టివారల కాత్మసమర్పణయోగము రుచింపదు. నేను వేదాంతిని. అంతకంటెను మిక్కు టముగ తాంత్రికుడను. "ఈజగత్తు ఆనందమునుండి యుద్భూతమై యానందమందు బ్రతిష్ఠింపబడినది. ఆనందమునుండి యానందము పొంగిపొరలుచున్నది." అను విషయమును నేనెరుంగుదును. వైదిక ద్రష్టలజ్ఞానము సర్వోత్కృష్టజ్ఞాన మను విషయము నాకు హృదయంగ మము. శక్త్యానందముల మీద సమస్త మాధారపడి యున్నది. మరియు దుఃఖదార్బల్యములు వాని వికార ములు మాత్రమే. ఆవికారముల కజ్ఞానము మూలము. సత్యమ్; ఋతమ్, బృహత్ నం దున్నామను విషయ

మును మనము మరచుచున్నాము. అజ్ఞానము మనల జుట్టుకొని సత్యమును మరుగుపరచుచున్నది. వికారము శాశ్వతముగాదు. కాని పరిచ్ఛిన్నమైన దేశకాలముల యందాబద్ధమై యుండునంతవర కది సత్యముగ దోచుచుండును. దానివికాసము కలియుగమున మాత్రమే యుండును. దానిలీల భూమండలమందు జరుగుచుండును. కావున మనము దుఃఖదౌర్బల్యములను నశింపఁజేసికొన వలయును. దేశకాలముల కోణములనుండిగూడ వానిని సమూలముగ బెరికి పారవేయవలయును. ఇదియే మన లక్ష్యము. మానవునికొరకును మానవజాతి క్షేమము కొరకును భూమండలమును దేవలోకముగ మార్చవలయును. కలియుగమును బారదోలి సత్యయుగమునుఁ బ్రతిష్ఠింపవలయును. ఏ మతవాదము జగత్తును దుఃఖమయమని చెప్పునో, సకలధర్మముల విసర్జించి మానవుని జగత్తునకు విముఖుడవ్వ గమ్మని యుపదేశించునో, కర్మనువీడి వైరాగ్యమును ధరించుటయే ముక్తియనియు, జీవితలక్ష్యమనియు నుడువునో, అట్టి మతమును మనము విశ్వసింపజాలము. ఏలయన భగవానుఁడు మంగళమయుఁడు, దోషద్వేష రహితుఁడు. అట్టి భగవానుని రూపమును ప్రకాశము నగు నీసృష్టి య

మంగళమునకు నిదానమును సమస్తదోషముల కాకర మెట్లగును? జీవితము ఘోరతరమగు దుస్స్వప్నమనియు శూన్యగర్భమనియు మృగతృష్ణయనియు నుడువువాక్యములను మనమంగీకరింపవలదు. వేదఋషుల నుండి మన మట్టి జ్ఞానమును బొందుటలేదు. మనస్వానుభవమునకును దీనికిని సంబంధములేదు. సృష్టి మహాత్సత్యమనియు, శాశ్వతానందములకు నిలయమనియు, పరాజ్ఞానముచే నావరింపబడినదనియు, మన మనుక్షణ ముపలబ్ధి నొందుచున్నాము. సృష్టియొక్క కర్మప్రవాహమందలి కర్మప్రేరణను, వాసననుండి దప్పించి కర్మసాగరమందు మిశితమొనర్చవలయు నను విషయమును నిరంతరము గ్రహింపుచున్నాము. కావున కర్మప్రేరణను నాశనమొనర్చుటకు బ్రియత్నించుట యదార్థముగాదు. ఆసక్తివిహీనుడై (నిష్కామకర్మి) కర్మ నొనర్చుచుండు కర్మయోగి పొందుచుండు జ్ఞానానందపూర్ణత్వములను కర్మత్యాగి యగువా డేవిధముగ ననుభవింప గలుగును? మహాభారతమందు శ్రీకృష్ణభగవాను డీవిధముగ జెప్పియున్నాడు. "జగత్తునందు కొందరు కర్మశిక్ష నొసంగుదురు. మరికొందరు నైష్కర్మ్యశిక్ష నొసంగుదురు. కాని నేను నైష్కర్మ్య శిక్ష నొసంగు దుర్బలుల మతావలంబుడను

గాను "నమేమతమ్ తస్యదుర్బలస్య" విశ్వాధారయందు దేవకులము కర్మయొనర్చిన మహత్తరాదర్శమును శ్రీ కృష్ణభగవానుడు మన సమ్ముఖమం దుంచియున్నాడు. గెట్టి యనునాతడు ప్రాకృతికశక్తిసమూహాము వెనుక నెల్లప్పుడు విరాజిల్లుచుండు ఆత్మప్రతిష్ఠితమగు, శాంతిని యుదారధైర్యమును, విశ్రాంతివిహీనమగు ప్రేరణను, దర్శించియుండెను. అటులనే మనకర్మసమూహాము గూడ సజీవముగ నొనర్చుకొనవలయును. సూర్య చంద్ర గ్రహనక్షత్రములబోలి మనకర్మ విరామములేని గతి తోడ పరుగిడుచుండవలయును. కాని యం దణుమాత్రి మైనను స్వార్థమును అహంకారమును నుండజనదు.

ఈయాదర్శమును మనము బాగుగ గ్రహింప వలయును. "అజ్ఞానిని, బద్ధుడను, శక్తిహీనుడను" అని యెప్పుడును దలంపవలదు. మనమొకప్పు డజ్ఞానుల ముగను, మరియొకప్పుడు దుర్బలులముగను, వేరొకప్పుడు బద్ధులముగను నుందుము. కాని యది యదార్థముగాదు. ఏలయన కార్యములను మరింతదృఢముగ నొనర్చుట కావిధముగ నభినయించుచుందుము. "నటకుని" బోలి మన మీా సంసారనాట్యరంగమునందు పలువేషముల ధరించి సుఖదుఃఖముల ననుభవించుచుందుము. కాని

యదార్థముగ మనము దుఃఖము ననుభవించుటలేదు. ఆనందముయొక్క వికారము దుఃఖమును విషయమును మన ముపలబ్ధినొందవలయును. ఇచ్ఛవచ్చినప్పుడు మన మీా భూమికలను బరిత్యజింపగలము. అట్లు బరిత్యజింపగల శక్తి గూడ మనయందే యున్నది. కాని మనల నధమకీటకములని నుడువువా డెవ్వడు? నేను బ్రహ్మను. 'సోఽహం. అహంబ్రహ్మాస్మి.' పాపము నన్ను స్పృశింపగలదా! నన్ను పాపియని నుడువువా డెవ్వడు? నాకు దుఃఖముగలదా? నేను భగవానుడను. ఆనందమంతయు నాయందే ప్రవహింపుచున్నది. నన్ను దుర్బలుడని నుడువువా డెవ్వఁడు? నే ననంతశక్తియుతు డగు భగవానున కభిన్నుడను. ఈశ్వరు డొక్కడయ్యు అనంతరూపములు దాల్చియున్నాడు. ఆత డనంతసమిష్టియై యున్నాడు. మరియు నాతడే వ్యష్టిరూపమున బ్రకాశింపుచున్నాడు. ప్రతివ్యష్టియందు ననంతమున్నది. ఇది సృష్టియొక్క గుప్తతత్వము, ఉత్తమ రహస్యము. ఈగుహానిహితమగు తత్వము తర్కమున కందునదికాదు. కాని శ్రద్ధావంతునిదృష్టికి స్వయంసిద్ధముగ గోచరించును.

నిన్ను నీవు తెలిసికొనుము. అప్పుడు, 'నేను' అను మహాత్తరవిషయము హృదయంగమ మగును.

వాసనాజాలమందు దగుల్కొని మత్తుడవును, బద్ధుడవు
నై యుండినయెడల భగవానునిఁ బొందజాలవు. వైరా
గ్యసాధనవలన సకలబంధములను దెగద్రెంచుకొనినను,
భగవానుని గాంచజాలవు. కావున వాసనవలనగాని,
వైరాగ్యమువలనగాని, ప్రయోజనము లేదు. కావలసి
నది యాత్మసమర్పణము. 'నిన్ను' నీ వని దలంపవలదు.
జగత్తునందలి లీలయు, ప్రకృతియు నీవిగావు. అది భగవ
ద్భావము, భగవద్విభూతి. నీనుండి 'నేను' అనుదానిని
దప్పించి యచ్చట భగవానుని బ్రతిష్ఠించుకొనుము.
అప్పుడు నీబుద్ధియందు భగవానుని సత్యజ్ఞానములు విక
సించును. నీహృదయమందు భగవదానందము
పొంగిపొరలుచుండును. కర్మప్రేరణయందు భగవదిచ్ఛ
యే కార్యకారియగును. నీశరీరము భగవల్లీలకు రంగ
మగును. అప్పుడు నీవు భగవదింగితమువలన నొక
ప్పుడు ఝంఝూమారుతమును బోలి రుద్రుడవగుదువు.
మరియొకప్పుడు శుభ్రజ్యోత్స్నను మించి హాస్యమయుడ
వగుదువు. వేరొకప్పుడు భూకంపమును మరపునకు
దెచ్చు మమత్వరహితమగు ధ్వంసకారివగుదువు. ఇంకొ
కప్పుడు స్రోతస్వినిబోలి కళ్యాణదాయకుడ వగుదువు.
భగవానుడిచ్ఛయించినయెడల నాకాశమునుమించి

విరాటుడ వగుము. మరియు శిశిరకణముకంటెను, క్షుద్రుడవగుటకు వెరపొందకుము. అనంతమూర్తులు అనంతభావములు, నానాత్వము మొదలగు వైచిత్ర్యములు వెలుపల గనుపడుచుండును. కాని యభ్యంతరమందు నిశ్చలశాంతియు, ప్రసన్నవిమలత్వమును, భగవత్సమాధి నిమగ్నమగు ఆత్మప్రతిష్ఠ యనునవి యాత్మసమర్పణ యోగమువలన సిద్ధించును.

---

# ఉపక్రమణిక.

మానవజీవితమును బరిశీలించినయెడల జగద్రహస్యము బయల్పడును. జగత్తునందలి సమస్తపదార్థములకును కారణ మొక్కటియే యైనను అందు మానవుఁడు సర్వోత్తముఁ డని యంగీకరింపక తీరదు. ఏలయన అనాయాసముగ నాదికారణమును మానవునియందు గనుగొనవచ్చును. మానవజీవితము సాధనకొరకేర్పడినది. మనమట్టిదుర్లభమగు మానవజన్మమెత్తియు సాధనను వీడి పశువృత్తి నవలంబించుట మూర్ఖత్వము కాదా? ప్రతి మానవునకును సాధన నొనర్చుట కధికారముగలదు. వివేకానందస్వామి యిట్లు చెప్పియున్నాడు- "నేను వ్యర్థుడనని తలంచువానికంటె నధముఁడు భూమండలమందు మరియొకఁ డుండడు." అయోగ్యుఁడగు మానవుఁడు లేడు. మానవునియందుండు దేవత్వము నశించునది కాదు. ఐనను మానవుఁడు తన యసీమత్వమును దేవత్వమును మరచి యధముఁడ నని తలంచుచున్నాడు. కావున సాధనవలన నిన్ను నీవు దెలిసికొనుము- అప్పుడు నీ వనంతశక్తియొక్క యంత్రమనియు, శుద్ధముక్తుడవనియు, అమరుడవనియు దెలిసికొందువు- సాధారణ మానవ

జీవితమును వదలి మానవుని యుం దిమిడియుండు దేవభావ ము నుపలబ్ధినొందుమార్గమును ప్రణాళికను యోగ మందురు. అందువలన యోగమనుశబ్దమును విన్నమా త్రమున నే, యది యత్యంతకఠోరమనియు, కష్టసాధ్యమని యు దలంచి యుపేక్ష యొనర్పఁజనదు. మానవుఁడు వాసనాపరవశుఁడై యింద్రియవృత్తుల చరితార్థతకొరకు మితిలేని కష్టముల నొందుచుండును. ఆకష్టములతో బోల్చిచూచినయెడల, ' నిన్ను నీవు తెలిసికొనుటకు చేయవలసిన సాధన యంతకఠినమైనది కాదని గ్రహింప గలవు.

యోగమనగ ప్రాణాయామమని యనేకులు దలంచుచున్నారు. ప్రాణాయామముమాత్రమే యోగము కాదు. నేడు భారతవర్షమందు మహాపురుషులు సంచరించుచున్నారు. అందువలన ననేకులు ధర్మజీవన మునకు గడంగుచున్నారు. కాని పురాతన మహాపు రుషుల, ధర్మసంస్కారము లింకను ప్రభావరహితములు గాలేదు. అందువలన ధర్మసాధనకు గడంగదలచినవాఁడు పురాతనుల నాశ్రయింపవలసి వచ్చుచున్నది. అప్పుడు ఆసనములు, ప్రాణాయామము, హఠయోగము మొద లగువానిని యనుష్ఠించుటయే యోగ మను భ్రమ గలుగు

చున్నది. పూర్వీకుల యావిష్కారములు పూర్వీకుల కను విషయమును మనమునం దుంచుకొనవలయును. అందు వలన వారి ప్రభావము వర్తమాన కాలమందు ప్రకాశింపు చుండుట లేదని తలంపజనదు. పూర్వులకును మనకును ప్రతివిషయమందును భేదముగలదు. వారి దేశకాల పాత్రములకును వర్తమానమందలి దేశకాలపాత్రములకు ను అత్యంతభేదము గన్పట్టుచున్నది. వర్తమాన కాలము నకును భవిష్యత్కాలమునకును మిక్కిలి భేదముండు ననుట నిక్కువము.

సంఘము, రాజ్యాంగము, మొదలగువానియం దంతటను నూతనభావము లుత్పన్నమగుచున్నవి. ఆ భావములను బూజించుటకు పురాతనయుపకరణములు పనికిరావు. కాని యీపరివర్తనము శుభప్రదము గాదని దలంచువాడు భగవానుని సరిగ దెలిసికొన లేదని చెప్పవచ్చును. ఏలయన భగవానుఁడు మంగళ మయుఁడు. ఆతఁడు జగత్తునందు పూర్ణానందము నుపభోగించుటకుగాను ప్రకృతిద్వారమున జగత్తు నకు క్రమవికాసమును గలిగింపుచు జగత్తునందే స్వర్గరాజ్యభోగము ననుభవింపుచున్నాడు. జగత్తు నందు గలుగుచున్న మార్పంతయు భగవానుని శుభో

ద్దేశమునకు సంబంధించియున్నది. కాని భారతవర్షము
యొక్క వర్తమానావస్థ మిక్కిలి శోచనీయము. అయి
నను నిది తాత్కాలికము. సంపూర్ణపరిణతి నెందు
మార్గమం దిట్టి యవస్థ గలుగుట యస్వాభావికము
కాదు. కాని ప్రాచీనప్రతిష్ఠాపనలను అనుష్ఠానములను
తిరిగి స్థాపింపదలచిన యెడల మన సమస్తోద్యమములు
వ్యర్థమగుననుటకు సందియములేదు.

కావున మనకిప్పుడు నూతనప్రణాళికయు, నూ
తనభావమును, నూతనానుష్ఠానమును గావలయును.
సాధారణమానవులు నూతనమార్గ మవలంబించుటకు
సంకోచింపుచుందురు. కాని సత్యము తనంతట
తానుగనే బయల్పడుచుండును. భారతవర్షముయొక్క
వర్తమానవిషమసమస్యను బరిష్కరింపవలయుననిన
నూతనభావమును నూతనప్రణాళికను అవలంబించితీర
వలయును. సంపూర్ణమగు నభివృద్ధిమార్గమున నిర్గ
మింపవలయుననిన ప్రాచీనోపాయములు జాలవు. అట్ల
నుటవలన ప్రాచీనపద్ధతులవలన మనము బొందిన
యభివృద్ధి సామాన్యమైనదని దలంపజనదు. కాని
దానితోడ మనమిప్పుడు సంతృప్తి నొందియుండుటకు
వీలులేదు. భారతవర్షముయొక్క ప్రస్తుతస్థితి పురాతన

సాధనాఫలము. ఈయవస్థ నీచావస్థయని దలంపరాదు. భారతవర్షము తపోనిలయము. వర్తమానావస్థ ప్రాచీన సాధనయొక్క సిద్ధిస్వరూపము. అంతర్జగత్తునందలి దుర్గ్రాహ్యావిషయము లనేకములు మన కరాయత్తములై యున్నవి. అయినను మన మసంపూర్ణులమై యున్నాము. కావున నేడా యసంపూర్ణతను విసర్జించి యాధ్యాత్మిక జగత్తు నం దగ్రేసరులము గావలయు నను చింత మనలను బ్రోత్సాహించుచున్నది. హఠయోగము, రాజయోగము, భక్తియోగము, కర్మయోగము, జ్ఞానయోగము వలన గలిగిన పరిణతిని మనము గ్రహించియున్నాము. ఇవి యన్నియు మనయందు ఖండవికాసమును గలిగించినవి. ఒక్క మానవజీవితమందు వీనినన్నిటిని బరిశీలన మొనర్చుట సాధ్యముగాదను విషయమును దెలిసికొనియున్నాము. జీవిత మనంత మను విషయము నుపలబ్ధినొంది యున్నాము. మనము ఋషిపుత్రులము. అనేకజన్మలెత్తి యాజన్మలయం దనేకసాధన భజన లొనర్చి నేడు వర్తమానక్షేత్రమందు సాధనకొరక కవతరించితిమి. మన స్వల్పజ్ఞానము మనయవతారమున కిదియే ప్రారంభ మను భ్రమను గలిగింపుచుండును. అందువలన మనము ప్రాక్తనైశ్వర్యమును మరచియున్నాము. కావున భారతవర్షము

నేను స్వస్వరూపమును మరచియున్నది.

ప్రథమమున మనము పార్థివభోగములయందు నిరసనగలిగి ఆధ్యాత్మికజగత్తునందు ప్రవేశించుటకు సంసిద్ధులమైతిమి. మున్ముందు స్థూలశరీరముమీద మన లక్ష్యముండెను. శీతాతపములు, జరామరణములు మొదలగు ప్రకృతియొక్క యనివార్యనియమములకు మనము బద్ధులము. అందువలన వీనినుండి దప్పించుకొనుటకు పలువిధములగు అనుష్ఠానముల నొనర్చితిమి. ఆ కఠోర సాధననే హఠయోగమని పిలుచుచున్నాము. ఈయోగమువలన శీతాతపములు జర మొదలగు యుపద్రవముల నుండి శరీరయంత్రమునువిముక్తి నొందించుకొనగలిగితిమి. కాని యందువలన మనయుద్దేశము నెరవేరినదికాదు. శరీరముమీద యసామాన్యకర్తృత్వము నార్జింప గలిగినను గూడ మనకు తృప్తి గలుగలేదు. అందువలన శరీరమునందుండు మరియొక యంత్రముమీదికి దృష్టి మరలెను. అది ప్రాణయంత్రము; వాసనకు కేంద్రస్థానము. దాని సూక్ష్మగతిని విధులను దెలిసికొనుట కొరకు మహాయజ్ఞమునకు గడంగితిమి. "ప్రవృత్తివలన వాసన నివృత్తియగునా? ప్రాణసంయమమువలనసమస్త కోరికలు నశించునా?" అనువిషయముల కై కొని పలువిధసాధన

లొనర్చితిమి. శరీరయంత్రజ్ఞాన మెుకింత గలిగినపిమ్మట అభ్యంతరస్థితమగు సూక్ష్మప్రాణశక్తిసంధానము కొరకు ప్రారంభింపబడిన మహాసాధనయే తంత్రసాధన. తాం త్రికసాధనవలన సూక్ష్మ ప్రాణశక్తిలీలను మనము సుస్పష్టముగ జూడవచ్చును. సూక్ష్మప్రాణశక్తిని తిల కించినను గూడ సాధకునకు పూర్ణానందము కలుగ లేదు. కాని యాతని కష్టము మనోచిత్తముల యావేగలీల గోచరించెను. వానిని పూర్ణముగ దెలిసికొనినగాని జీవితము పరిపూర్ణముగాదు. అందువలన "విషయ సంయోగద్వారమున నింద్రియములవలన గలుగు స్పంద నము జీవితమునంతయు నాక్రమించునా? మనస్సు సూక్ష్మప్రాణముయొక్క యాదికారణమా?" అను విషయమును దెలిసికొనుటకు సాధకుఁడు మితిలేని ప్రయాసకు లోనుగావలసి వచ్చెను. ఈ సాధన యందు ప్రేమ, విరహము, అనురాగము, ఆవేగము మొదలగువానియందొక్కొక్కటి సాధకునిజీవితము నెన్నిసారులు చుట్టిచుట్టి తిరుగుచుండె ననువిషయమును వర్ణించుటెట్లు?

కాని యింతటితోడ మానవునిసాధన ముగియ లేదు. మనస్సున కూర్ధ్వమందు బుద్ధి విరాజిల్లు

చుండును. దాని యనంతలీలల నుపలబ్ధి నొందినప్పుడు మానవజీవితరహస్యము గోచరించును. ఈ రహస్యమందే యానందస్వరూపమును దెలియనగును; సర్వానందను లభించును. ఈ విధముగ సాధనకు గడంగిన యెడల మానవుని బాహ్యాభ్యంతరములయం దఖండజ్యోతి ప్రజ్వలించును. పరాజ్ఞానము గలుగును. అప్పుడు సాధకుడు ముక్తుడును, సచ్చిదానందస్వరూపుడు నగుచున్నాడు. నేడు మనము హఠయోగము నుండి యోగసాధనాపథమునకు రావలయుననిన గానుగ యెద్దునుబోలి, చుట్టిచుట్టి తిరుగుచుండవలసినవార మగుదుము. సాధన యనిన, మనకు అరణ్యవాసులును చిరకౌపీనధారులు నైన సన్యాసులవిషయము స్ఫురింపుచుండును. అందువలన తిరిగి యా బౌద్ధయుగమును, ఆ శంకరయుగమును, ప్రతిష్ఠింపవలయునను ప్రవృత్తి మనయందు మేల్కొనుచుండును.

ఇప్పుడు మనమాశ్రయింపవలసినది ఆధ్యాత్మిక యోగము, లేక ఆత్మసమర్పణయోగము. హఠయోగము, భక్తియోగము, రాజయోగ మను త్రివిధ యోగములకంటెను ఆధ్యాత్మికయోగము శ్రేష్ఠమైనది. ఇది మానవుని పరిపూర్ణునిగ నొనర్చును.

# సంకల్పము.

—:0:—

సాధనవలనగాని యోగము లభింపదు. మన మనేకదినములనుండి ధారణచేయుచుండు విషయములను గ్రంథముగ వ్రాయవచ్చును. దానిని పాఠకులు చదువ వచ్చును. కాని యందువలన యోగతత్వము హృద యంగమముగాదు. యోగతత్వము నుపలబ్ధినొందవల యునన్న స్థిరసంకల్పము, దృఢధైర్యము, ఏకాగ్రచిత్తత యుండవలయును. సంకల్పము దృఢమై స్థిరమైన కొలది యోగపథము సుగమమగుచుండును. భోగవిలాస ములకొరకు మనము మితిలేని వ్యాకులత్వమున మునింగి యుందుము. అంతకంటె ననేకరెట్లు వ్యాకులత గలిగిన గాని ఆధ్యాత్మికజీవనప్రాప్తి గలుగదు.

సంకల్పము యోగసాధనకు ప్రథమసోపానము. సంకల్పపరాయణుం డగు మానవుడు సులభముగ యోగసిద్ధుడగును. సంకల్పములేనిజీవితమసారము, వ్యర్థ ము. దృఢసంకల్పము, దేవవ్రతుండగు భీష్మునిజీవితమం దసాధారణపరివర్తనం బొనర్చెను. అందువలన నాతని కీర్తి దిగంతముల వ్యాపించియున్నది. దృఢసంకల్పము వలననే మహాబలుండగు వృకోదరుండు దుశ్శాసనుని రక్త

మును పానముజేసియున్నాఁడు. సంకల్పసిద్ధిగానంతవర కును పాంచాలి ముక్త కేశినియై యుండెను. సంకల్పబల మువలననేగదా అర్జునుఁడు సైంధవుని సంహరించెను. సంకల్పవిహీనుఁడు దేనిని భోగింపజాలఁడు. కావున యోగ సాధనకు సంకల్పముగావలయును. దృఢసంకల్పము గల వాఁడుమాత్రమే యోగభోగము ననుభవింపగలఁడు. ఈసంసారమందలి విచిత్రఘటనలయందు మానవునకు సంకల్ప ముదయింపవలయును. సంకల్ప ముదయింపని వాని జీవితము వ్యర్థము. "పరిశుద్ధుఁడ నగుదును. సత్య వాది నగుదును. ప్రాణ మర్పించియైనను ఆత్మమర్యాదను గాపాడుకొందును" అనునట్టి సంకల్పము యోగసాధనకు బునాదియని యెరుంగవలయును.

అధ్యాత్మికయోగసాధన కుపక్రమింపదలచిన వానికి ఆత్మసమర్పణసంకల్పము దృఢముగావలయును. కావున యోగధారణను గూర్చియు ఆత్మసమర్పణయోగ మునుగూర్చియు విపులముగ జెప్పుటకు ప్రయత్నింతును. యోగమనిన ఆసనములు, ప్రాణాయామము, కుంభ కము, పూరకము, చిత్తశుద్ధి, మొదలగు అనుష్ఠానములు క్రియాకలాపముల నాశ్రయించి దేహప్రాణములనుండి యారంభించి చిత్తమనోబుద్ధులను భేదించుకొని సహస్ర

దళపద్మమును జేయవలయునను విషయము స్ఫురించును. కాని యీసాధనప్రణాళిక హఠయోగమునకు సంబంధించినది. వేదాంతుల సాధన బుద్ధినుండి ప్రారంభమగును. కాని నేనిప్పుడు చెప్పునది తాంత్రికయోగము. ఇది సర్వోత్తమమగు మార్గము. తంత్రపథమందు శక్తినుండి సాధన ప్రారంభమగును. అందువలన సత్యమును సర్వోత్కృష్టము నగునది తాంత్రికయోగము. శ్రీ రామకృష్ణపరమహంసస్వామి తంత్రపథమును జగత్తునకు జూపించియున్నాడు. ఆయన యుపదేశ మిది. "ప్రథమమున శక్తి నుపాసింపుము. ఆ తల్లియొక్క కరుణ గలిగినయెడల నీవు సత్యమును జేరగలవు." శక్త్యుపాసననే తాంత్రికులు చేయుచుందురు. దృఢసంకల్పపరాయణుఁడు, ఆత్మమర్యాదజ్ఞానవిశిష్టచరితుఁడు మాత్రము యోగసాధన కర్హుఁడని యిదివరకు చెప్పియుంటిని. అట్టి యధికారము లేనివాఁడు భ్రమప్రమాదములకు లోనై భ్రష్టుఁడగును.

ఫాలమున సింధూరతిలకమును, దేహమున రక్తవస్త్రమును ధరించి తిరుగుచుండువారిని మన మనుదినము జూచుచుందుము. వారు తాంత్రికసాంప్రదాయకులు. భైరవీచక్రానుష్ఠానమువలన శక్తిసాధనను జేయు

చుందురు. కాని యనధికారులును, భ్రష్టులు నగు తాంత్రిక వేషధారుల వలయందు దగుల్కొని, చెడిపోయిన స్త్రీలను మన మనుదినమును జూచుచున్నాము.

నేనిప్పుడు చెప్పు శక్త్యుపాసనకును తాంత్రికోపాసనకును కించిద్భేదము గలదు. ప్రతిమానవుని యందును ప్రకృతి పురుషులు విరాజిల్లుచున్నారు. ఆ పురుషుడే పరమేశ్వరుడు. ఈ సత్యమును శ్రీ రామకృష్ణపరమహంసస్వామి, వివేకానందస్వామి కిట్లు చెప్పియున్నాడు. "నీవు బ్రహ్మవు. ఈశ్వరుడవు. నీ కిచ్ఛగలిగినయెడల దేవతవు గావచ్చును, లేక నరకమందలి క్రిమికీటకము గావచ్చును." మనయందు స్త్రీ రూపిణియగు శక్తి యధిష్ఠించియున్నది. పురుషున కిచ్ఛగలినప్పుడు, మనయందు శక్తి మేల్కొని దానిని నెరవేర్చును.

ఆ యిచ్ఛను బ్రయత్నమనిగాని వాసనయనిగాని తలంపవలెను. వాసనావశవర్తియై మానవు డనేక కార్యము లొనర్చుచుండును. కాని, మన మే శక్తి సహాయమున ననేక కార్యము లొనర్చుచున్నామో యా శక్తి యనంతము. కాని మనము మోహగ్రస్తుల మగుటవలన మనజీవితమందు గుప్తమైయున్న యోగ

రహస్యమును దెలిసికొనజాలకున్నాము.

ఈ విషయమును నేకింత విపులముగ విచారింప వలయును. యోగమునకు గడంగు సాధకునకు, "భగవానుఁడు నాయందు విరాజిల్లుచున్నాడు. భగవదిచ్ఛ వలనగాని, వాసనచేతగాని, ప్రయత్నమువలనగాని, లేక యేదో విధముగ కుండలినీశక్తిని మేల్కొలుపుదును. పురుషుని యిచ్ఛ, లేక వాసనానుసారముగ శక్తి దేహయంత్రమును నడిపించుచున్నది." అను విశ్వాసము దృఢముగ నుండవలయును. మానవు డెప్పుడును దెలిసియో తెలియకయో యోగాభ్యాస మొనర్చుచున్నాడు. జ్ఞానిమాత్రము, జీవితమందలి ప్రతిఘటనయందునను శివశక్తియొక్క దివ్యలీలలను సందర్శించి కృతార్థుడగును.

ఇచ్ఛ వాసనారూపమున గన్పడినప్పుడు జీవుడు మోహగ్రస్తుడు అపరిశుద్ధుడని గ్రహింపవలయును. కావున సాధకుఁడు అపరిశుద్ధతను మోహమును సాధన సహాయమున నశింపజేసికొని శుద్ధుఁడును చైతన్యస్వరూపుఁడు నగును.

ఇచ్ఛయనునది . వాసనకాదు, చేష్టకాదు. భగవానునకు వాసనచేష్టలులేవు. ఆయన యిచ్ఛవలననే

జగద్వికాసము గలుగుచున్నది. ఈవికాసము కార్య కారణములయందు మిళితమై దేశకాలములయందు వ్యా పించియున్నది.

కల్పారంభమునందు జగత్తునందలి ప్రతిఘటన యు వికాసమును మనయం దణగియున్నవి. అవి భగవ దిచ్ఛవలన స్వతస్సిద్ధముగ ప్రకాశింపుచున్నవి. అందు వలన మానవుఁడు వాసనవలనగాని ప్రయత్నమువలన గాని నవి మార్పు జెందవనియు, కేవలము సాక్షిరూపమున శక్తికర్తృకమగువికాసముమాత్రము దృష్టిగోచర మగు చుండుననియు, నిర్ధారణ జేసికొనుచున్నాఁడు. నీవు భగవా నుఁడవు. వ్యక్తిగతమగు ఈశ్వరుఁడవు. పరమేశ్వరుఁడు నిఖిలభువనముల కధీశ్వరుఁడు. దేశకాలముల విచారణము మన కనావశ్యకము. ఇచ్ఛామయి యగు సర్వశక్తి స్వరూపిణి నీయందుండి చేయదలచినదానిని చేయుచుం డును.

భగవానుఁ డొక్కఁడు, అద్వితీయుఁడు. కావున భగవానునిమీఁద నాధారపడినయెడల సర్వసమత్వము గలుగును. అప్పుడు ప్రతిఘటనయందును ఆత్మచైతన్య ము పునరావర్త మగుచుండును. అందువలన వాసనా చేష్ట లంతర్ధాన మగును. జ్ఞానవికాసము గలుగును.

జ్ఞానోదయ మైనయెడల వాసనాచేష్టలకు భయపడ వలసియుండదు. కావున భగవదిచ్ఛను గ్రహింపవల యును. ఆ యిచ్ఛాశక్తిద్వారమున జ్ఞానమును వికసింప జేసికొనవలయును. జ్ఞానమువలననే చిత్తము నిర్మల మగును. జ్ఞానమే ప్రాణమును సంయత మొనర్చి, మనోచాంచల్యము నడంచును. భగవదిచ్ఛపై దృఢ విశ్వాస ముండినయెడల వాసనాచేష్టలు నిలువజాలవు. నీవు ఈశ్వరుఁడవు. నీ యందే శక్తి యధిష్ఠించి యున్న దను విషయమును గ్రహింపుము. నియంత్రరూపమున నీ వాదేశ మొసంగుము. సాక్షిరూపమున ప్రకృతి కార్యముల దిలకింపుచుండుము. భర్తవై యుపాధిని, యంత్రములను, ప్రకృతికి సహాయ్యముగ నొనర్పుము. కాని తామసికమైన యుదాసీనతవలనగాని, రాజసిక మగు ఉత్తేజనముతోడగాని, వాసనను ధ్వంస మొనర్ప వలదు. మనయందు విరాజిల్లుచుండు ఇచ్ఛారూపిణి యగు పరాశక్తి క్రియారహితమగునది కాదు. అజ్ఞాన మువలన మన మా రూపమును గాంచజాలకున్నాము. ఆత్మసమర్పణం బొనర్చినయెడల జడత్వము కలుగునని కొందరందురు. కాని యట్టివారి మస్తిష్కమునకు ఈ విషయము గోచరముకాదు. ‘అహంరూపి’ యగు

బ్రహ్మపదార్థవిషయము వారికి స్ఫురింపదు.

"నేను జ్ఞాతను, ప్రకృతి సంగ్రహించు జ్ఞేయమును గ్రహింపుచుండును" అని దలంపుచు జీవితమందలి ప్రతికార్యమును నిర్వహింపుచుండినయెడల, సమస్తమును శక్తిరూపిణి యగు కాళీదేవియే చేయుచున్నదను విషయమును తెలిసికొందుము. కాని యందులకు నీవు చింతింపజనదు; ధైర్యమును గోల్పోవలదు; తొందపడజనదు; నీ సమ్ముఖమం దనంతజీవితమున్నది. కావున తొందరపడుటవలన ప్రయోజనము లేదు. తామసికతవలనను, అలసత్వమువలనను, జీవితముయొక్క యమూల్యకాలమును నష్టముగాకుండు నట్లు చూచుకొనుచుండవలయును.

## స్థూల సూక్ష్మ దేహములు.

"దేహాతిరిక్తమగు ఆత్మపదార్థము నేను." అను విషయము శాస్త్రాధ్యయనమువలన బుద్ధికి యొకింత గోచరించినను, సాధనవలనగాని యది పరిస్ఫుటము కాదు. సాధన చేయనంతవర కా విషయము బోధపడదు.

"నైనంఛిన్దన్తి శస్త్రాణి నైనందహతిపావకః." అను భగవద్గీతవాక్యమును నెన్నిమారులు పఠించినను బాహ్యశరీరముతోడ మన కధికసంబంధము గలదను విషయము జీవిత మందలి ప్రతిఘటనయందునను గాన్పించుచున్నది. కావున శరీరసంబంధమును బరిత్యజించుటకు బూనుకొనవలెను. నాశనరహితమగు 'నేను' అనుదానికి శరీరము వస్త్రమైయున్నదను విషయమును బాగుగ నుపలబ్ధి నొందవలయును. అవసరమైనయెడల ఆత్మయొక్క యిచ్ఛానుసారము శరీరమను వస్త్రమును మార్చుకొనుట కే విధమగు ద్వంద్వములు బాధింపకుండునట్టి స్థితిని సంపాదించుకొనవలయును.

దీనిని యోగానందావస్థ యందురు. యోగసాధనయం దనేక ప్రలోభనములు గలవు. ఒక్కచోట దేహమునువిడచి యిచ్ఛవచ్చినచోట సంచరింపవచ్చును.

ఒకకర్రను నిలువబెట్టి దానిమీద "యోగాసనము" ను వేసుకొని కూర్చుండవచ్చును. అలౌకికదృశ్యములను ప్రదర్శింపనగును. కాని యాత్మసమర్పణయోగ మిట్టి సిద్ధులకు దగినది కాదు. షట్చక్రముల భేదించుకొని, బ్రహ్మయందు విలీనమై, యుగయుగాంతరములు పర్వత కందరములయందు నివసింపఁగల శక్తి ఆత్మసమర్పణ యోగముచేత లభింపదు. ఆత్మసమర్పణయోగము వలన, భగవదిచ్ఛతోడ, సాధకునకు గరిష్టమగు పరిచయము గలుగును. భగవదిచ్ఛమీదనే నాతఁడు నిర్భర పడియుండును. అప్పు డే విధమగు స్వతంత్రచింతనకును, యోచనకును యోగిహృదయమందు స్థాన ముండదు. భగవానుఁడు యోగిని యంత్రరూపమున నడిపింపు చుండును. భగవానుఁడు క్రీడింపుచుండు ఆనందము జీవునియందు పొంగి పొరలుచుండును. అప్పుడు సాధకుఁడు సిద్ధాసిద్ధములు, జీవనమరణములు, పాపపుణ్యములు, సుఖదుఃఖములు, మొదలగువానిని మరచిపోవును. కేవలమొక యవిచ్ఛిన్నానందమందు మాత్రి ముండును. జీవు డా యానందసాగరము యొక్క తరంగ రూపమున నృత్యము చేయుచుండును.

ఆధ్యాత్మికయోగమును గ్రహింపవలయుననిన

బాహ్యశరీరాతిరిక్త మగు సూక్ష్మశరీరమును గూర్చి మున్ముందు దెలిసికొనవలయును.

ఇంద్రియసముదాయసమన్విత మగు రక్తమాంస ములతోఁగూడిన మూర్తిని మానవుఁ డనుచుందుము. కాని మానవునియందు సూక్ష్మశరీరము కలదు. ఆ సూక్ష్మశరీరప్రేరణమువలననే స్థూలశరీరము పనిచేయుచుండును. ప్రాణము, చిత్తము, మనస్సు, బుద్ధి యనువాని సమిష్టియగు సూక్ష్మశరీరము స్థూలదేహమం దంతటను వ్యాపించియున్నది. ఇది సూక్ష్మమైనను స్థూలదేహముతోడ సంపూర్ణసంబంధము గలిగియున్నది.

మానవుని శిరమునందు ఇచ్ఛారూపిణి యగు మహాశక్తి విరాజిల్లుచుండును. ఆ యిచ్ఛారూపిణి యగు మహాదేవియే దేహరాజ్యమున కధిష్ఠాత్రియై యున్నది. యోగులు చెప్పుచుండు సహస్రదళపద్మమం దామహాదేవియొక్క సింహాసన ముండును. ఆమహాశక్తి దేవతల యాదేశమువలన త్రిలోకములయందు లీలలను బ్రకటింపుచు భగవానున కానందమును గలిగింపుచుండును. ప్రకృతిశక్తి సూక్ష్మదేహమునకు సంపూర్ణముగ వేరయి నదని యెరుంగవలయును. ప్రకృతిశక్తి యంత్రస్వరూప మగు సూక్ష్మదేహమును స్పందనమొనర్చును. సూక్ష్మ

శరీరమందు దానివికాసమును మనము గాంచవచ్చును. మానవుని మస్తిష్కమును మూడుభాగములుగ భాగింపనగును. ప్రథమభాగమందు జ్ఞాన ముండును. ద్వితీయ భాగమందు విచారబుద్ధి యుండును. తృతీయభాగమందు బోధశక్తి విరాజిల్లుచుండును. ఇవి యత్యంతసూక్ష్మ పదార్థములు. అణువీక్షణ యంత్రసహాయమునగూడ వీనిని సందర్శింపజాలము. కాని ప్రకృతి చేయుచుండు కార్యముల నుపలబ్ధినొందిన ఋషులు తదనుగుణముగ వానికి నామకరణము లొసంగియున్నారు. హృత్పిండ మునకు కొంచె మూర్ధ్వమందు మనస్సుండును. అది పంచేంద్రియములకు కేంద్రశక్తి. హృదయము మొదలు నాభిమధ్యమువరకును చిత్త ముండును. నాభితలము నుండి లింగమూలమువరకును సూక్ష్మప్రాణ ముండును. ఇచ్ఛాశక్తి, జ్ఞానము, విచారబుద్ధి, బోధకశక్తి, మనస్సు, చిత్తము, ప్రాణము, వీనితోగూడినది సూక్ష్మదేహము. అన్నమయము, స్నాయుమయ ( రక్తమాంసమయ ) మగునది స్థూలదేహము.

జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు. ఈపదింటితోడను మానవుడు కార్యము లొనర్చుచుండును. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములకు దోవ

జూపును. జ్ఞానేంద్రియ కార్యము లేవిధముగ సూక్ష్మశరీర మందు జేరునను విషయమునుగూర్చి యోచింపవల యును. దర్శనేంద్రియమువలన మనము చూచుచున్నా ము. కాని నేత్రయంత్రము చూచుటలేదు. ఆ యంత్ర ద్వారమున చూచుచున్నవా డెవ్వడు? మనస్సు. మన స్సనునది యింద్రియములకన్నిటికి ముఖ్యమైనదై హృత్పిం డమున కొంచెము యూర్ధ్వమందుండునని యిదివరకు నుడివియుంటిని. బాహ్యమందలి సౌందర్యము నేత్రముల నుండి మనస్సును జేరినప్పుడు మనస్సునందు స్పందన మారంభమగును. ఆస్పందనము చిత్తమును మేల్కొలు పును. వెంటనే చిత్తమందది ముద్రితమగును. తెలిసి కొనుటయే బుద్ధియొక్క ధర్మము. కావున చిత్తమందు ముద్రితమగు రేఖలను బుద్ధి గ్రహించును. వెంటనే యది దర్శనసుఖము ననుభవించుటకుగాను, ప్రాణమును ఉత్తేజిత మొనర్చును. ప్రాణము దానిని యుపభోగించును. ఇంద్రియగణమునకు మనస్సు కర్తయైనటులనే, ప్రాణము స్నాయుమండలికి కర్త. అందువలన నది స్నాయుమండ లిని నడిపించును; కార్యములను జేయించును. సూక్ష్మ శరీరముయొక్క భోగాభివ్యక్తి స్థూలశరీరమందు బ్రకటిత మగుచున్నది.

ఈవిషయము మిక్కిలి జటిలమైనది. అందువలన సుస్పష్టముగ దెలుపుటకు బ్రయత్నింతును. శ్యామసుందరు డగు శ్రీకృష్ణుడు మురళిని వాయింపుచుండెను. ఆమురళీనినాదము బృందావనమం దంతటను గ్రమ్ముకొని ప్రతిధ్వనింపజొచ్చెను. ఆ సుమధురగానము "రాధికారమణి" శ్రోత్రపుటములనుండి హృదయమర్మమును జేరి ప్రాణము నాకులబరచెను.

శ్రవణేంద్రియసహాయమున శ్యామసుందరుని తత్త్వవిషయము శ్రీరాధికారమణి మనస్సును స్పందిత మొనర్ప వెంటనే చిత్తము రససృష్టి నొనర్చెను. మరియు మురళీగానముతోడ శ్యామసుందరుని యతులనీయరూపమును చిత్రించెను. బుద్ధి ప్రాణము నాకుల మొనర్ప ప్రాణము స్థూలదేహయంత్రమును నున్మాదముగ జేసెను. అప్పుడు శ్రీరాధికారమణి లజ్జ, భయము మొదలగు వానినిఁ బరిత్యజించి, యామురళీగానమును భోగించుటకును, శ్రీకృష్ణుని సమ్ముఖసుఖము ననుభవించుటకును, బరుగిడెను.

స్థూలసూక్ష్మయంత్రముల స్వభావమును నిరూపించి యీయధ్యాయమును ముగింతును. ఇంద్రియ ద్వారమున మనస్సు చూచుదానిని గ్రహించి శరీరయంత్ర

మును నడిపించునది బుద్ధి. పంచేంద్రియములయందు విషయసంయోగమైనయెడల మనస్సు స్పందనమొన ర్చును. చిత్తము మనోస్పందనమువలన గనుపడు పదా ర్థములమీద ప్రేమ, ద్వేషము, భయము, లోభము, మొదలగువాని నుత్పత్తి చేయును. ప్రాణము భోగము కొరకు శరీరయంత్రమును నడిపించును. ఇవి జీవుని స్వా భావిక కార్యములు. మనోబుద్ధిచిత్తప్రాణములు, వాని కార్యముల నవి స్వతంత్రముగ నిర్వహింపుచుండినయెడల సమత్వ ముండును. కాని యవి స్వకార్యముల నట్లు నెరవేర్చుచుండవు. కొందరిలో ప్రాణశక్తి యత్యంత ప్రబలము. అందువలన ప్రాణము మనోబుద్ధి చిత్తముల నాక్రమించి ప్రభుత్వముజేయుటకు బ్రయత్నించును. అప్పుడు మనోబుద్ధిచిత్తములు ప్రాణముయొక్క నిర్దేశా నుసారము నడచుచుండును. అనగా ప్రాణముయొక్క సంస్కారగతమగు వాసనను చరితార్థమొనర్చుటకు బుద్ధి మనోచిత్తములు పనిచేయుచుండును. మరియు నవి ప్రాణముయొక్క ప్రభావమువలన స్వాధీనతను గోల్పోవుచున్నవి. మరికొందరియందు మనోబుద్ధులమీద చిత్తము రాజ్యముచేయుచుండును. అప్పుడు బుద్ధి స్వ దృష్టిని గోల్పోవును. చిత్తముయొక్క యిచ్ఛను పూర్ణ

ము చేయుట కది గృడ్డివానిని బోలి వర్తింపుచుండును. ప్రేమాసూయలు, లోభమోహములు మొదలగువాని వలన బుద్ధియొక్క విచారశక్తి యణగిపోవును. మరియు ప్రేమ, హింస మొదలగువానికి యంత్రమగును. హింస, క్రోధము మొదలగునవి యుదయించినప్పుడు బుద్ధి వానిని నివారింపజాలదు. కొందరియందు మనస్సు బుద్ధిపైని యాధిపత్యము జేయుచుండును. అప్పుడు మనస్సు దేనిని చూచినను లేక దేనిని వినినను దానినే సత్యమని నమ్మును. కాని విచార మొనర్పగలశక్తి బుద్ధికి యుండదు. ఈవిధముగ విచారబుద్ధిగూడ జ్ఞానమున కంతరాయమైనప్పుడు మానవుడు యుక్తి, తర్కము, కల్పనల కతీతమగు సత్యమును జేరజాలడు. ఇచ్ఛారూపిణియగు ప్రకృతిగూడ నీజ్ఞానముయొక్క తీక్ష్ణతవలన దాను సంకీర్ణమును సీమాబద్ధము నని దలంచుచుండును. అందువలన నేమహాత్కార్యమునుగూడ జేయగలనను నాశ మానవున కుండదు. మరియు వానియందు జరుగుచుండు విప్లవమువలన జీవిత మవసన్నమగుచుండును.

ఈస్థితియందు యోగమువలన ప్రయోజనం బేమి? మానవశరీరమందు ప్రత్యక్షముగ విరాజిల్లుచుండు దేవుడు నియంతరూపమున ప్రకృతిశక్తికి ఈక్రింది విధ

మున నాదేశ మొసంగుచుండును. "లెమ్ము మేల్కా
నుము. ఈత్రిలోకములయందు జరుగుచున్న ధర్మ విప్ల
వమును వినాశన మొనర్చి సమత్వమును బ్రతిష్ఠింపుము.
ధర్మరాజ్యమును స్థాపింపుము." పురుషుని యాజ్ఞాను
సారము ప్రకృతి మేల్కాని త్రిలోకములయందు తన
యనంతశక్తిని బ్రవహింపజేయుచుండును. మనదేహ
యంత్రము, ధర్మసంకరదోషమువలన దూషితమైయున్న
ది. కావున భగవదాదేశమువలన సమస్తమును శక్తి
హస్తమందు సమర్పింపవలయును. ప్రకృతి మనయందలి
సూక్ష్మయంత్రముల నుద్భృతమునడంచి వానిని వశపరచు
కొనును. అప్పుడు బుద్ధి, జ్ఞానమును నష్టగింపజాలదు.
మనస్సు చూచును, వినును, స్పర్శ ననుభవించును.
కాని యాదేశమునుగాని, విచారమునుగాని, చేయుటకు
గడంగదు. చిత్తముచ్ఛ్వాసమును సృష్టిచేయును.
కాని యనుభవమును, ఆదేశాధికారమును, జ్ఞానమును
దానికుండవు. ప్రాణము భోగింపుచుండును. కాని
యితరయంత్రములమీద ప్రభుత్వముచేయుటకు బ్రయ
త్నింపదు. అప్పుడు ప్రకృతి సూక్ష్మయంత్రములయం
దుండి బాహ్యశరీరమును నడిపింపుచు కార్యము లొన
ర్చుచున్నదని యెరుంగవలయును. అందువలన శరీరము

నకు స్వతంత్రమగు నహంకార ముండదు. ఇచ్ఛ, జ్ఞానము, అనుభూతి, రసము, భోగము మొదలగువానిని సీమాబద్ధ మొనర్చుట కెట్టియధికారము ఉండదు. స్థూల సూక్ష్మ శరీరములు రెండును, ప్రకృతి యిచ్ఛాను సారము స్వకార్యములను నిర్వహింపుచుండును. భగవానుని యిచ్ఛాశక్తియే ప్రకృతి. స్థూలసూక్ష్మదేహములు రెండును భగవానుని యంత్రములు. భగవానుని యాదేశమువలన ప్రకృతి యంత్రములను నడిపింపు చుండును. కావున మనము పురుష ప్రకృతులను ఉద్బుద్ధ (వికసిత) మొనర్చి వారిపాదపద్మములయందు, వారియొక్క విరాట్సృష్టియంత్రమును సమర్పింపవల యును. సృష్టిని వీడి మనము లేము. అందువలన మన దేహయంత్రముగూడ ప్రకృతికి యనుగతము గావల యును. పురుషుని యిచ్ఛవలన దేహయంత్రము యొక్క సకలకర్తృత్వములు దొలంగి మనయందుండు సనాతనస్వభావము పునరావర్తము గావలయును. ఈ కార్యమును ఆత్మసమర్పణయోగ మొనర్చును. ఆత్మార్పణమైనయెడల భగవానుఁడే సాధకుఁడై సాధన లీలను ప్రకటింపుచుండును.

## ఇచ్ఛాశక్తి.

—:o:—

సూక్ష్మదేహమందలి భాగములను, మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞాచక్రమని చెప్పుదురు. మన మీ ప్రాచీన విభాగమును దేహము, ప్రాణము, చిత్తము, మనస్సు, బుద్ధి, ఇచ్ఛ యని చెప్పుచున్నాము. అన్నమయకోశ మూలమును మూలాధార మందురు. (స్నాయుమయ మగు దేహయంత్రము.) సూక్ష్మప్రాణమును స్వాధిష్ఠాన మందురు. రసస్థానమగు చిత్తమును మణిపూర మందురు. మనస్సును అనాహత మందురు. బుద్ధిని విశుద్ధ మందురు. ఇచ్ఛాశక్తిని ఆజ్ఞాచక్ర మందురు. ఈ యంత్రములు వీని కార్యకలాపములగూర్చి వెనుకటి ప్రకరణమందు విపులముగ జెప్పియున్నాను. ఈ యంత్రము లన్నియు మాతృశక్తికి లోబడి పనిచేయుచుండిన యెడల యోగసిద్ధి గలుగును. ప్రాణము చిత్తమునకును, చిత్తము మనస్సునకును, మనస్సు బుద్ధికిని, ఆటంకముల గలిగించునప్పుడు ధర్మవిప్లవము గలుగును. ధర్మవిప్లవ మడంగినగాని జీవునకు స్వచ్ఛందమగు ముక్తజీవనము గలుగదు.

"నేను ఈశ్వరుఁడ నయినప్పుడు, నాయిచ్ఛవల ననే, సమస్త కార్యములు నెరవేరుచుండవలయునుగదా? ఇట్టి ధర్మవిప్లవము గలుగుటకు గారణమేమి ?" అని యెవరయినను ప్రశ్నింపవచ్చును. కాని యిట్టిశంక లజ్ఞానమువలన గలుగుచున్నవి. పురుషుఁడు స్వసృజిత మాయాజాలమందు దగుల్కొని తన యీశ్వరత్వమును మరచియున్నాఁడు. మఱియు నీక్షుద్రదేహరాజ్యమే తన సర్వస్వమని తలంచి దేహమందలి యంత్రములచే బంధింప బడితినని దలంపుచు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వము లనుభవింపుచున్నాఁడు.

శరీరమనోప్రాణములను యంత్రములు భోగింపుచున్నవా ? వీనికి భోగింపగల సామర్థ్యముగలదా ? సర్వకర్మలకు కర్తయు, ఫలభోగియు భగవానుఁడు. కాని యాతఁడు ఆత్మవిస్మృతుఁడు. ఆత్మవిస్మృతి నుండి ముక్తి నొందవలయునను యిచ్ఛ బొడమినప్పుడు, జీవశరీరమందు యోగిలక్షణములు బ్రకాసించును.

బుద్ధిని జ్ఞానముకొఱకును, మనస్సును బాహ్య జగత్తునందలి విషయగ్రహణమునకును, చిత్తమును రసస్పృష్టికిని, ప్రాణమును భోగమునకును, దేహమును కార్య మొనర్చుటకును, పురుషుని యాజ్ఞానుసారము

ఇచ్ఛ నడిపింపుచుండినయెడల మానవజన్మము సార్థకమగును.

ఇచ్ఛ పురుషుని యాజ్ఞాధీనమం దుండును. కాని మరి యే యంత్రమునకుఁ లోఁబడియుండదు. పురుషునకు సహకారిణియగు ఇచ్ఛాశక్తి శరీరమనోప్రాణములకు భిన్నమైనది, స్వతంత్రమైనది. అందువలన నది స్వాధీనభావమున శరీరమందలి యంత్రములతోఁడ క్రీడింపుచుండును. కాని వాసన, వ్యగ్రత, భావోన్మత్తత మొదలగు భావములవలన బంధింపబడదు. పురుషుఁడు కోరుదానిని శక్తి నిరాసక్తభావమున నెరవేర్పుచుండును.

ఇచ్ఛాశక్తిమీఁద మనకు దృఢవిశ్వాస ముండవలయును. మనసర్వస్వమును శక్తిపదపద్మములయం దర్పింపవలయును. కాని సంశయజాలమందు దగుల్కొన జనదు. వాసనయు చేష్టలును మేల్కొనకుండునట్లు బ్రివర్తింపవలయును. ఇట్లొనర్చుటకు విశేషసాధన యావశ్యకము. ప్రాణపణముగ ప్రయత్నించినగాని దృఢ విశ్వాసము గలుగదు. విశ్వాసము దృఢమైనయెడల మనయందు శక్తి మేల్కొనును. అప్పుడు శక్తియొక్క దివ్యలీల ప్రారంభమగును. మనజీవితముయొక్క సర్వ

స్వము ఇచ్ఛాశక్తియేయని యుపలబ్ధి నొందనంతవరకును
శరీరమనోప్రాణముల చాంచల్యమును గణనచేయక
శక్తిని యారాధింపుచుండవలయును. దృఢవిశ్వాసమున
నుపాసించినయెడల శక్తి ప్రత్యక్షమై మనయందలి సక
లాంతరాయములను దూరమొనర్చును. కావున సాధ
కుడు ముమ్ముందు శక్తి నుపాసింపవలయును.

సాధకుడు శక్తికి సమస్తమర్పించి చేష్టారహితు
డగును. అప్పుడు శక్తి శరీరమందలి యాధారముల
శుద్ధివిధానమునకు గడంగును. కాని ఆధారములు
పురాతనస్వభావమును జన్మాంతరసంస్కారములను పరి
త్యజించుట కిచ్ఛగింపవు. ఇదియే ద్వంద్వావస్థ. ఈయవ
స్థను ధైర్యముతోడ దప్పించుకొనగలిగినయెడల యోగ
పథము సుగమమగును. స్వభావసిద్ధముగ మానవజీవిత
మసంపూర్ణము, అవిశుద్ధము. మాయావలన జీవుడు తన
యసిద్ధావస్థను మంగళప్రదమని తలంచుచుండును. శక్తి
యొక్క కార్యములకు విరుద్ధముగ శరీరమందలి ప్రతి
యంత్రమును తనస్వభావమును సంస్కారముల రక్షించు
కొనుటకు ప్రాణపణముగ బోరాడుచుండును. మరి
యు నవి "మా కానందముతోడ బని లేదు. పూర్ణత్వ
మును వాంఛింపము. సుఖముగ నున్నాము" అని

నుడువుచుండును. కాని యిచ్ఛాశక్తి భగవానుని పూర్ణ వికాసము కొరకు తీవ్రవేగమున శరీరప్రాణమనోబుద్ధుల సంకీర్ణతను, అపూర్ణతను నశింపజేయుటకు స్థిరసంకల్పి యగును.

మానవునియందు భగవానుని పూర్ణవికాసమును గలిగించుటకు ప్రకృతి యెప్పుడును ప్రయత్నించుచుండును. మరియు క్రమముగ నాపథమందు మానవుని నడిపించుచుండును. కాని యాగతివేగ మత్యల్పము. అందువలన మానవుఁడు నూరువత్సరములకైనను జీవితముయొక్క క్రమోన్నతిని యుపలబ్ధి నొందజాలఁడు. కాని యోగ మాగతికి యత్యంతవేగమును గలిగించును. ముక్తియొక్క సుదీర్ఘపథమును సంక్షిప్త మొనర్చును. కావున యోగజీవనము సర్వోత్తమము.

యోగమార్గమందలి ప్రధానకంటకములు పూర్వసంస్కారములు. భగవదిచ్ఛ ముక్తికి ముఖ్యసహాయము. కావున మున్ముందు భగవదిచ్ఛను గ్రహింపవలయును. మనము చేయుచుండు కార్యములకు ప్రతిఫలమును వాంఛింపజనదు. యోగారంభమందు వాసనప్రేరణల కుండు భేదమును దెలిసికొనజాలము. అందువలన నే కార్యమొనర్చినను దానివలన గలుగు మంచిచెడుగుల

శుభాశుభములు, మొదలగునవన్నియు నాకు జెందవను దృఢవిశ్వాసమున నుండవలయును. "త్వయాహృషీకేశ హృదిస్థితేన యథానియుక్తోఽస్మి తథాకరోమి." మంచి చెడుగులవలన సంభవించు ఫలభోగములమీద నుదాసీనులము గావలయును. ఏలయన భగవానుఁడేగదాభోక్త.

ఈవిధముగ బుద్ధిద్వారమున ప్రాణమును వాసనాశూన్యముగ నొనర్చుకొనవలయును. పిమ్మట ఆత్మసమర్పణమాత్రసాధనవలన బుద్ధికిని చిత్తమునకును సమత్వమును గలిగించుకొనవలయును. చిత్తచాంచల్యమును, మూఢత్వమును, పరిత్యజించుకొని కల్పనాజగత్తునందు సంచరింపుచుండు బుద్ధిని బంధింపవలయును. మనయందు దేహమనోప్రాణములుగాక, మరియొకయంత్రి మున్నది. దానిపేరు విజ్ఞానమయకోశము. దానిశక్తి యపారము. విజ్ఞానమయకోశమువలననే పైన వివరించిన భావములను హృదయంగమ మొనర్చుకొనుచున్నాము. కాని తెలిసికొనినంతమాత్రమున బ్రయోజనములేదు. వానిని నాచరణయందు బెట్టవలయును. ఆచరణయందు బెట్టుటకు సర్వస్వ మర్పింపవలయును. మనము క్షుద్రులము, అసమర్థులము, ఉదారరహితులమనువిషయము వాస్తవముగాదు. అహంకారమువల

నను మాయనలనను మనమట్లు దలంచుచున్నామని విజ్ఞానమువలన దెలిసికొనుచున్నాము. మాయను, అహంకారమును, త్యజించుకొనగలిగిన సాధకుఁడు పూర్ణుఁడును, అనంతుఁడును, ఉదారుఁడు నగుచున్నాఁడు.

దేహమనోప్రాణముల యహంకారమును బరిత్యజించుకొనినయెడల నొక్క యనిర్వాచ్యమగు శక్తి దేహమనోప్రాణములయందు నిండియుండును. అప్పుడు మన మీశరీరమున భగవానుని ధారణచేయవచ్చును. ప్రాణముతోడ భోగింపనగును. మనస్సుతోడ ప్రేమించుటకు వీలగును. బుద్ధితోడ దెలిసికొనవచ్చును. కావున మానవుని యందు భోగ ధారణ ప్రేమ జ్ఞాన సామర్ధ్యములు మేల్కొనును. కాని మన యభివృద్ధికి భంగకరములగు వానిని దెలిసికొనుట యావశ్యకము. అపరిశుద్ధముగనుండు మనోబుద్ధిప్రాణముల ద్వారమున మన మొనర్చు కార్యములయందు పూర్వాభ్యాసముల ప్రభావ మొకింత గన్పట్టుచుండును. అహంకారస్పర్శవలన నవి యన్నియు మలినములును, అపూర్ణములు నై నూతన మార్గమున నడచుట కంతరాయములై యుండును. మరియు నవి తమస్థానమును వీడి యంతర్హితములు గావు.

ప్రథమమున ఇచ్ఛాశక్తికిని పురాతనసంస్కారము

ములకును ప్రబలయుద్ధము జరుగును. క్షేత్రస్థితమగు పురాతనసంస్కారములు మనోప్రాణబుద్ధులయందు భగవచ్ఛక్తిని పనిచేయనీయవు. అందువలన ఇచ్ఛాశక్తి (కాళీశక్తి) భగవత్ప్రేరణవలన పురాతనసంస్కారముల నోడించి క్రమముగ సాధకునియందు ప్రవేశించి నూతన భావమును, నూతనజీవనమును, నూతనబుద్ధిని మేల్కొలుపును. అప్పుడు సాధకుని యంతఃకరణమందుండు పురాతనసంస్కారములు పలాయనమగును.

కాని యాపురాతన సంస్కారములు అవిశుద్ధ శక్తి సముదాయముతో గలసి, తిరిగి సాధకుని నూతన విశ్వాసమును నూతనజ్ఞానమును దూర మొనర్చుటకు ప్రబలప్రయత్న మొనర్చును. కాని కాళీశక్తి యంతః కరణమందు స్థాన మేర్పరచుకొనుటవలన, జ్ఞానవిశ్వాస ములు క్రమముగ వృద్ధినొంది, పురాతనస్వభావముల ద్వితీయావస్థను ననాయాసముగ భగ్న మొనర్చును; మరియు జీవితమందు స్థిరప్రతిష్ఠిత మగును. కాని పురాతనస్వభావములు గుమిగూడి మూడవమారు యుద్ధమునకు గడంగును. అప్పుడు అంతఃకరణము నందు విరాజిల్లుచుండు కాళీదేవి వాని ప్రయత్నములను త్రుటిలోన నాశనముచేయును.

మానవదేహమందు దేవశక్తి యొక్కదినమున విరాజిల్లదు. జీవితము విశుద్ధమగుటకుగాను, మాతృశక్తికి సర్వస్వ మర్పించుటయే, యోగసాధనయొక్క ప్రథమమంత్రము. సాధకునియందు కాళీశక్తి ప్రవేశించునప్పుడు, పురాతనప్రకృతితోడ జరుగు ద్వంద్వయుద్ధ మత్యంతభయంకరముగ నుండును. ఈ యవస్థయందు అవిశ్వాసభ్రాంతులు, లోభమోహములు, మంచిచెడుగులు, పాపపుణ్యములు మొదలగునవి జీవుని యోగభ్రష్టునిగ నొనర్చును. కాని యీ ప్రథమ యుద్ధమందు జయమొందినయెడల సాధకునియందు భగవదిచ్ఛ నెలకొనును. భగవదిచ్ఛనెలకొనిన సాధకుఁడు యోగభ్రష్టు డెట్లగును?

జీవుని స్వభావము యోగికి ప్రతిపదమందును నడ్డువచ్చుచు భయభ్రాంతునిగ నొనర్చును. యోగముయొక్క క్రమోన్నతి యోగికి నుత్సాహమును గలిగించును. నిర్దిష్టనియమములయందు కాలము నడుచుచుండువిధమున యోగముగూడ సరియగుపద్ధతులమీద క్రమోన్నతిని బొందుచుండును.

యోగావలంబి యగు సాధకునకు జీవితమందలి ద్వంద్వములు ప్రత్యక్షమగును. అజ్ఞానావస్థయందు మంచి

చెడుగులతో గూడిన నే కార్యమును చేయుటకును తృప్తియుండదు. అందువలన రాగద్వేషములు, కామ క్రోధము లుదయించి జీవితమును దుర్భరముగ నొనర్చు చుండును. కాని యోగగ్రహణానంతరమందుండు ద్వంద్వ ములయాకారము మరియొకవిధముగ నుండును.

ఇచ్ఛాశక్తి నడిపించుచుండువిధమున కార్యము లను చేయజాలనయితి ననుభావము సాధకునియందు జాగరితమగును. అందునలన నొకప్పుడు సమర్థుడ ననియు, మరియొకప్పు డసమర్థుడననియు దోచుచుం డును. ఉత్థానపతనములయందు దగుల్కొనును. ఒక్కప్పుడు ఇచ్ఛానుసారము కర్మనొనర్చును. మరి యొకప్పుడు వాసనకు దాసుడై ప్రవర్తించును. కాని యీ ద్వంద్వములను భోగింపజాలనివాడు యోగభ్రష్టు డగును. దృఢసంకల్పమున సాధకుడీ యవస్థను దిల కింపగలిగినయెడల క్రమముగ మంచిచెడుగులు, పాప పుణ్యములు, ధర్మాధర్మములు, పలాయనంబగుటను గాంచగలడు. ఆధారయంత్రములు నిష్క్రియములై మనోబుద్ధిప్రాణముల పరిభావ మడంగి జీవితమం దంత టను నొక్కమహాశక్తి యధికారమును జేయుచుండు టను దర్శించును. ఇది యోగముయొక్క ప్రాథమికగతి.

ద్వంద్వావస్థయందు సాధకునకు శక్తి యుపలబ్ధియైన యెడల, ఆశయు ఉత్సాహమును గలుగును.

మనము గమ్యస్థానమును జేరుటకు నడచు నప్పుడు మార్గమం దనేక వైచిత్ర్యములను గాంచుచు ముందున కేగుచుందుము. అదేవిధముగ సాధనాపథ మం దగ్రేసరులమైనకొలదిని జీవనమందలి కుసంస్కార ములయం దొక్కొక్కటి సాధకునిలక్ష్యమునకు వచ్చు చుండును. కాని వానినన్నిటిని యిచ్ఛాశక్తి దూరీకృత మొనర్చుచుండును. సాధకుని జీవితమందు ఇచ్ఛాశక్తి స్థిరముగ నివసింపజొచ్చినకొలదిని యోగముయొక్కగతి యత్యంతవేగమగును. అప్పుడు సంస్కారపరంపరను నొక్కత్రుటిలోన నతిక్రమించెదము. అప్పు డేవిషయమం దునను సాధకునకు స్వతంత్రయోచన యుండదు.

యోగమునకు మరియొకగతిగూడ గలదు. దానియందు కాళీశక్తి యొకముహూర్తకాలములో అపరిశుద్ధతనంతను వినాశ మొనర్చును. సాధకుం డొక్కనిమేషకాలమున నాధారములన్నియు పరిశుద్ధ మగుటను గాంచగలడు. కాని యదియెల్లరకును లభ్యము కాదు. అవతారములు లేక విభూతుల యందు మా త్రము దీనిని గాంచవచ్చును.

"మాతృశక్తి నాయపరిశుద్ధతను నాశనమొన ర్చును. కావున నే నా విషయమున చేయవలసిన కార్యములేదు." అను దృఢవిశ్వాసము, కాళీశక్తిమీద నుండవలయును. అట్టి దృఢవిశ్వాస ముండినయెడల, మాతృశక్తి జీవితమును పరిశుద్ధముగను, దేవతలకు నివాసస్థానముగను జేయుచుండుటను ధీరచిత్తమున గాంచవచ్చును. "నేను భర్తస్వరూపమున దేహ యంత్రమును ధరించియున్నాను. కాళీశక్తియే వీని యందలి సర్వదోషములను దొలగించి అమృతమయ మొనర్చును." అను జ్ఞానము పరిస్ఫుటము గావలయును.

---

# బుద్ధి.

మాతృశక్తిమీాద విశ్వాసశ్రద్ధలు దృఢమైనకొలది జీవుని స్వప్రయత్నములు కట్టఁబడుచుండును. అప్పుడు జీవితమునం దెట్టిఘటనలుం ఘటించినను దేహమనోప్రాణములు తలక్రిందులగుచున్నను బుద్ధియందు కాళీశక్తిమీాద నణుమాత్రమైనను అశ్రద్ధగలుగదు. ఆధారము లన్నియు విశుద్ధమగువరకును ద్వంద్వము లుండును. సంస్కారవశమున మంచిచెడుగులని తలంచుచుండునవి, విషయములతోఁగూడి యంత్రముల నాకులపరచుచుండును. బుద్ధితోడ ప్రారంభింపబడిన యోగమందు బుద్ధి యేయవస్థయం దున్నను ఎట్టివిపదలయందు దగులొన్నను కాళీశక్తిమీాద విశ్వాసమును పోగొట్టుకొనరాదు. సర్వావస్థలు, సమస్తఘటనలు, సకలవిపదలు యంత్రముల పరిశుద్ధికి వచ్చుచున్నవను విషయమును మరువజనదు. విపదలమీాద విపదలు, ఘటనలపైన ఘటనలు, వచ్చుచుండుటయేగదా మానవజీవితసాధన. కావుననే మానవజీవితమంతయు యోగమని చెప్పియుంటిని. సుఖదుఃఖములు, జయాపజయములు, నిందాస్తోత్రములు మొదలగువానినుండి బుద్ధిని మరలింపవలయును.

అప్పుడీసమస్తము తల్లియిచ్ఛ ప్రకారము జరుగుచున్నదని గ్రహింతురు. అట్టివాఁడుమాత్రమే శక్తియుపాసన కర్తుఁడు. కాని యిందువలన సాధన పూర్తియైనదనిగాని, సిద్ధియైన దనిగాని దలంపఁజనదు. ఈస్థితి యబ్బినవాఁడు సాధనావస్థయం దున్నాఁడనియును వానియందు తల్లివిరాజిల్లుచున్నదనియును నెఱుఁగవలయును. అప్పుడు తల్లి మనోబుద్ధిచిత్తములను దేహప్రాణములను గప్పియుండువానిని క్రమముగ దొలఁగించును. ఈయవస్థయందు సాధకుఁడు సుస్థిరుఁడై యుండవలయును. వందలకొలఁది వత్సరముల నుండి యూర్ధ్వనిగ్రహము నూడ్చుటకు బ్రారంభించిన యెడల దుమ్ము గృహమంతయు గ్రమ్ముకొనును. ఊడ్చువాఁ డుక్కిరిబిక్కిరి యగును. అదేవిధముగ నాధారములయందుండు కుసంస్కారములును దుర్గంధయుక్తమగు దుష్కృతరాశియు నెక్కుమారుగ మేల్కొని సాధకుని జుట్టి మహావిపద్గ్రస్తునిగ నొనర్చును. కాని యీకఠోరాగ్నిపరీక్షనుండి తప్పించుకొనుట కద్భుతశక్తి లభించును. శ్రీశక్తిమీఁద నిష్కపటమగు శ్రద్ధయు శాస్త్రములయందు దృఢవిశ్వాసమును గలుగును. ఇచ్చట నొకవిషయమును జెప్పుట యావశ్యకము. యోగము జీవితభోగమును సంక్షిప్తమొనర్చి దేవజన్మను గలిగించును.

దేహమనోప్రాణములయొక్కయు, బుద్ధిచిత్తములయొక్కయు, పూర్వజన్మార్జితసంస్కారము భోగము. మానవుడు సాధారణజీవితమం దీ సంస్కారభోగమును ననేకజన్మములనుండి యనుభవింపుచున్నాడు. ఇంకను ననేకజన్మములయం దనుభవింపగలడు. కాని యోగి సహస్రవత్సరము లనుభవింపవలసిన సంస్కారభోగమును ఒక్కవత్సరము లేక యొకదినమున పూర్తిగ ననుభవించును. సంస్కారభోగమతితీవ్రముగ ననుభవించువాడు అధికవేగమును, అత్యంతదుఃఖములను, సహింపవలసియుండును. కాని యాత డనతికాలముననే సిద్ధినొందును. మన సంస్కారభోగగతి యత్యల్పముగ నుండునను విషయమును మనము గమనింపవలసిన యావశ్యకత లేదు. ఏలయన ఆ విషయము కాళీశక్తికి దెలిసినంతగా మనకు దెలియదు. కావున మాతృశక్తియే మనయంత్రములను పరిశుభ్రమొనర్చును.

ఇప్పుడు యంత్రము లేవిధముగ పరిశుద్ధమగును, పరిశుద్ధమైనయెడల సాధకునియం దెట్టిలక్షణములు ప్రకాశించునను విషయమునుగూర్చి వివరించెదను. మున్ముందు బుద్ధినిగూర్చి విచారింతము. శ్రీ

కృష్ణభగవానుడు భగవద్గీతయందు జెప్పినటుల, బుద్ధి తన సమగ్రశక్తితోడ జీవనముయొక్క నిమ్నోన్నతములు మొదలగువాని నన్నిటిని, కాళీశక్తి పదపద్మములయం దర్పింపవలయును.

" సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ ।
అహంత్వామ్ సర్వపాపేభ్యో మోక్షయిష్యామి
మాశుచః "

" సర్వధర్మములను కర్మలను కాళీశక్తికి సమర్పించితిని. కాళీశక్తియే నన్ను సర్వపాప విముక్తునిగ నొనర్చును. " అను విశ్వాసము దృఢముగావలయును.

ఇట్టిదృఢవిశ్వాసము గలిగినయెడల సాధకుని యందు కాళీశక్తి నెలకొనును. అప్పుడు బుద్ధి, యుక్తితర్కముల వీడును. కల్పనలను వదలును. ఆత్మచింతను, పూర్వస్మృతిని పరిత్యజించును. స్థిర ప్రశాంతమగును. జ్ఞానసూర్యుడు బుద్ధి నావరించి యుండు అహంకారమును ఛేదించుకొని వెలుగును. ఆయపార్థివపుణ్యజ్యోతి జీవుని సర్వయంత్రములయందు నను ప్రజ్వలించును. ఇట్టి జ్ఞానప్రకాశము గలుగని యెడల, కాళీశక్తిమీద దృఢవిశ్వాసము గలుగలేదని దలంపవలయును. సర్వకర్మలు తల్లి యిచ్ఛవలననే

జరుగుచున్న వను విషయమును సరిగ ధారణజేసికొన లేదని తెలియంగవలయును. అందువలన గురుపద్మము లాశ్రయించి ఆత్మసమర్పణయోగమును వినుచుండ వలయును.

"జ్ఞానలక్షణము లెవ్వి? జ్ఞానోపకరణము లెవ్వి? వాని నేవిధముగ నుపయోగించుకొనిన జ్ఞానసిద్ధి గలుగును?" అను విషయములగూర్చి యోచింతము.

బుద్ధిని గప్పియుండు హిరణ్మయపాత్రి మున్ముక్తమైనయెడల జ్ఞానసూర్యుఁడు ప్రకాశించును. అజ్ఞానము మనయం దిమిడియున్నది. అది సాధనసహాయమున ప్రకాశించును. జ్ఞానము ప్రకాశింపని సాధనభజనలు నిరర్థకములు. ప్రథమమున కాళీశక్తి (మాతృశక్తి, ఆద్యప్రకృతి) సాధకునియందు విరాజిల్లవలయును. పిమ్మట జ్ఞానసూర్యుఁడు (ఆత్మజ్ఞానము, విశ్వజ్ఞానము) ప్రకాశించును.

ఈజ్ఞానమహిమ పాశ్చాత్యుల మస్తిష్కమున కింకను విదితముకాలేదు. పాశ్చాత్యులు బహిర్జగత్తు నందలి విషయముల పరిశీలనం బొనర్చి యందలిజ్ఞానము నార్జించి బుద్ధిని వికసింపజేయువలయు ననువిషయము నెరుంగుదురు. కాని జ్ఞానము లోపలనుండి వచ్చునది

కాదు. ఆత్మచైతన్యద్వారమున జగత్తును చూచుచున్నాము. జగత్తుయొక్క ఆదికారణమును దెలిసికొనుచున్నాము. కావున చైతన్యద్వారమున జగత్తునందలి చైతన్యము నుపలబ్ధినొందుచున్నాము. అప్పుడొక్క పరబ్రహ్మము నిఖిలభువనములయం దధిష్ఠించియుండును. ఆమహాకారణమువీదనే వర్తమానమందలి సృష్టియు దీనియభివ్యక్తి యగు నేను, నీవు, అనంతస్థావరజంగమములు, గ్రహనక్షత్రములు మొదలగునవన్నియు నున్నవి. ఈకారణజ్ఞాన మనంతము, సీమారహితము. ఆత్మసమర్పణయోగమువలన నీజ్ఞానము ప్రథమమున సిద్ధించును.

ఇచ్చట సృష్టిరహస్యమునుగూర్చి యొకటిరెండు విషయములు చెప్పుట యావశ్యకము. ధారణాతీతుడును విరాట్పురుషుడు నగు విశ్వమూర్తి యొకప్పుడు చిచ్ఛక్తియొక్క కుక్షియందుండెను. ఆ యాదిశక్తియే విశ్వమూర్తిని ప్రసవించెను. జ్ఞానాజ్ఞానములు, పాపపుణ్యములు, అనిలఅనలములు, వృక్షలతలు మొదలగునవన్నియు భావాకారమున ఆద్యశక్తియం దుండెను. ఆ తిమిరావరణ యగు కాళీదేవి గభీరమగు ఆవరణయందు తనను దాను జుట్టుకొనియుండెను. అచ్చట నామరూప

గుణములు లేవు. కాని యొక్క మహాభావముమాత్ర
ముండెను. ఆభావ మనాదికాలమునుండి వికసింపు
చున్నది. ఇంకను పూర్తికాలేదు. ఆమహాభావమునుండి
మహత్తత్వము బుట్టెను. ఆమహత్తత్వమే జగత్తునకు
కారణము. దీనియందే నామరూపగుణభావములు
గలిగెను. కారణము హేతుబోధకమును నిర్మలసత్వ
జ్ఞానావస్థయై యున్నది. దీనినుండి సూక్ష్మజగత్తు
పుట్టెను. కారణమందలి నామరూపగుణములను పరి
వర్తిత మొనర్చి వస్తు తంత్ర మొనర్చు మార్గమందు
(క్రమవికాసపథమందు) స్థాపించెను.

సృష్టియొక్క రూపాంతరము స్థూలము. పరిణ
తియు, పరివర్తనమును, క్రమవికాసము మొదలగున
వన్నియు స్థూలమందున్నవి. కారణమం దెట్టి వికాస
మును, వివర్తనమును లేదు. అచ్చట నుండున
దంతయు పూర్ణము, అవికృతము, సనాతనము. కార
ణమే సత్యము. సూక్ష్మమందు వికసించుటకు గావల
సిన వన్నియు నున్నవి. కల్పన యున్నది. అందు
వలన నది యనృతపూర్ణమగు స్వప్నమును బోలి
సంపూర్ణమిథ్య గాకున్నను కారణముయొక్క పూర్ణ
సత్య మిచ్చటలేదు. కాని యిచ్చట కల్పనవస్తుతంత్రి

ము గానిది స్థూలమందు వికసింపదు. స్థూలమం దుండు వికాసమంతయు అనంతసత్యముయొక్క ఖండవికాసము మాత్రము. అందువలన స్థూలమందుండు, అంశిక వికాసమును, ననృతముగ గణించి ధ్వంస మొనర్చుట వలన పూర్ణతరసత్యమును, సంపూర్ణసృష్టియు, బ్రకాశ ప్రయత్నము జరుగుచున్నది.

సృష్టిలీల నుపలబ్ధి నొందుటను జ్ఞానమందురు. స్థూలసూక్ష్మకారణము లను మూడుసోపానములు సృష్టి యందు గలవు. వీనిని జ్ఞానముయొక్క మూడు భిన్నా వస్థలతోడ గ్రహింపవలయును. నేత్రములు, నాసిక, శ్రోత్రములు, త్వగింద్రియములు వీని సహాయమున మనస్సుస్థూలజగత్తును జూచుచున్నది. విచారము నాశ్ర యించి బుద్ధి సూక్ష్మజగత్తును గ్రహింపుచున్నది. ప్రబోధమువలన ప్రజ్ఞ కారణజగత్తును దెలిసికొను చున్నది. మనోసహాయమున స్థూలమును, బుద్ధిసహాయ మున సూక్ష్మమును, ప్రజ్ఞవలన కారణమును గ్రహింప వలయును. మనస్సువలన దెలిసికొను జ్ఞానమును జడవిజ్ఞాన మందురు. బుద్ధివలన గ్రహించు జ్ఞానమును దర్శనశాస్త్రమనియు ధర్మశాస్త్రమనియు నుడువుదురు. జగత్కారణము నుపలబ్ధినొందుటను యోగమందురు.

మానవుడు మనస్సుతోడ నింద్రియముల ద్వార మున జగత్సంబంధమగు బాహ్యాభిజ్ఞత నార్జింపుచున్నా డు. బాహ్యానుభవముమీద నిర్భరపడి యాలోచించి సూక్ష్మతత్వజ్ఞానమును బుద్ధితోడ గ్రహించుచున్నాడు. పిమ్మట జ్ఞానరాజ్యమును జేరుటకు బ్రయత్నింపు చుండును.

మున్ముందు యోగి భావము నుపలబ్ధినొందును. అనగా విషయముయొక్క మూలతత్వమును తనయం దనుభవించును. ఆ స్వానుభూతిలబ్ధమగు భావమును గూర్చి చింతించును. పిమ్మట యా భావముయొక్క యభివ్యక్తిని, యింద్రియసహాయమున బ్రత్యక్షమొంది పరమానందమొందును.

వైజ్ఞానికుడు మనస్సుతోడ జ్ఞానార్జనకు గడం గును. యోగి యూర్ధ్వలోకమునుండి క్రిందికి యవ తరణ మొనర్చును. జ్ఞానక్రియాసంబంధమునందు సాధ కున కొకవిషయమున సుస్పష్టమగు ధారణ యుండ వలయును. ప్రథమమున వస్తువుయొక్క భావమును ఆత్మానుభూతిగతముగ నొనర్చుకొని గ్రహింపవల యును. పిమ్మట దానిని సుస్పష్టమొనర్చి దెలిసికొను టకు చింతింపవలయును. తరువాత స్థూలప్రకాశ

సంబంధమందు బాహ్యోపలబ్ధిద్వారమున తనజ్ఞానము తోడఁ బోల్చి చూచుకొనవలయును. మున్ముందు భావము, తరువాత చింతనము, దానితరువాత [illegible] మొందనలయును.



## జ్ఞానము.

—:0:-

మానవుడు ఇంద్రియములవలనను, యుక్తివలనను, ఉపదేశములవలనను జ్ఞానము నార్జింపుచుండును. కాని యీ త్రిమార్గములవలన గలుగు జ్ఞానము భ్రమాత్మకము. మన కింద్రియములవలన లభించు జ్ఞానము సత్యముగాదు. ఏలయన శుక్తియందు రజితభ్రాంతియు, రజ్జువునందు సర్పభ్రమయు గలుగుచున్నది. అందువలన మన మింద్రియములచేత వంచింపబడి సత్యమును గ్రహింపజాలకున్నాము.

మనము కార్యముల నొనర్చునప్పుడు, పలువిధ విఘ్నములకు లోనగుచుందుము. వానివలన గలుగు ననుభవమును దీర్ఘముగ విచారించి, పరిశీలించి, గ్రహించుటను యుక్తిజ్ఞాన మందురు. కాని యీ జ్ఞానమునకు మూలము ఇంద్రియగ్రాహ్యవిషయములు. అందువలన తర్కము సదోషమును, ససీమయు, అపూర్ణము నగు ఇంద్రియజ్ఞానము నతిక్రమించి, నిర్మలమగు సత్యస్వరూపమును వెల్లడింపజాలదు.

శ్రుతిస్మృతులద్వారమున బుద్ధికి వికాసమును గలిగించుదానిని ఉపదేశజ్ఞాన మందురు. కాని యీ

జ్ఞానముకూడ నింద్రియములకు దాస్యము చేయుచుం డును. ఇంద్రియములు భ్రమయందు దగుల్కొనక శాస్త్రగ్రహణ మొనర్పజాలవు. అందువలన బుద్ధి కూడ భ్రమనువీడి శాస్త్రవిచారణను జేయలేదు. శాస్త్రాధ్యయనమువలన భాషాజ్ఞానము గలుగును; పండి తుఁడు కావచ్చును. కాని ప్రత్యక్షానుభూతివలన గాని ధర్మోపలబ్ధి గలుగదు.

అందువలన యోగజ్ఞానముమాత్రము సత్యము. ఇంద్రియములవలనను, యుక్తివలనను, ఉపదేశమువలనను గలుగుజ్ఞానమునకును, యోగజ్ఞానమునకును సంబంధము లేదు. ఈ ద్వివిధ జ్ఞానముల కుండు భేదమును, ఉదా హరణపూర్వకముగ జూపించెదను. నేను నీ రూప మును గాంచి చంచలుఁడనైతి ననుకొనుము. కాని చంచలుఁడ నగుటకు కారణమేమి? నాదర్శనశక్తి నీ స్వరూపమును నాయందు బ్రవేశబెట్టెను. నీ వాక్య ములు నాకర్ణములయం దమృతవర్షమును గురిపించెను. నీ వాక్యము లెంతటిమధురములు? నీ యంగసౌరభము వలన నే నున్మాదుఁడ నైతిని. మరియు నీ సుకోమల దేహస్పర్శకొరకు నాశరీర ముప్పొంగెను. అప్పుడు నేను నిల్వజాలక నిన్నాలింగనం బొనర్చుకొంటిని. ఈ

యవకాశమును గైకొని నీవు నా సర్వస్వమును హరించి తివి. కాని యిట్టి యభిప్రాయముతోడ, నేను నీకడకు వచ్చియుంటినా? ప్రథమదర్శనమందు నా కావిష యము దెలియదు. కాని నీ గుణముల విచారింపకనే, నే నిట్లు చేయుటకు గతం బేమి? ఇంద్రియములేగదా దీనికి కారణము. దీనిని యింద్రియజ్ఞాన మందురు.

ఇంద్రియములను జయించినయెడల నిట్టిభ్రమకు లోబడ ననుకొంటిని. ఇకముందు జాగ్రత్తగ నుండ వలయునని దలంచితిని. ఇంద్రియములను స్వవశమొం దుంచుకొంటిని. ఇదివరకు నన్ను వశపరచుకొనిన లక్షణములను సంశయముతోడ దిలకింపసాగితిని. మరియు వానినిగూర్చి గభీరభావమున యోచింపఁజొచ్చి తిని. సంపూర్ణముగ బాహ్యాభ్యంతరముల నెరుంగ నిది యే వ్యక్తినిగూడ బ్రేమింపతగదని నిశ్చయించు కొంటిని. అట్టి స్థితియుం దొరకఁడు వచ్చెను. వాని యాకృతి, ముఖవర్చస్సు, పల్కులు, హావభావము మొదలగువానిని జాగ్రత్తగ వినుటకును, జూచుటకును, బ్రయత్నించితిని. వాని ప్రవర్తన యెట్టిది? వాని స్నేహితు లెవరు? వానికేవిషయమం దధికాశక్తి గలదు? వాడేకార్యము లొనర్చుచుండును? ఏయే పుస్తకముల

జదువుచుండును ? మొదలగు విషయముల దెలిసికొను టకు గడంగితిని. కాని యిదియంతయు బాహ్యాభిజ్ఞతయే కదా ! పిమ్మట దీర్ఘ జీవితానుభవముతోడ విచారించు టకు గడంగితిని. అప్పుడు నాబుద్ధియందు గలిగిన జ్ఞానమువలన విచారించి, చివరకొక సిద్ధాంతమునకు వచ్చితిని. అనగా, యిట్టిలక్షణములు గలవారలు దుష్టులుగ నుందురు కావున వీరిసహవాసము చేయతగ దనియు, లేక యిట్టిలక్షణములు గలవారలు సజ్జనులు కావున వీరిసహవాస మొనర్చుట యుత్తమమనియు , నిశ్చయించుకొని యాతనిని ప్రేమించితిని ; లేక విడ నాడితిని.

మానవుడు ప్రతివిషయమందును భ్రమప్రమాద ములయందు దగుల్కొనుచుండునని నుడువుటకు వీలు లేదు. ఒక్కొక సమయమం దేవిధమగు విచారణ లేకయే, సరియగు స్నేహితుడు దొరకవచ్చును. కాని మరియొకప్పుడు యోచించి యోచించి స్నేహమొనర్చిన స్నేహితుడు దుర్మార్గుడై మిత్రుని విడనాడుచుండుట మన కనుభవసిద్ధము.

పైన వివరించిన విధమున మానవుడు విషయ జ్ఞానము నార్జింపుచున్నాడు. ప్రథమమున నింద్రియ

ముల ద్వారమున పదార్థము మనస్సులోనికి జొరును. పిమ్మట యుక్తి యుపదేశజ్ఞానమువలన వానినిగూర్చి విచారించి, విమర్శించి, దానివిషయమున మిథ్య లేక సత్యమగుజ్ఞానమును బొందుచున్నాము. కాని యీజ్ఞానము అనుమానసిద్ధాంతమునకు సంబాధించినది. ఈసిద్ధాంతము సత్యమగునా కాదా, ఈచింతాప్రణాళికయందు ప్రత్యక్షేంద్రియగ్రాహ్యమగు నాశముగాక భ్రమవిరహితమగు సత్యముగలదా లేదా, యను విషయమందు నిశ్చయజ్ఞానము గలుగుట యసంభవము. ప్రత్యక్షము నకు వెలుపలనుండుదానిని మానవుడు సంశయదృష్టితోడ జూచుచుండును. మరియు దాని నింద్రియ సహాయ్యమున ప్రత్యక్షపదార్థములతోడ గలసినంతవరకంగీకరించును. మిగిలినది సత్యమని యంగీకరించుటకు సమ్మతింపడు.

స్వరూపనిర్ణయ మందు యోగు లవలంబించు మార్గము వేరు. వారిజ్ఞానము ఇంద్రియ సమన్వితమైనది కాదు. ఏదియో యొక హేతుసందర్శనమువలన గలిగినదికాదు. ఏలయన యోగి బుద్ధియొక్క నిరంతరానుశీలనమువలన ప్రతిపదమందును బుద్ధియొక్క యసంపూర్ణతను గాంచుచుండును. అందువలన నాతడు

ప్రతిపదమందునను వ్యర్థమనోరథుండై చివరకు మహా శక్తికి సమస్త మర్పించి క్రియారహితుం డగును. శుష్క తృణరాశిక్రింద నుండు నగ్ని వాయు తాడనమువలన, నొక్కమారుగ విజృంభించునుగదా! అటులనే యోగి యొక్క బుద్ధి యావరణను ఛేదించుకొని, యొక మహా తేజము బయల్పడును. ఆ తేజము సునిర్మలము; సర్వా భాసకమగు యోగజ్ఞానము.

యోగి తనయం దుద్భూతమగు ప్రజ్ఞాశక్తిని వస్తువులమీద ప్రసరింపజేయును. కాని యావస్తువుల నామరూపగుణములు ప్రత్యక్షము గావలసిన పనిలేదు. తన సత్తాతోడ నాపదార్థముయొక్క సత్తాయం దను ప్రవిష్టుం డగును. తానున్న మహాకారణము (స్వరూపము) మీదనే సమస్తవస్తువుల వికాస మున్నదని గ్రహించి, సహజముగ పదార్థముల యొక్కయు, మనుష్యుల యొక్కయు యథార్థతత్వమును నిరూపించును. కాని యాశక్తి యెల్లరకును లభ్యమగునది కాదు.

ఈ విషయము మిక్కిలి జటిలమైనది. ఏలయన మనము స్వభావసిద్ధముగ ఇంద్రియములు బుద్ధిద్వార మున జ్ఞానము నార్జించుచుందుము. కాని మనయందు ప్రజ్ఞాశక్తియున్నదను విషయము మనస్సునకు బోధ

గట్టదు. బుద్ధి సంపూర్ణభావమున నాయనంతశక్తిని ధ్యానింపుచు, దానియం దగాధశ్రద్ధ గలిగినయెడల మనోబుద్ధులు విశుద్ధములగును. శాంతియుతము లగును. అప్పుడు మనము ప్రజ్ఞాశక్తిద్వారముననే సమస్త కార్యము లొనర్పుచుందుము. మరియు మానవుని బాహ్యావయవములయందును, ఆచరణ మొదలగువాని యందును, లక్ష్యముంచకయే యంతర్దృష్టివలన వాని యంతఃప్రకృతిని గ్రహింపగలుగుదుము.

సంపూర్ణముగ నాత్మసమర్పణ మొనర్చినగాని, యీవిషయము హృదయంగమముగాదు. కారణజ్ఞానము గలిగినయెడల, ఏక్షేత్రమందైనను లేక యేయాధార మందైనను, కారణమధ్యస్థితమగు అవ్యక్తభావప్రకాశము గోచరించును. అది భావద్వారమున నుపలబ్ధి యగును. అందువలన యోగికి మానవుని బహిర్విషయములగాంచి వానిస్వరూపమును నిర్ణయింపవలసిన యావశ్యకత లేదు.

ఇక జ్ఞానము నార్జించుట కవలంబింపవలసిన ప్రణాలికనుగూర్చి యోచింతము. యోగి యేదయిన పదార్థమునుగాని మానవునిగాని దర్శించి వానిస్వరూపమును నిర్ణయింపదలచినప్పుడు, గతానుగతికమగు

మార్గమును వీడి, ఆవిషయముయొక్క భావముతోడ తనభావమును మిళితమొనర్చుటకు ప్రయత్నించును. అనగా ఇంద్రియములను బుద్ధిని లోబరుచుకుని జ్ఞాతవ్య విషయమును భావించి తెలిసికొనును. ప్రథమమున నది వ్యర్థప్రయాసముగ గన్పట్టును. కాని నిరక్షరుఁ డొక్క దినమున భారత భాగవతముల జదువగల్గునా? అట్టి గ్రంథములను చదువుటకు కొంత కాలము పట్టును. అటులనే యభ్యాసయోగ మొనర్చుచుండినయెడల, క్రమక్రమముగ భావమందు వస్తువుయొక్క యాత్మ తత్వము వికసించును. ఆ యధ్యాత్మతత్వమే కారణము. ఆ కారణముమీదనే సమస్త మున్నది.

అనంతరము బుద్ధిద్వారమున భావమధ్యస్థితమగు అవ్యక్త భావమును చింతనములోనికి దీసికొనును. ఇచ్చటనే భావము వికాసమును బొందును. అనను భూతమును అవ్యక్తము నగు జ్ఞానము, వాగ్బద్ధమై స్పష్టమగును. దీనిని చింతనమందుము. కాని మానవుఁడు సాధారణముగ అస్పష్టభావమున చింతింపుచుండును. దానిని యసంపూర్ణవాక్యముల నర్థస్ఫుటముగ వెల్లడింపు చుండును. కాని యోగి యావిధముగ నెప్పుడు నొన ర్పఁడు. సత్యమును సుస్పష్టముగ విశదీకరింపుచుండును.

యోగిచింతనము పరిస్ఫుటము. అందువలన నా చింతనావిషయము వాక్యములయందు సంపూర్ణముగ బ్రకాశించును. చింతింపకనే యోగికి స్వరూప జ్ఞానము గలుగును. కాని చింతించినను సుస్పష్టముగను, పరిపూర్ణముగను, చింతింపుచుండును.

అవసరమైనప్పుడు యోగి విచారణనుగూడ జేయును. కాని యావిచారణ వైజ్ఞానికుల పద్ధతి ననుసరించి యుండదు. ఆతఁ డింద్రియసహాయమున దర్శింపఁడు. సర్వాంతర్యామి చక్షువులతోడ జూచుచుండును. కావున నాదేవదృష్టి యోగికి సరియగు భావమును గలిగించును. ప్రత్యాదేశస్వరూపమగు నాభావము యోగిముఖమునను, లేఖనియందు భాషారూపమునను, బహిర్గత మగుచుండును. ఈ ప్రత్యక్షబోధ, యోగిని సత్యసిద్ధాంతమునుఁ జేర్చును. వివేకమెల్లప్పు డాతనిని యసత్యము, భ్రాంతి, మొదలగువాని నుండి రక్షింపుచుండును. యోగి తర్కమొనర్చును. కాని యది తర్కశాస్త్రపద్ధతిని యుక్తులమీద యుక్తులనుఁ బ్రయోగించి యత్యంతకష్టముమీద విషయమును నిర్ణయింపవలసిన యావశ్యకతయుండదు. ఆతని విశుద్ధ బుద్ధియందు భగవానుఁ డవసరమగు యుక్తితర్కముల

ప్రేరేపించుచుండును. భగవానుని ప్రత్యాదేశమును యోగి సరళభాషతోడను, సుస్పష్టముగను, మానవు లకు వెల్లడింపుచుండును. అందువలన యోగివాక్య ములు క్షురధారాసదృశములు. సజీవములు.

యోగి యేపదార్థమును గాంచక, కేవలము భావమునుమాత్ర మవలంబించి జ్ఞానము నార్జించి ఆ వస్తువుయొక్క బాహ్యవికాసముతోడ నాజ్ఞానమును మిళిత మొనర్చుకొనును. కాని యమానుష యోగ శక్తిద్వారమున సంపాదించిన జ్ఞానముమీద సంశయ ముండి, బాహ్యవస్తుప్రకాశముతోడ మిళితమొనర్చి చూచుకొనుచున్నాడని తలంపఁజనదు. యోగి తన యంతర్నిహితమగు పూర్ణసత్యము, మానవుని బాహ్య వికాసమునం దెంతవరకు ప్రకాశింపుచున్నదను విషయ మును దెలిసికొనుటకు సందర్శింపుచుండును. ఏలయన మానవునియందుండు అనంతభావరాశి సంపూర్ణముగ నొక్కమారుఁ బ్రకాశించుట యసంభవమని యోగి యెరుంగును. మరియు సంతర్దృష్టికి లక్ష్యమైయుండు సంపూర్ణసత్యముయొక్క క్రమవికాసమును గాంచి యా నందము ననుభవించును. యోగగతి ననుసరించి యోగి యనాగతభవిష్యద్విషయములను జ్ఞానద్వారమున దెలిసి

కొనును. మానవుని జూడకయే వానివిషయమును సంపూర్ణముగ జెప్పుచుండును. జగత్తునందు జరుగుచుండు సంగతులను ననాయాసముగ వెల్లడింపగలుగును. మానవునియందు సమగ్రవిశ్వముయొక్క సంబంధసూత్రము విరాజిల్లుచున్నది. కావున మనోబుద్ధులను సుస్థిరముగ నుంచుకొని యా మహాసూత్రము నవలంబింపవలయును. అప్పుడు జగత్తుయొక్క స్వరమాసూత్రమం దనాహత భావమున ధ్వనింపుచుండును. బాహ్యకోలాహలమునుండి నివృత్తి బొందగలిగినయెడల మన మనాయాసముగ నా మృదుమధుర మురళీనినాదమును వినగలము. సర్వదర్శిత్వము లభింప వలయుననిన మనస్సునం దేవిధమగువాసన నుండరాదు. ఈపై చెప్పిన విషయమంతయు యోగసిద్ధియొక్క యొక సోపానమని గ్రహింపవలయును. బుద్ధి విశుద్ధమైనయెడల నిట్టిలక్షణములు మనయందు కొద్దిగనో, గొప్పగనో, ప్రకాశించును. ఇట్టిసూచనలవలన మనయోగ మెంతవరకు కార్యకారియైనదను విషయమును నెరుంగవచ్చును. మనోబుద్ధులతోడ జ్ఞానము నార్జింపజాలము. మనోబుద్ధుల కతీతమైనది జ్ఞానము. జ్ఞానము భావరూపమున దర్శించుదానిని, బుద్ధి మనస్సుద్వారమున

ప్రకాశింపజేయును. ఆత్మసమర్పణయోగి కాళీశక్తి పదకమలములయందు సకలయంత్రముల సమర్పించి నిశ్చేష్టితుఁ డగును. అప్పుడు వానికి సకలతత్వములు హృదయంగమ మగును. బుద్ధి జ్ఞానాలోకమున నుద్భాసితమైనయెడల, బుద్ధికి ధారణాసామర్థ్యము గలుగును. మరియు ఖండత్వమునుండి విముక్తినొంది విశ్వజ్ఞానమున కాధారమగును.

---

## మనస్సు.

ఈ ప్రకరణమందు మనస్సునుగూర్చి యోచింతము. యోగగ్రహణాభిలాషి యగు సాధకుడు శరీరమందలి సూక్ష్మయంత్రములను స్వవశమందుంచుకొనవలయును. మనస్సునుగూర్చి పలువురు పలువిధముల జెప్పుచుందురు. ఇంద్రియములను మనస్సు నడిపింపుచుండును. ఇంద్రియములయం దైదు జ్ఞానేంద్రియములు ఐదు కర్మేంద్రియములు గలవు. కాని శాస్త్రకారులలో గొందరు మనస్సునుగూడ నొకయింద్రియముగ చేర్చికొనియున్నారు.

వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ లను నైదును కర్మేంద్రియములు. చక్షు, కర్ణ, నాసిక, జిహ్వా, త్వక్కు అను నైదును జ్ఞానేంద్రియములు. స్థూల సూక్ష్మేంద్రియములకు వెనుక మనస్సుండనియెడల జ్ఞానము కర్మ మొదలగునవి సరిగ నెరవేరుటకు వీలులేదు. అందువలన మనస్సు విశుద్ధము గానప్పుడు భగవత్కార్యము మానవునిద్వారమున సుస్పష్టముగ వెల్లడియగుట యసంభవమగును.

సాధకునియందు జ్ఞానము ప్రకాశించినయెడల, శక్తి మనస్సునందవతరించును. ఇది శక్తిసాధకునకు తృతీయావస్థ. కాళీశక్తి నాహ్వానించి, యాశక్తికి సర్వస్వ మర్పించు సంకల్పము ప్రథమావస్థ. కాళీశక్తిని మేల్కొలిపి యాశక్తిద్వారమున జ్ఞానజ్యోతిని వెలుంగజేయుట ద్వితీయావస్థ. మనోబుద్ధుల యపరిశుద్ధతను దొలగించుకొని యచ్చట జ్ఞానమును విరాజిల్ల జేసికొనుట తృతీయావస్థ.

జ్ఞానప్రకాశలక్షణములు, మార్గములు మొదలగువానినిగూర్చి వెనుకటిప్రకరణమందు చెప్పియున్నాను. ఈ ప్రకరణమునందు మనస్సునుగూర్చి వివరింతును.

సూక్ష్మయంత్రములను సుస్పష్టముగ దెలిసికొనుటకుగాను, వానిని (౧) ఇచ్ఛాశక్తి (౨) జ్ఞానము (3) విచారబుద్ధి, (బోధశక్తి) (౪) మనస్సు అని నాలుగు భాగములుగ విభజింపుచున్నాను. మనస్సును, బుద్ధిని, వేరుగ బేర్కొనియున్నాను. కాని యీ రెంటిని భిన్నపదార్థములని దలంచిననుగూడ వీనికత్యంత సంబంధముగలదు. మానవుఁడు కేవలము యుక్తి, తర్కము, స్మృతి, కల్పన, అనుమానము మొదలగు

వాని యధీనమం దుండినయెడల బుద్ధిని విశుద్ధమొనర్చు కొని యున్నతజ్ఞానము నాశ్రయింపవచ్చును. కాని చిత్తరాజ్యముయొక్క కల్పనామందిరమందు మనోప్రభా వము మిక్కుటముగ నున్నది. అందువలన మనస్సును పరిశుద్ధముగ నుంచుకొననియెడల, బుద్ధియొక్క విశు ద్ధతఁగూడ సంభవముగాదు. కాని సాధనకాలమందు మనోబుద్ధులను స్వతంత్రముగ తలంపక, ఒక్కసూత్ర మందు బంధింపబడినటుల యోచవలయును.

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము లను వానిని, అంతఃకరణచతుష్టయ మందురు. మస్తి ష్కమును మూడుభాగములుగ విభజింపవచ్చును. అందు ప్రథమసోపానమున ఉన్నతమగు బుద్ధియుండును. అనగా నచ్చట జ్ఞానముండును. దానిక్రిందనుండు మెట్లయందు వరుసగా విచారబుద్ధి, బోధశక్తి యుండును. కాని యీ రెండింటిని కలిపి బుద్ధియని సాధారణముగ బిలచుచుందురు. బుద్ధియందును, హృత్పద్మస్థితమగు మనస్సునందును, దానిక్రిందనుండు చిత్తమునందును వ్యాపించియుండునది యహంకారము. అహంకార మనగా సూక్ష్మవస్తువుయొక్క చతుర్విధవృత్తు (తరం గము) లని యెరుంగవలయును. శాస్త్రకారులలో

కొంద రీ సమష్టివస్తువును 'మనస్సు' అను నామమున బేర్కొనియున్నారు. కాని నేనీ ప్రకరణమందు అంతః కరణసమష్టియొక్క ద్వితీయసోపానమగు మనస్సును గురించి విచారించెదను. మనస్సుయొక్క విశేష కార్యము లను దెలిసికొనగలిగినయెడల విషయము సుస్పష్టమగును. మనము శబ్ద స్పర్శ రూప రస గంధము లను ఇంద్రియము లవలన గ్రహింపుచుందుము. అనగా మున్ముందు ఇంద్రియ ములు బాహ్యవస్తువుయొక్క ప్రతిబింబమును గ్రహిం చును. వెంటనే మనస్సు దానిని ధారణచేయును. బాహ్యవస్తువును జూచుటకు ద్వివిధమార్గములు గలవు. ప్రథమమున ఇంద్రియములు బాహ్యవస్తువును సందర్శిం చును. వెంటనే తద్విషయిక మగు అస్పష్టాభిజ్ఞత మన స్సును జేరును. కాని యొకప్పుడు గృహీతప్రతిబింబము మనస్సునందు నిరాకరింపఁబడవచ్చును. రెండవది మనస్సాప్రతిబింబమును సంపూర్ణముగ గ్రహించును. అనుభవించును. దానికి నామకరణ మొసంగును. ఆ వస్తువుయొక్క జ్ఞాన ముపలబ్ధినొందును. అది యస్ప ష్టమగు ప్రత్యక్షజ్ఞానము. ఆజ్ఞానము జన్మజన్మాంతరముల యందుగూడ దూరమగునది కాదు.

భూతభవిష్యద్విషయముల యందు, చక్షువులు,

కర్ణములు మొదలగు ఇంద్రియముల కేవిధమగు జ్ఞానము గలుగుటకు వీలులేదు. సమ్ముఖమందు లేని యే వస్తువు నైనను ఇంద్రియములు దెలిసికొనజాలవు. కాని మనస్సు త్రికాలవిహారి; భూత భవిష్య ద్వర్తమాన కాలములయందు సంచరించుచుండును. అంతఃకరణచతుష్టయము నిస్తబ్ధమైనయెడల, ఇంద్రియముల క్రియాశక్తి లోపించును. చక్షువులు మొదలగు ఇంద్రియములు వినష్టమైనను మనోక్రియ నశింపదు. మనస్సు కల్పనా చక్షువులతోడ భూత భవిష్యత్తుల గైకొని మహావిచిత్ర సౌధమును నిర్మించుచుండును. చక్షువులు దర్శించును, కర్ణములు వినును. ఇటులనే పంచేంద్రియములకు వేరువేరు ధర్మములు గలవు. కాని యందేదియూ నొక్కదానికంటె నెక్కుడు కార్యములను చేయజాలదు. కాని మనసొక్కకాలముననే, సర్వరసముల ననుభవించును. సప్తవర్ణముల సంయోగమువలన నంకితమగు చిత్తరువు మనోహరముగ నుండును. కాని యొక్కవర్ణమున చిత్రించిన చిత్తరువు నేత్రానందమును గలిగింపజాలదు. ఇదేవిధముగ యింద్రియములయందొక్కొక్కదానికి, యొక్కొకశక్తి యుండుటవలన నవి వైచిత్ర్యవిహీనములు. కాని మనస్సు భావికాల

మందలి వాల్మీకి తపోవనములోని కాషాయాంబరధారు లగు కుశలవుల వీణాయంత్రము శ్రీరామ గుణగాన మొనర్చుచుండుటను, ఆ పవిత్రక్షేత్రమందలి హారీత, అమలక వృక్షపత్రములు, హరిత పీత వర్ణములతోడ సుశోభితమై యలరారుచుండుటను, ఆ తపోవన పద తలమును ధౌతమొనర్చుచు పుణ్యసలిలయగు మహా ప్రవాహము ప్రవహింపుచుండుటను, జలచరపక్షుల యానందకలవరమును, విహంగగణసుమధురకూజితములు మొదలగువాని నొక్కకాలమున శ్రవణదర్శనముల ననుభవించును; ఆనందించును. మనస్సుయొక్క కల్పనాశక్తి యసాధారణము. నేత్రములు సమ్ముఖమం దుండు రూపముయొక్క ప్రతిబింబమును మనస్సున కర్పించును. మనస్సు విభిన్నస్థానములయందుండు పలు దృశ్యములతోడ నొకయద్భుతమును, అపూర్వమునునగు చిత్రమును రచించుకొని, ఆనందమును సృష్టించుకొ నును. ఆయానందమునందు పరవశత్వమున నోలనాడును. కాని యా యానందమునకు పరిమితియెక్కడ ? ఇంద్రి యముల కార్యములు కట్టుపడినను, మానవుని కల్పనా స్రోత మడ్డులేక ప్రవహింపుచుండును.

మనస్సు ఆకాశమందలి ఘటనలనుగాంచి వర్షము

కురియుననియు, ధూమమును జూచి దానిక్రింద నగ్నిగల దనియు, దృఢముగ జెప్పును. కాని యొకప్పుడు మేఘములు దొలంగుటవలన వర్షము కురియకపోవచ్చును. రసాయనిక సంయోగమువలన ధూమసృష్టియగును. కాని, దానిక్రింద యగ్ని యుండదు.

మనోకల్పన ఇంద్రియములకు సంబంధించియుండును. ఇంద్రియముల దర్శనము స్పర్శనము శ్రవణము మొదలగు క్రియాసముదాయము యొక్క క్రమమే మనస్సుయొక్క చింతనము. ప్రేమ, సాహసము, త్యాగము, మొదలగునవి మనస్సునకు బోడగట్టినప్పుడు చైతన్యప్రభువు, భద్రాద్రిరామదాసు, ప్రతాపుతు, శంకరుడు, బుద్ధుడు, మొదలగు మహాపురుషులచరిత్రలు స్ఫురించును. చూచినదానిని విన్నవిషయమును మనస్సు ధారణచేయగలదు. కాని యింద్రియాతీతమగు వస్తువును మనస్సు ధారణజేయజాలదు.

మనస్సు చింతింపుచుండునని యనేకులు చెప్పుచుందురు. కాని యది యథార్థము కాదు. మనస్సు ఇంద్రియములద్వారమున విషయములను గ్రహించును. ఆవిషయములగూర్చి యోచించును. బుద్ధినుండి చింతాతరంగములు చిత్తమిూద పడునప్పుడు, మనస్సు

వానిని ధారణచేసి, యింద్రియములవలన గలిగిన జ్ఞాన కల్పనయం దనురంజితమొనర్చి చిత్రవిచిత్రము లొనర్చును. మానవుని బుద్ధియే చింతాయంత్రము. ఇంద్రియ గణసహాయమున మనస్సు ధారణచేయజాలని వానిని బుద్ధి ధారణచేయగలుగుచున్నది. పాశ్చాత్యులలో కొందరు, ఇంద్రియ లబ్ధమగు విషయసమూహమందు, యుక్తిసహాయ్యమున, శృంఖలావిధానము నేర్పరచుట యే బుద్ధియొక్క కార్యమని చెప్పుచున్నారు. కాని యది భ్రమ. ఇంద్రియసంబంధమగు చింతనము మనోకార్యమని చెప్పియున్నాను. పశువుల చింతనము మనస్సు కధీనమందుండును. అవి చూచినవానిని విన్నధ్వనిని గూర్చి భావించి కల్పనచేయుచుండును. కాని మానవుని బుద్ధి యాంతకంటె నున్నతస్థానమం దున్నది. " బుద్ధిగ్రాహ్యమతీంద్రియం " యోగసాధనవలన మానవుడు ఇదివర కెప్పుడునుఁ గాంచని వినని విషయములను బుద్ధిద్వారమునఁ దెలిసికొనుచున్నాడు. చింతనము సంబంధమున పాశ్చాత్యజడవాదులధారణ సంపూర్ణమగు భ్రమ యను విషయ మిందువలన సుస్పష్టమగుచున్నది. వారి ధారణ కేవలము మనస్సునకుమాత్రము చెల్లును.

మనస్సుయొక్క యశుద్ధత చూచినట్టియు, విని

సట్టియు, విషయములయందు గలుగు భావమును బుద్ధి మీాద నంకితమొనర్చును. సాధారణముగ మనస్సు బుద్ధిని నడిపింపుచుండును. కాని బుద్ధినుండి వెల్వడు సత్య ధర్మము మనస్సుయొక్క యశుద్ధతవలన వికృతినొంది ప్రకటిత మగుచుండును.

మనోకల్పన కేవలము బాహ్యజగత్తునందలి దర్శనస్పర్శనమువలన గలుగునది కాదు. మనోబుద్ధుల చింతనమును, చిత్తముయొక్క యతీతస్మృతిసముదాయమును గైకొని, యింద్రియములద్వారమున దానిని మీామాంసజేయుచుండును. అందువలన బుద్ధిబలము తరిగినవాడు మనస్సున కధీనుడై యుండును. మనస్సు చూచినదానిని, వినినవిషయమును యదార్థమని నమ్మును. కాని యింద్రియాతీతవస్తువు నెప్పుడును నంగీకరింపదు.

మనస్సుయొక్క సాధారణావస్థలను సంక్షేప ముగ వివరింపుచున్నాను. మొదటిది యింద్రియముల వలన గలుగుచుండు బాహ్యస్పర్శ (Sensation) సంబంధ మందలి యభిజ్ఞతను గ్రహించును. (percept) పిమ్మట దానిని ధారణజేయుటకు బ్రయత్నించి ' ఇది, యది ' అని నిర్ధారణజేయును. వానికి నామ మొసంగును.

రెండవది బుద్ధియొక్క చింతనమును, చిత్తభాండారమందలి స్మృతిసముదాయమును, గైకొనియెల్లప్పుడును నింద్రియసహాయమున మిళితమొనర్చి చూచుకొనుచుండును. కాని బాహ్యజగత్తుయొక్క జ్ఞానముతోడ కలియనియెడల దాని నసత్యమని నమ్మి పరిత్యజించును.

మున్ముందు యోగి మనస్సును ప్రశాంతముగ నుంచుకొనును. మనస్సునందలి తరంగపరంపరను నడంచుకొనును. మనస్సు చంచలముగ నుండినయెడల స్వల్ప జ్ఞానము గలుగును. కాని పూర్ణజ్ఞానము లభింపదు. ప్రశాంతమగు మనస్సు యోగసాధనకు సర్వోత్కృష్ట సహాయము.

మనస్సు ధారణచేయగలిగినంతవరకు చింతింపుచుండును. ఇంద్రియకర్తృకమగు విషయస్పర్శయందలి మనస్సుయొక్క లీల నివృత్తియగుటెట్లు? కాని మన మింద్రియగణమును బంధించి యుంపజాలము. సమాధి ద్వారమున మనస్సును సుశాంతముగ నొనర్చుకొనవచ్చునను విషయ మెల్ల రంగీకరింతురు. ఇందువలననే వేదాంతులు సమాధియం దత్యంతానురాగమును గలిగియున్నారు. సమాధియందు ఇంద్రియములను మరలించి మనోగతిని బంధింపవచ్చును.

కాని సమాధిద్వారమున జ్ఞానార్జనకు గడంగం దలచినయెడల సన్న్యాసమును బుచ్చుకొనవలయును. సర్వసంగపరిత్యాగ మొనర్చి యరణ్యావాస మొనర్ప వలయును. భగవానుని గైకొని జగత్తును విడువవల యును. కాని యీసాధన సత్యమా ? స్వాభావికమా? స్వాభావికావస్థయం దుపేక్షనహించి యస్వాభావికపద మందు నడచుట యోగికి కర్తవ్యముగాదు. కావున విశ్వ మునకును, విశ్వేశ్వరునకును భేదమును గల్పింపక సాధన నొనర్పవలయును.

కావున వర్తమానయుగమందు తంత్రయోగము సర్వోత్తమమార్గము. మనస్సును స్థిరమొనర్చుటకు సమాధి యత్యుత్కృష్టమైనదని తాంత్రికయోగు లెఱుం గుదురు. కాని యిది యొక్కటిమాత్రమే కాదు. తాంత్రి కుఁడు తన యంతఃకరణమును సక్రమముగ నుంచుకొను ను. కాని దర్శనము, స్పర్శ, భ్రమణము, ఆహారము, నిద్ర మొదలగువాని నణుమాత్రమైనను వీడడు. సమస్త కార్యములు యథాక్రమముగ జరుగునప్పుడు మనస్సు స్థిరముగ నుండు టెట్లను శంక గలుగవచ్చును. కాని తాంత్రికుఁడు మనోధారణను నింద్రియకల్పననుండి తప్పించును. మరియు నింద్రియగ్రాహ్యవిషయములను

గ్రహించు కర్మశీలతనుఁగూడ బుద్ధికి సమర్పించును.

ఈవిషయమును స్పష్టపరచుటకు బ్రయత్నింతును. యోగి చూచును, వినును, ఆఘ్రాణించును, స్పర్శించును. కాని వీనిని మనస్సుతోడ జేయఁడు. బుద్ధియందింద్రియశక్తితోడ నాకార్యము లొనర్చుచుండును. ఇంద్రియములు స్వధర్మమున జగత్తునందలి సర్వవిషయములయందును సంచరింపుచుండును. మనస్సునకు మారుగ జ్ఞానోద్భాసితమగు బుద్ధి వానిని గ్రహింపుచుండును. ఈవిధముగ నొనర్చినయెడల జీవితమం దత్యద్భుతపరివర్తనము గలుగును. ఇంద్రియగ్రాహ్యమగు విషయసముదాయము సుందరమును సుస్పష్టమునై విరాజిల్లుచుండును. వానియందలి యత్యంత సూక్ష్మవిభాగములుగూడ గన్పట్టుచుండును. సమస్తవస్తువు లొక దివ్యసత్తాసమ్ముఖమం దుపస్థితమగును. ఇంద్రియములవెనుక బుద్ధి సారథిరూపమున నిలచియుండఁనప్పుడు "కనుపడునది, వినపడునది" అత్యంతసుందరముగను, సుమధురముగ నుండును. అనగా నట్టిదాని నిదివర కెప్పుడును చూచియుండడు. వినియెరుంగడు.

పత్రముల యుజ్జ్వలవర్ణము, పుష్పముల సుమధురసౌరభము, పక్షుల కలకలనినాదము గలిగించు ఆనంద

మును, రసమును నాస్వాదించెదము. కాని యది పృథ్వి సంబంధమగునది కాదు. స్వర్గసంబంధమైనది. అప్పుడు సాధకునకు పృథ్విని వీడవలయునని దలంపుండదు. "పృథ్వియందే లీలామయుఁడగు భగవానుఁడు విచిత్ర గతులతోడను పలుభావములతోడను విహరించు చున్నాడు. కావున నిచ్చటనే భగవానుని యారాధింతును. చిరవాంఛితమగు సత్పదార్థముతోడ క్రీడింతును. ఇంద్రియములు బాధావిహీనములై విముక్తము లగును. ఈవిముక్త యింద్రియపథమున పార్థివ వస్తువులయందు విశ్వేశ్వరుని గుణమును ఆనందమును వికాసమును, వర్తమానమందు చూచుచుందును." అను యథార్థజ్ఞానము గలుగును. బుద్ధియందుండు ఇంద్రియముల నిరంకుశసార్వభౌమశక్తిని యోగమార్గమందలి "ప్రకామ్యము" అను పేరుగల ఖండసిద్ధియని యెరుంగ వలయును. యోగము పూర్ణత్వమును బొందినయెడల మనస్సును విడనాడవలసిన యావశ్యకత యుండదు. అప్పుడు మనస్సు ముక్తద్వార మగును. దీనినుండియే బుద్ధి చిత్తమునకు సమాచారమును బంపుచుండును. అప్పుడాసమాచారమును చొంగిలించు రాక్షసి మనస్సు నావరించియుండదు. మనస్సు స్థిరభావమున తనమీద

నుండి ప్రవహించువానికి సేతుస్వరూపముగ నుండును.

మనస్సును స్థిరమొనర్చుకొనుటకు పలువిధమార్గ ములు గలవు. మనస్సనం దొకభావము, బుద్ధియొక్క కార్యము ననుసరించుచు చింతింపుచుండును. దానిని బంధించినయెడల జ్ఞానము నిలచిపోవును. అనగా ఇంద్రి యములకు ప్రభురూపమున మనస్సు చూచుచుండును; వినుచుండును. కావున మనస్సు స్థిరముగాదు. అందు వలన యోగసాధనకు నష్టము గలుగుచుండును. ఇదియే మిగిలినసాధనలయం దుండు లోపము.

ఆత్మసమర్పణయోగమందు కాళీశక్తి ద్వారమున నొక్క కాలమున జ్ఞానమును ప్రజ్వలింపజేసికొనవల యును. మనస్సును స్థిరముగనుంచుకొనవలయును. ఈప్ర ణాళిక నవలంబించినయెడల ద్వివిధసౌలభ్యములు గలవు. మొదటిది గతానుగతికుల మార్గానుసారము మనస్సును స్థిరమొనర్చుకొనవలసిన పనిలేదు. అట్లొనర్చుట మంచిదే కాని, యది యత్యంతకఠోరమును కష్టసాధ్యమగు తపస్సు వలనగాని లభింపదు. సహజమార్గమున నెమ్మదినెమ్మదిగ బుద్ధిని పరిశాళింపజేయవలయును. అప్పుడు జ్ఞాన జ్యోతి బుద్ధియొక్క చింతాశక్తిని తగ్గింపక దాని నున్నతచింతనమందు నిమగ్నము జేయును. అందు

వలన దాని క్షుద్రత్వమును సంకీర్ణతయు దూరమై యది దేవస్వరూపమును బొందును. మనోకార్యము లను "రుద్ధ" మొనర్పక వానిని బుద్ధిగతముగ నొనర్ప వలయును. అనగా బుద్ధికి యంత్రముగ నొనర్చి పరి శుభ్రి మొనర్పవలయును. ఇంద్రియముల విషయ గ్రహణశక్తిని ధ్వంస మొనర్పక "ప్రాకామ్యశక్తి" యొక్క క్రియాశీలతను నచ్చట వికసింపచేయవలయును. రెండవది నిద్రయందు తప్ప మిగిలిన సమయములయందు విషయస్పర్శ కట్టుబడదు. చింతాధారను రుద్ధమొనర్చు కొనవచ్చును. కాని కేవలము చింతాశూన్యమైన మాత్రమున మనస్సు స్థిరము కాదు. జ్ఞానప్రకాశము గలుగనియెడల మనస్సుయొక్క యోగప్రతిబంధకమగు అనధికారచర్చనుండి విముక్తి నొందుటెట్లు? జ్ఞాన ముద్దీపితమైనయెడల మనస్సు తరంగవిహీనమగును. ఏల యన జ్ఞానప్రకాశమునే సాధకుఁడు చూచుచుండును. స్వాభావికవిషయప్రతిబద్ధమగుటకు పూర్వము "ప్రాకా మ్యము" ప్రస్ఫుటితమై క్రియాశీల మగును.

అష్టసిద్ధులయం దొకదానిని ప్రాకామ్య మందురు. అనగా స్వేచ్ఛానుసారము సంచరింపగలశక్తి.

శ్లో॥ అణిమా మహిమా చైవ గరిమా లఘిమాతథా।
ప్రాప్తిఃప్రాకామ్యమీశత్వంవశిత్వంచాష్టభూతయః॥

---

# చిత్తము.

—:o:—

చిత్తమును ద్వివిధముగ విభజింపనగును. మన స్సుయొక్క శబ్ద స్పర్శ రూప రస గంధముల యందును, బుద్ధియొక్క చింతన కల్పన సంఘటనముల యందును, చిత్తముయొక్క యొకవిధమగు తరంగస్పందన మందు ను. దీనిని చిత్తముయొక్క ప్రథమసోపానమని యెరుంగ నగును. అనగా అనుభూతి రసావేశమని చెప్పుదురు. చిత్తముయొక్క ద్వితీయసోపానము చిత్రిగుప్తుని గ్రంథ భాండరము వంటిది. ఇచ్చటనే జన్మజన్మాంతర సంచిత మగు సంస్కారరాశి స్మృతిరూపమున నణగి యుండు ను. ఇహజన్మయొక్క ప్రవృత్తిరాశి మరణముతోడ నశింపదు. అది సంస్కారరూపమున జీవునితోడ ననుగ మించును. మానవుడు తిరిగి జన్మించినయెడల మూలా ధారస్థితమగు సుప్తసంస్కారములు క్రమముగ ఫలవంత ములై జీవుని యనేకవిధముల బాధింపుచుండును. కావున చిత్తముయొక్క ద్వివిధసోపానములగూర్చి యొకింత విపులముగ విచారించుట యావశ్యకము.

చిత్తముయొక్క ప్రథమసోపానము ఆవేగతత్త్వాశ్రిత ము. కాళీశక్తి యిచ్ఛవలన ఆవేగము సృష్టియగును. ఆవేగము గలుగనియెడల జీవున కేకార్యమందును

ఉత్సాహ ముండదు. బద్ధజీవుఁ డొనర్చు కార్యములు ప్రత్యక్షభావమున కాళీశక్తిప్రేరణవలన గలుగునవి కావు. ఆవేగమును వాసనయు జీవుని కార్యక్షేత్రమం దున్మాదునిగ నొనర్చుచుండును. కావున ఆవేగము జీవుని చిత్తమం దేవిధముగ కార్యముచేయుచుండు నను విషయమును దెలిసికొనవలయును. చేతనాచేతనము లన్నియు విశ్వజననిచేతి యంత్రములు. ఆమె యిచ్ఛవలననే యవి యన్నియు కదలుచున్నవి. మన మనంతవిధము లగు కర్మసృష్టి నొనర్చుకొని విశ్వనాటకరంగమందు ప్రియాప్రియములు, మంచిచెడుగులు, సుఖదుఃఖములు మొదలగు పలువిధ భావముల నభినయింపుచుందుము. కాని యవియన్నియు మన స్వేచ్ఛాప్రేరితములా? జగజ్జనని లీలలా? మన స్వేచ్ఛవలన నొక్కతృణమును దగ్ధమొనర్ప గలిగిననుగూడ విశ్వశక్తిని వీడి మనక్షుద్రశక్తిమీద మనమాధారపడవచ్చును. కేనోపనిషత్తునం దీవిషయము బహుచక్కగ వర్ణింపబడియున్నది.

"కేనేషితం పతతి ప్రేషితం మనః
కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః"

కాళీశక్తి యిచ్ఛ యావేగరూపమున జీవుని చిత్తమందు స్పందన మొనర్చును. ఆ యిచ్ఛవలననే

మనము సమస్తకార్యము లొనర్చుచున్నాము. కావున నీ తత్వ ముపలబ్ధి నెందవలయుననిన యోగసాధనకుఁ గడంగవలయును.

చిత్తమం దుదయించు ఆవేగము మూడు విధములు. వానిని భావోద్దీపనము, అనుభవోద్దీపనము, కర్మోద్దీపన మని నుడువుచుందురు.

ప్రథమము భావోద్దీపనము. తల్లి యిచ్ఛ సహస్రదళపద్మమునుండి బుద్ధిని యతిక్రమించి యప్పు డప్పుడు జీవునిచిత్తమందు ప్రతిఫలించి యొకవిధమగు స్పందనమును గలిగించును. దీనిని భావోద్దీపన మందురు. అప్పుడప్పుడు సహజప్రేరణరూపముననను, వేరొకప్పుడు ప్రత్యాదేశరూపముననను, మానవుని చిత్తమం దీ భావోద్దీపనమును గలిగించి కవినిగను, భక్తునిగను, ప్రతిభావంతునిగను, విశ్వాసునిగ నొనర్చుచుండును. సాధారణమానవులకీ భావోద్దీపనము వలన మేలుకలుగును. కాని యోగుల కిది మిక్కిలి యనిష్ట దాయకము. ఏలయన భావోద్దీపనము కాళీయిచ్ఛయే యైనను, బుద్ధికి తెలియకుండగనే యది చిత్తమందు ప్రవేశించి యందలి పూర్వస్మృతి, సంస్కారములు, భావములతోడ గలయును. అది తిరిగి బుద్ధియందు

జేరి దానిని యఘాతమొనర్చునప్పుడు, పలుభావముల
తోడను, కల్పనలతోడను ననురంజితమై వికృతినొందును.
అందువలన భావోద్దీపనము మానవునియం దసంపూర్ణ
లీల నొనర్చును. యోగి విశుద్ధలీలను, వికృతముగాని
యానందమును, పరిపూర్ణదేవజీవనమును వాంఛింపు
చుండును.

ద్వితీయము అనుభవోద్దీపనము. అనుభూతి
స్పందనమును ఆవేగమని చెప్పవచ్చును. దశేంద్రియ
ములను నలువైపులకు ద్రిప్పి, మనోబుద్ధుల కార్యా
ఘాతములవలన చిత్తమం దుత్పన్నమగు భావమును,
అనుభవోద్దీపన మందురు. మనోబుద్ధులు విశుద్ధమైనను,
చిత్తశుద్ధి గలుగనిది, యేకార్యమును సరిగ జరుగుటకు
వీలులేదు. భావోద్దీపనమునవలన చిత్తవికృతి గలుగు
నటులనే, విశుద్ధమగు మనోబుద్ధులు, చిత్తవికృతి
యావేగమునవలన వికారములై ప్రకటితము లగుచుం
డును. అందువలన యోగులు మున్ముందు సమస్త
యంత్రములను పరిశుభ్రి మొనర్చుకొందురు.

అనుభవోద్దీపనము నిత్యము, అనిత్యమని యిరు
తెరంగులు. సత్యమగునది నిత్యము. చిరస్థాయి
గానిది వికృతి, యనిత్యము. ప్రేమ సత్యము. జ్ఞానాను

మోదితము. అది మానవుని వివర్తనధారయందు వికృతినొందదు. ప్రేమయొక్క వికారము అసహ్యము. ఇది యజ్ఞానమువలన గలుగుచున్నది. ధైర్యము సత్యము. దైన్యము వికారము. కావున నిత్యమగునది ధర్మము. అనిత్యమగునది యధర్మము. ఇది సనాతన యాదర్శవిషయము. కాని ప్రపంచమందలి సామాజిక ధర్మాఽధర్మముల విషయము గాదు. కాని యీ యనిత్యవికారములవలన గూడ నొకింత ప్రయోజనము గలదు. ఏలయన వికృతినుండియే మానవుఁడు నిత్య ధర్మమార్గమున నడచుచున్నాడు. కావున యోగి యనిత్యధర్మమును వీడి నిత్యధర్మము నాశ్రయించును.

తృతీయము కర్మోద్దీపనము. మానవుఁ లావేగ పరవశులై కార్యము లొనర్చుచుందురు. ప్రేమ, ఘృణ, కామము, క్రోధము, హింస, ఉన్నతాభిలాష మొదలగు ఉత్తేజకవృత్తిసమూహమువలన మానవుఁ డున్మాదుఁడై తిరుగుచుండును. శుద్ధినిబొందని మానవుఁడు విశుద్ధవృత్తుల నాస్వాదింపఁజాలఁడు. కాని మానవుడు కామమునకు వాసనలకు లోబడక కార్యము-లొనర్పవచ్చునను విషయము నంగీకరింపఁడు.

చిత్తముయొక్క ద్వితీయసోపానమును గూర్చి

యోచింతము. చూచుట, వినుట, చింతించుట, గ్రహించుట, అనుభవించుట, మొదలగువాని చిత్తరువు ద్వితీయసోపానమందు ముద్రిత మగును. మానవుఁడు మరణకాలమందు వానిని౯గైకొని సూక్ష్మశరీరముతోఁడ ప్రస్థానమున కేగును. తిరిగి జన్మించునప్పుడు, పూర్వ జన్మకృతమగు ప్రవృత్తిసముదాయము సంస్కారరూప మున నుండును. ఇచ్ఛ లేకున్నను మన మప్పుడప్పుడు అన్యాయకార్యము లొనర్చుచుండుటకు కారణము పూర్వ జన్మసంస్కారము లని యెరుంగవలయును. యోగి కుండలినీశక్తిని మేల్కొలిపి తనయందు దాగియుండు సంస్కారములను దర్శించును. యోగగతి వృద్ధియైన కొలదిని ఆ సంస్కారము లన్నియు నిర్వీర్యము లగు చుండును.

యోగి చిత్తము నెట్లుపయోగించుకొనును? మానవుఁ డిహజన్మప్రవృత్తిపీడనమువలన తల్లడిల్లుచుం డును. జన్మజన్మాంతరములయందలి సంస్కారములు, పలుమతములు, నానాభావములు, ధారణలు, మొద లగువానికి వశవర్తినిగ నొనర్చి యోగమార్గమునుండి దప్పించుటకుఁ బ్రయత్నింపుచుండును. యోగి మనో బుద్ధులను సుశాంతముగ నుంచుకొనుటకు కాళీదేవికి

సమస్తమర్పించి శుద్ధిని బొందుచుండును. మరియు చిత్తమునుఁగూడ కాళీదేవి కర్తృరూపమున నర్పించి నిశ్చింతగ నుండును. కాళీశక్తి బుద్ధిని చింతించుటకు సృష్టించియున్నది. కాని కర్మమొనర్చుటకు సృష్టింపలేదు. చిత్తమును తన విశుద్ధేచ్ఛయొక్క యావేగమును ధారణజేయుట కుత్పత్తిచేసియున్నది. కాని కర్మను చేయుటకు కాదు. మరియు చింతనము లేక భావమును సృష్టించుటకు గాదు. భావోచ్ఛ్వాసము మానవుని కార్యములను స్వభావసిద్ధమగు రంగుకుంచె తోడ మెరుగుబెట్టును. మానవుఁడు ప్రేమ, సాహసము, గర్వము, సత్యాభిలాష, ఆత్మవిశ్వాసము, మొదలగువానితోడ నిండియుండును. కాని యివి మానవుని కార్యములయందు నియమింపబడియుండవు. యోగి యేదియోయొక విశేషోత్తేజనమునకు వశుఁడై కార్యము లొనర్పఁడు. ఆతఁడు పురుషుని యిచ్ఛవలననే కార్యములు చేయుచుండును. విజ్ఞానమయకోశద్వారమున కాళీశక్తిని దర్శించును. బుద్ధితోడ తల్లిసేయు కార్యములను, వానియుద్దేశమును, భావమును, దిలకించును. హృదయము చిత్తద్వారమున నాకార్యముల నుపయుక్తమగు భావానుగతముగ నొనర్చును.

కాని దుష్టమగు అసురబుద్ధి, కాళీదేవి యిచ్ఛను స్వకీయ యుక్తితర్కములతోడ వికృత మొనర్చును. అసుర చిత్తము ఆ శుద్ధ యావేగముతోడ భగవదిచ్ఛను నియంత్రిత మొనర్చుటకు బ్రయత్నించును. కావున తల్లి పదపద్మములయందు సర్వస్వమర్పించినయెడల తల్లియే యసురవృత్తిని వినాశముచేయును.

చిత్తశుద్ధిగలిగిన యోగి తనయందు మాతృశక్తి కార్యము లొనర్చు చుండుటను దిలకించును. మనవాసనలు, కోరికలు, కల్పనలు, భావనలు లేకుండినయెడల, తల్లి కార్యములు వికృతములుగాక సరిగను అత్యంతవేగముగను బ్రకాశింపుచుండును. అహంజ్ఞానము భగవదిచ్ఛను వికృత మొనర్చుచుండును. విజ్ఞానమయకోశము నుండి యిచ్ఛారూపిణియగు మాతృశక్తి మనోబుద్ధుల ద్వారమున కార్య మొనర్చునప్పుడు, ప్రతియంత్రమును తనకార్యమును మాత్రము తాను చేయుచుండును. అప్పుడు విశుద్ధయోగికి యాదేశము లభించును. అహంకారమువలన కార్యములు జేయుచుండువాడు తాను చేయుకార్యములు తల్లియాదేశమని భ్రమింపుచుండును.

కావున చిత్తమును గప్పియుండు సకల సంస్కారములనుండియు దానిని విముక్త మొనర్చుకొనవలయు

ను. చిత్తమున కావేగము గలిగినయెడల కార్యమును చేయఁజనదు. ఏలయన, ఆ యావేగము రసమును భోగించును. కార్యముల జేయును. విజ్ఞానమయకోశద్వారమున పురుషుని యిచ్ఛ మేల్కొనునప్పుడు, ఆ యిచ్ఛ సమస్తమును యంత్రములచేసి నడిపించును. కాని చిత్తముయొక్క రసోచ్ఛ్వాసమును ధ్వంస మొనర్పఁజనదు. ఏలయన అది కాళీదేవియొక్క రసలీల. ఉద్దీపనము విశుద్ధమైనయెడల నది యుద్వేలితమై, మనోబుద్ధులను విచలిత మొనర్పఁజాలదు. అగాధసముద్రమందలి తరంగమాలికలఁబోలి, కాళీదేవి యిచ్ఛయొక్క యావేగ తరంగములు చిత్తమందు బుట్టి తిరిగిదానియందు విలీనమగుచుండును. నృత్యము చేయుచుండును. అప్పుడు చిత్తోచ్ఛ్వాసము ఏయుద్దేశ సాధనకొరకును చంచలత నొందదు; తృప్తికొరకు నుద్వేలితముగాదు. కేవలము భగవదిచ్ఛవలన ప్రేమ, విశ్వాసము, భక్తి, పరదుఃఖకాతరత మొదలగువానితోడ నిండియుండును. అట్టివాని హృదయము విశుద్ధమైనదని గ్రహింప వలయును. పరోపకారవృత్తి మేల్కొనునప్పుడు దాని నొకవిధముగు ఆనందమని గ్రహించుము. కాని యావృత్తియధీనముగ కార్యములు చేయజనదు. ఆవృత్తికి వ్యతీతమగు

ప్రత్యావేశము లభించువరకును వేచియుండవలయును. ప్రథమమున నీవిషయ మసంభవముగ దోచుచుండును. యంత్రముల యపరిశుద్ధత నశించినయెడల యంత్రాతిరిక్తమగు గభీర ప్రదేశమునుండి కార్యప్రవృత్తునిగ జేయు మహాశక్తిని గాంచగలవు.



# ప్రాణము.

—:o:-

శరీరయంత్రమందు ప్రాణ ముండును. ప్రాణ ముండుటవలననే రక్తమాంస మయమగు శరీరము గను పడుచున్నది. ప్రాణశక్తి హ్రాస్వమైనయెడల బాహ్యా వయవములు జీర్ణమగును. కావున ప్రాణశుద్ధితోడ దేహశుద్ధి తనంతట తానుగ నగును. అందువలన నాత్మ సమర్పణయోగి సూక్ష్మప్రాణశక్తిని గూర్చి బాగుగం దెలిసికొనవలయును.

స్థూలదేహమునకును, సూక్ష్మదేహమునకు నుండు సంబంధము ప్రాణశక్తివలన గలుగుచున్నది. సూక్ష్మ ప్రాణముయొక్క లీల సూక్ష్మదేహము. స్థూలదేహ మందలి వివిధ స్నాయుమయ కోశములయందు ప్రాణ వాయు వుండి శరీరమును నడిపించుచుండును.

సూక్ష్మప్రాణము మనోచిత్తముల క్రిందనుండును. అనగా నాభితలమం దుండును. దీనిని హఠయోగ మందు స్వాధిష్ఠానచక్ర మందురు. సూక్ష్మశరీర మందలి చక్రములను స్థూలశరీరమందు గాంచుటకు ప్రయ త్నించువా రనేకులు గలరు. కాని సూక్ష్మశరీరమందలి గ్రంథులు సరిగ స్థూలశరీమందు గన్పడవు. కాని హఠ

యోగి వాని కనురూపమగు కేంద్రము నాధారముగ గొని సాధనను ప్రారంభించును.

చతుష్పాదయుక్తమగు ఆత్మయొక్క తురీయావస్థ (ఆనందమయసత్తా) కును, జ్ఞానాజ్ఞానములకును, వెలుపలనుండు పరబ్రహ్మముయొక్క బహిర్వికాసము పాంచభౌతిక జగత్తు. అవ్యక్తమును, అభావనీయమునగు తురీయభావమం దధిరోహించి జగద్రూప మున్నది. ఈ యనిర్వచనీయ విరాడ్భావము ఆనందమును, జ్ఞానమును, సద్రూపమునగు ఆత్మరూపమున జీవుని యంతఃకరణమును సృష్టించుచున్నది. దీనిని సూక్ష్మశరీర మందురు. అంతఃకరణమున కావరణముగ నుండునది స్థూలశరీరము. అందువలన బ్రహ్మను వీడి జగత్తుగాని, జగత్తును వదలి బ్రహ్మముగాని లేదు. స్థూలసూక్ష్మములకు సంబంధము ప్రాణసూత్రమువలన గలుగుచున్నది. ప్రాణద్వారమున భగవానుడు జగత్తును భోగించుచున్నాడు.

కల్పన, కుతర్కము, ఏకదేశదర్శికత, మొదలగునవి యపరిశుద్ధమగు బుద్ధివలన గలుగుచున్నవి. విషయదాసత్వము మనోదోషమువలన లభించుచున్నది. బహిర్జగత్తుయొక్క తాడనము వలన విశృంఖలత్వము మొదలగునవి చిత్తదోషమువలన గలుగుచున్నవి.

ఇటులనే తమఃపూర్ణమగు నైసర్గికసంస్కారప్రియత్వము, అతీతస్మృతిని, ధారణం బొనర్చుకొని సంకీర్ణవృత్తి కధీనమై యుండుట ప్రాణదోషమగు వాసన. ఈ వాసనా జాలమందు దగుల్కొనుటవలన మానవుఁ డనిత్యభోగ లాలసయం దున్మత్తుడై జగత్తునందలి శ్రేష్ఠానందమును గోల్పోవుచున్నాడు.

దుమ్ము గ్రమ్ముకొనిన యద్దమందు ప్రతిబింబము ప్రతిఫలింపదు. అటులనే ప్రాణము వాసనాయుక్తమగుటవలన, భోగమువలన గలుగు ఆనంద ముపలబ్ధి నొందనేరదు. కావున ముున్ముందు ప్రాణమునుండి వాసనను దొలగించుకొనవలయును. అనేకులు నిగ్రహానీతి నవలంబించి వాసనను బరిత్యజించుటకు బ్రయత్నింతురు. కాని యాకాశమందలి గృహనిర్మాణమును బోలి వారిప్రయత్నము లన్నియు హాస్యాస్పదములు. ఏలయన, నేడు వాసననుండి తప్పించుకొనుట కుండు పరిస్థితులు పరజన్మయం దుండనియెడల వాసనాప్రవాహమందు మానవుఁడు తల్లడిల్లవలసినదేకదా ? శ్రీకృష్ణభగవానుఁడు భగవద్గీతయం దిట్లు చెప్పియున్నాడు:

"ప్రకృతిమ్ యాంతి భూతాని నిగ్రహః కిమ్ కరిష్యతి."

ఆత్మ ప్రకృతిని పరివర్తన మొనర్చుకొనుటవలన,

వాసననుండి తప్పించుకొనవచ్చును. కావున సూక్ష్మ శరీరము నెక్కుమారుగ పరిశుద్ధ మొనర్చుకొన వల యును. సాధకుని జీవితమందు పురాతన ప్రభావము వలన కార్యములు జరుగకుండునటుల మనోబుద్ధి చిత్త ములను సిద్ధము జేసికొనవలయును. కేవలము భోగ్య విషయములకు దూరమందుండి వాసనల నతిక్రమింతు నను భావము నున్మాదప్రసూనము.

వాసన లేవిధముగ మనలను విభ్రాంతులుగ జేయు చున్నవను విషయము విచార్యము. మరణానంతరము గూడ జీవుని మూలాధారమందలి జన్మ సంస్కార ములు నిలచియుండునని యిదివరకు చెప్పియున్నాను. పూర్వజన్మార్జిత వాసనలు మేల్కొని మానవుని బరిత పింప జేయుచుండును. భోగము, కర్మప్రేరణలకు నిల యము ప్రాణము. భోగకర్మలు భగవాను నివి. కాని యివి పైనుండి ప్రాణమును జేరినంతనే ఆధార ములయందలి వాసనల పూతిగంధమువలన వికృత మగు ను. మరియు మనోచిత్తములను, వాసన ననుసరించి విషయగ్రహణమున కున్మాదునిగ నొనర్చును. బుద్ధి, వాసనామోహమందు దగుల్కొని కామ్యపదార్థముల బొందుమార్గమును నిర్ణయించును. వాసన బుద్ధినుండి

స్థూలశరీరమువరకు వ్యాపించియుండును.

వాసనకు ఆసక్తి, కామనము, రాగద్వేషము లను మూడు రూపములు గలవు. ఏదోయొక వస్తువుమీద యాసక్తి గలిగినప్పుడు, అది లభింపనియెడల మానవ జీవితము వృథాయని దోచును. ఆవస్తువును బొందుటకు మనోబుద్ధి చిత్తముల సంయోగ మొసర్చి దివారాత్రములు పనిచేయుచుందును. అభీష్టసిద్ధి యైనయెడల క్షణికమగు ఆనందమున నున్మత్తుల మగుదుము. విఫలమైనయెడల, రాగాభిమానములవలన మృతప్రాయులై కేవల మా చింతయందు మునిగియుండి దాని నెట్టుల బొందనగునని యోచింపుచుందును. ఎట్లయినను దానిని బొంది తీరవలయునని నిశ్చయించుకొనును. ప్రాణము యొక్క యాసక్తి దొలంగినను గూడ దానిని బొందవలయు నను కోరిక ప్రాణమునుండి తొలగదు; తగు సమయమున ఆకొన్నవ్యాఘ్రమును బోలి యావస్తువుమీద బడును. ఇదియే కామనము యొక్క లీల.

కామనము దూరమైనను రాగద్వేషములు నశింపవు. జన్మజన్మాంతరములనుండి బాహ్య వస్తువుల మీద యానంద ముండుటవలనే వానిమీద విరాగము గూడ నుండును. రాగద్వేషములు తిరోహితము లగు

నప్పుడు, మానవునియందు సమత్వ మేర్పడును. అప్పుడు ప్రాణశుద్ధి యైనదని గ్రహింపవలయును.

కాని ప్రాణమును వాసనావిముక్తముగ నొనర్చు టెట్లు? సాధకుఁడు కాళీశక్తిద్వారమున బుద్ధిని వాసనా ప్రభావమునుండి తప్పించును. అందువలన వాసన బుద్ధిని విచలిత మొనర్పఁ జాలదు. పిమ్మట శాంతముగ మనస్సును, చంచలరహితముగ చిత్తమును, నొనర్చుకొనును. అట్లొనర్చుకొనినయెడల వాసన కేవలము ప్రాణగతమగును. అప్పు డది యచ్చట పెరుగుచుండును; విరుగుచుండును. కాని మనోబుద్ధులను గదలింపజాలదు.

కాని యిట్టి స్థితియందు అంతఃకరణమున శాంతి విరాజిల్లు టెట్లు? ఏలయన వాసన ప్రాణమందు బంధింపబడి, యందుండి ముక్తినొందుటకు క్రమక్రమముగ మనో చిత్తములయం దఘాతము లొనర్చుచుండును. కాని యొక్కమారు విశుద్ధజ్ఞానసంయోగ మైనయెడల వాసనా ప్రభావము దొలఁగును. ఆవాసనను ప్రాణ మందు నిక్షిప్త మొనర్పగలిగినయెడల నది నశించును. వాసన, బుద్ధి చిత్తముల సహాయము లేనిది కార్యము లొనర్పఁజాలదు. అది మానవుని జీవితోద్దేశముగ నుండిన యెడల, దానిని నశింపజేసికొనుట మిక్కిలి కఠిన మగు

ను. అందువలన మంచిచెడుగుల సంబంధమగు నేవాసన కును వశము కాకూడదు. అనేకులు మంచికోరిక (వాసన) నుంచుకొని, చెడుకోరికను బరిత్యజింప వలయు నని చెప్పుచుందురు. కాని యిట్టి వాక్యముల కెప్పు డును చెవియొగ్గకూడదు. ఇట్టి సంకల్ప ముండినయెడల చెడుకోరికలను బరిత్యజించుటకు గాను మంచికోరికల నాదరింపవలసి వచ్చును. ముముక్షుత్వము, భగవానుని తోడ మిశ్రితము గావలయునను వాసనను మాత్ర ముంచుకొని, పిమ్మట మంచికోరికనుగూడ త్యజింప వల యును. తరువాత భగవానుని హస్తమందు సర్వస్వ మర్పించి సాధకుఁడు నిష్కాముఁడును, నిర్వికారుఁడును, నిస్పృహుఁడు నగును. చెడుకోరిక మంచివేషమును ధరించి ప్రాణమందు నివసింపుచు, భయంకరావస్థ యందు బడవైచును. ఆస్థితినుండి లేచుట యసంభవము- కావున పాపపుణ్యములు రెంటికి నతీతుడగుటకు బ్రయ త్నించుటయే సర్వశ్రేష్ఠమగు నుపాయము.

వాసన ప్రాణమందు బంధింపఁబడి రోదనము చేయుచుండును. కాని దాని రోదనమును వినవలదు. మరియు దానియందుపేక్షను వహించి, మనోబుద్ధులను భగవచ్చింతనయందుంచుకొనవలయును. ఇట్లు కొంత

కాలము గడచినయెడల ఆసక్తి దుర్బల మగును. ఆసక్తి బలహీనమైనయెడల కోరిక తగ్గిపోవును. అప్పు డనాయాసముగ ఆసక్తిని కోరికను దరిమివేయ వచ్చును. ఆసక్తి, కోరిక, దొలంగినను రాగద్వేషములు దొలంగవు. కాని యాయవస్థయందు కోరిక లేకుండుట వలన జీవనముమీద యేది ప్రవహింపుచుండినను, అది సుఖముతో తులదూగుచున్నను, లేక దుఃఖమయమై యున్నను, నిర్వికారచిత్తమున భగవానుని ప్రసాదమని దలంపవలయును. అనగా సుఖదుఃఖములయందు స్పృహ లేనివాడై యుండవలయును. ఈవిధముగ సమస్తఘటనల యందును భగవత్ప్రసాదము ననుభవింపుచుండినయెడల సాధకుడు సమభావమును గాంచును.

భగవానుని భోగక్షేత్రము పృథ్వి. అందు విశుద్ధ భోగముతోడ పూర్ణ శాంతి విరాజిల్లుచుండును. సంపూర్ణ సమత్వము గలిగినయెడల సాధకుం డాశాంతము నాస్వాదింపగలడు. కోరిక లేనిది భోగ మసంభవమని యనేకులు నుడువుచుందురు. ఇది మూర్ఖత్వము. కామనాజాలమందు ప్రాణము కట్టుబడినయెడల జ్ఞానవికాసము గలుగదు. జ్ఞానవికాసము లేనియెడల భోగాస్వాదనం బెట్లు సంభవించును? కోరికను వీడనంతవర

కును భోగ మారంభము గాదు. కోరికయొక్క తీవ్రా కర్షణమువలన గలుగు భోగము అకించత్కారము, క్లేశ దాయకము, సంకీర్ణము. విశుద్ధప్రాణముయొక్క భోగము శాంతము; పరమానందదాయకము. కాని యిది హర్షముగాదు, సుఖముకాదు, ఆనందము. ఈ యమృతపానమువలన సాధకుఁడు జరామరణశూన్యుఁడై భగవత్ప్రకృతిని బొందును.

కామము విశుద్ధ లిప్సగ పరిణమించునప్పుడు, సాధకుఁడు జగత్తునందలి సమస్తపదార్థములను శివుని బోలి యుద్వేగరహితుడై భోగింప సమర్థుఁడగును. సుఖదుఃఖములు, మానావమానములు మొదలగున వన్నియు, భగవత్ప్రసాదము లని యానందమున గ్రహించును.

పూర్ణయోగిని నరకమందుఁ బడవైచినను, వాని కచ్చట యచంచలమగు శాంతి యుండును. కాని భక్తునిబోలి కేవలము భగవదిచ్ఛ యని సంతృప్తిపడి యుండడు. పరమజ్ఞానిని బోలి నరకకుండమును ఆలింగనం బొనర్చుకొని "ఇది స్వర్గము. భగవానుఁడు. ఆనందమయబ్రహ్మము. శివం శుభం సుందరం" అని నుడువుచు పరమానందభరితుఁడగును.

# శరీరము.

—:o:—

డెబ్బదిరెండువేల నాడులతోడ, ప్రాణశక్తి శరీరమును పరిపాలింపుచున్నది. అన్నమయ శరీరమునకు కేంద్రస్థానము మూలాధారపద్మము. దీనికి కొంచెము పైన నాభితలమునకు క్రింద సూక్ష్మప్రాణ ముండును. స్థూలసూక్ష్మముల కిది కలయికస్థానము. ప్రాణవాయువువలన సూక్ష్మదేహము స్థూలదేహమందు నివసింపుచున్నది. సూక్ష్మదేహము ప్రాణవాయువును వినాశమొనర్చి బయలుదేరిన యెడల మానవుడు మరణించును. అప్పు డపానవాయువు మాత్ర ముండి దేహమును వికృతముగ నొనర్చును. ఒక్కవాయువు శరీరమందు పలురూపముల కార్యము లొనర్చుచుండును. ప్రాణవాయువు సూక్ష్మదేహము ననుసరించి స్థూలశరీరమును రక్షింపుచుండును. సూక్ష్మదేహము దొలగిన యెడల శరీరము విశృంఖల మగును. అనంతకోటి జీవాణువులు బుట్టి దేహము రూపాంతరిత మగును. సూక్ష్మదేహ మననేమి? అంతఃకరణము. అంతఃకరణమును పరిశుద్ధ మొనర్చుకొనుటయే యోగముయొక్క ముఖ్యకార్యము. సూక్ష్మదేహముయొక్క వికారము

స్థూలదేహము. మనస్సు స్థూలశరీరమును నిర్మింపు
చున్నది. మనోపరివర్తనముతోడ శరీరమందు మార్పు
జరిగితీరును. మనస్సు శుద్ధమును, ముక్తమునైనయెడల,
శరీరముగూడ శుద్ధము, ముక్తము అగును. మానసికా
శుద్ధతవలననే, రోగములు మృత్యువు మొదలగు భీషణ
ద్వంద్వముల ననుభవింపుచుందుము. సాధనవలన
మనస్సు, పూర్వసంస్కారవిముక్తమైనయెడల, మాయా
బంధములు తొలగిపోవును. అప్పుడు జన్మజన్మాంతర
ముల కర్మభోగము తీవ్రవేగమున శరీరముపై బడును.
సాధకుడు బుద్ధిపూర్వకముగ పూర్వజన్మార్జిత కర్మఫల
మును శరీరముతోడ భోగించును. వ్యాధి, దారిద్ర్యము
దైవికము, భౌతికము, మొదలగువానిని శరీరము భోగిం
పుచుండును. మరియు మృత్యువు సంభవించును.
ఇందుకొరకు సాధకుని మన స్సణుమాత్రమైనను విచలి
తము గాదు. మరణానంతరము నూతన శరీరమును
దాల్చును. మనో యశుద్ధత మూర్తిభవించి శరీర
ముమీద బడినప్పుడు, సాధకుడు కాయశుద్ధతను అన్న
మయకోశమునుండి పారదరుముకొన గలడు. దీనిని
కాయశుద్ధి, కాయసిద్ధి యని యందురు. ఇది హఠ
యోగ, రాజయోగముల ప్రణాళిక. కాని మనము

ఆత్మసమర్పణయోగమును గూర్చి విచారించుచున్నాము. ఆత్మసమర్పణయోగప్రణాళిక సరళము, సహజము, సిద్ధిప్రదము. మనస్సును విశుద్ధముగ నొనర్చుకొనగలిగినయెడల శరీర మారోగ్యమునను, సౌందర్యమునను పరిపూర్ణ మగును. మనస్సు, పాపవిముక్తమును, స్వాధీనము నైనచో శరీర మసాధారణశక్తిసమన్వితమగును. అంతఃకరణముయొక్క యూర్ధ్వగతితోడ శరీరోన్నతిగూడ గలుగుచుండును. ఇది స్వాభావికము, ప్రకృతి నియమము.

అంతఃకరణమును విశుద్ధమొనర్చుకొనునప్పుడు, శరీరమును నత్యంతముగ బాధింపవలదు. మనస్సు విశుద్ధము గానియెడల శరీరదోషములు దొలంగవు. శరీరయంత్రమును ప్రకృతికి సమర్పించి, యాధ్యాత్మిక యోగము నవలంబింపవలయును. శరీరముతోడ నాకే విధమగు సంబంధము లేదని యెల్లప్పుడును స్మరించుచుండవలయును. మరియు భగవచ్ఛక్తికీ శరీరము యంత్రమని భావింపవలయును. సాధకులయం దనేకులీ యవస్థయందు శరీరచింతనమున మునింగి ఆత్మతత్త్వవిస్మృతు లగుదురు. కాని యట్లొనర్చుట యుచితము గాదు. "భగవానునకు శరీర మర్పించియున్నాను.

కావున నీ విషయమున నాకెట్టి బాధ్యతయు లేదు." అను భావమున నిశ్చింతగ నుండవలయును. ఎట్టివ్యాధి వలన పీడింపబడుచున్నను, భయమొందజనదు. వ్యాధి శరీరాశుద్ధతయని యెరుంగవలయును. శరీరాశుద్ధత దొలంగినంతనే శుద్ధిగలుగును. కాని యనేక కుసంస్కార పూర్ణమగు జీర్ణశరీరమును భగవానుడు కార్యోపయోగిగ నొనర్పవలయుననిన మిక్కిలి పరివర్తన మావశ్యకము. నాడీయంత్రము, మస్తిష్కకోశము, మూత్రకోశము, మొదలగునవి పూర్తిగ మార్పు జెందవలయును. ఈపరివర్తనముకొరకు పలువిధకష్టముల ననుభవింపవలయును. రోగమువలన బాధపడువాడు మందు బుచ్చుకొనవచ్చును. కాని యా యౌషధము నిర్దోషముగ నుండవలయును. వ్యాధినుండి విముక్తి నొందుటకు శరీరమును తీవ్రబాధలకు లోనుగాసియ జనదు. "You cannot care more for yourself than God cares for you" భగవానుడు నీ మేలుకొరకు ప్రయత్నించినటుల, నీ వెప్పుడును నీ మేలుకొరకు ప్రయత్నింపజాలవు. నీ ప్రయత్నమెప్పుడును నిన్ను తప్పుదోవను నడిపించుచుండును. కావున భగవానునిమీద విశ్వాసమును గోల్పోవలదు. భగవానుడే నిన్ను శుభప్రదమగు మార్గమున నడిపిం

చును. ఇట్టి విశ్వాసము లేనివాని యోగసాధన ఆడంబరమని యెరుంగనగును.

శరీరముయొక్క గుణదోషముల నెరుంగవలయుననిన, హఠయోగమందలి శరీరతత్వమును చదువవలయును. శరీరాశుద్ధతవలన జర గలుగును. శీతోష్ణములవలన సుఖదుఃఖజ్ఞానము సంభవించును. మలమూత్రముల యావేగమున కధీను డగును. పద్మపత్రములయం దసంఖ్య యీనె లుండును. అటులనే మనశరీరమం దనేక స్థూలసూక్ష్మనాడు లున్నవి. అందు ఇడ, పింగళ, మొదలగు పదునాలుగు నాడులు ముఖ్యమైనవి. ప్రాణము, అపానము, మొదలగు దశవిధవాయువు లీనాడీసమూహమందు నిరంతరము సంచరించుచు బాహ్యాంతరయనము లను నడిపింపుచుండును. వాయు వొక్కటియే యైనను శరీరమందలి భిన్నభిన్న కార్యముల ననుసరించి వేరగుచుండును. హఠయోగమువలన వాయుకార్యము లన్నియు నొక్క ప్రాణవాయువువలన నిర్వహింపబడుచు స్వేచ్ఛ ననుసరించి శరీరయాత్రమును నడిపించుట యతి సహజ మగును. అప్పుడు శరీరశుద్ధి, సిద్ధి సంభవమగును. సాధకుడు దలంచినయెడల సమస్తవ్యాధుల

నుండియు, తనను దాను రక్షించుకొనవచ్చును. శీతో
ష్ణాది ద్వంద్వభోగము లనుభవింపవలసిన యావశ్యకత
యుండదు. మలమూత్రవిసర్జన ముండదు. కేవలము
వాయుభక్షకులై దీర్ఘకాలము జీవింపవచ్చును. ఇచ్ఛా
మాత్రమున శరీరమును పర్వతప్రమాణముగ నొనర్చు
కొనవచ్చును. తిరిగి దానిని సూదిబెజ్జమందు దూరు
నంత సూక్ష్మముగ జేసికొనవచ్చును. శరీరము లోహ
తుల్యమగును. మరియు దూదినిబోలి యాకసమునందు
సంచరింపగలుగును. వీనినే యణిమాద్యష్టసిద్ధు లందురు.
కలియుగమం దీసిద్ధుల సంపాదించుట మిక్కిలి కఠినము.
కాని యివి గలుగుట యసంభవమని దలంపజనదు.

ఆత్మసమర్పణయోగమునకును, హఠయోగమున
నకును సంబంధము లేదు. మున్ముందు అంతఃకరణమును
పరిశుద్ధ మొనర్చుకొనవలయును. పాశ్చాత్యులంబోలి
శరీరస్వచ్ఛందతమాత్రము, మానసికోన్నతికి కారణమని
మన మంగీకరింపము. శరీరము నాశ్రయించి మనస్సు
న్నదను భ్రమనుండి మనము దప్పించుకొనవలయును.
మనము విశుద్ధమగు మనస్సుతోడ దేవశరీరమును స్మరిం
చుకొనుటను వాంఛింపుచుందుము. మనస్సు శరీరమును
వడిపింపుచుండును. శరీరముయొక్క మార్పు మనస్సు

వలననే గలుగుచున్నది. మృత్యువుగూడ యోగి యిచ్ఛ మీద నాధారపడియుండును. దానిని యిచ్ఛామృత్యు వందురు. ఇందువలన సాధకుని సమస్తశక్తిసాధనలు, అంతఃకరణముమీద నాధారపడవలయును. అంతఃకరణ ముయొక్క పూర్ణవికాసముమీద బహిర్జగత్తుయొక్క యున్నతి యున్నది.

వర్తమానయుగమందు మానవుడు బుద్ధిజీవియై యున్నాడు. చిత్తము, మనస్సు, ప్రాణము, శరీర మనునవి బుద్ధ్యధీనమై యున్నవి. బుద్ధివలననే వీనికున్నతి, యవనతి గలుగుచున్నది. కావున మనము బుద్ధి ననుసరించి పూతన యోగమును ప్రచార మొనర్పవలయును. బుద్ధి యొక్క స్వభావసిద్ధమగు నిమ్నగతిని నిషిద్ధమొనర్చి కాళీ శక్తిని దెలిసికొనుటకుగాను, సమగ్రశక్తిని యేకోన్ముఖ మొనర్పవలయును. అప్పుడు కాళీశక్తి యనుగ్రహము వలన బుద్ధినావరించియుండు తీవ్రోజ్వలమగు ఆవరణము విముక్తమొనర్చుకొని యందు జ్ఞానరస్మిని విస్తరింపజేయ ప్రయత్నింపవలయును. ఆ జ్ఞానజ్యోతియందు నేనెవ్వడ ననువిషయమును నెరుగవలయును. మానవుడు తాను కాళీదేవి యంత్రమని భావించునప్పుడు, సిద్ధ్యసిద్ధు లను వానిని కాలగర్భమందు బడవైచి ముక్తపురుషులవోలి

“ నేను ముక్తుఁడను, శుద్ధుఁడను, సిద్ధుఁడను ” అని పల్కు-
చుండును.

---

# భగవల్లీల.

—:o:—

యోగసాధనవలన ముక్తి కలుగును. కాని నే నిప్పుడు ప్రచారమొనర్చు యోగసాధన, ఆత్మముక్తికి సంబంధించినది కాదు. ఈ సాధన మానవకోటియొక్క ముక్తికి సంబంధించి యున్నది. మానవుడు నిరవచ్ఛిన్నానందమును బొందుటకు సాధనచేయుచుండును. దానిని యుత్తమసాధనయని యంగీకరింపక తీరదు. కాని యా యానందము వ్యక్తిగతజీవనమునకు మాత్రమే, సంబంధించియుండరాదు. మానవజాతి కళ్యాణమునకు సంబంధించియుండవలయును. పృథ్వియందు స్వర్గరాజ్యమును స్థాపించుటయే, మన తపోసాధనయొక్క ముఖ్యోద్దేశము. మానవులెల్లరు సచ్చిదానందముల ననుభవింపుచుండుటయే, మన సంకల్పము. అందువలన మనము వ్యక్తిగత మోక్షముకొరకు బ్రియత్నించుటలేదు. ఏల యన, ఆత్మ నిత్యము. బాధనములు క్షణికములు, మాయాకల్పితములు. భగవదిచ్ఛానుసారము మన మీజగద్రంగమునందు పలువిధముల నభినయింపుచున్నాము. కాని భగవదిచ్ఛావ్యతీతముగ మనయందెవడును, నీయభినయమును వీడజాలడు. చిత్రవిచిత్రవసనముల ధరించిన

మాత్రమున మన మాత్మవిస్మృతుల మగుదుమా? మన మొకప్పుడు పుణ్యకార్యము లొనర్చుచుందుము. మరి యొకప్పుడు పాపకార్యములను జేయుచుందుము. ఒకప్పుడు సంతసమున మైమరచుచుందుము. మరియొకప్పుడు దుఃఖమువలన నాక్రమింపబడుచుందుము. వేరొకప్పుడు క్రోధోన్మత్తుల మగుచుందుము. కాని మనల భగవానుడేయంకమందు ఏభూమికగ నియమించిన, దాని నావిధముగ నభినయింపుచుందుము. భగవానుడొక్కడు. కాని యనంతయుగములనుండి యనంతవిధము లగు నాట్యలీలల బ్రకటింపుచున్నాడు. కాని యందు దుఃఖము, అభిమానము, రోత మొదలగునవి యణుమాత్రమైనను లేవు. ఏలయన అది భగవల్లీల. మనకు భగవానుడేవేషమొసంగిన, దానిని పరమానందమున ధరింపవలయును. భగవానుని యానందముకొరకు మనము సృజింపబడి యున్నాము. జ్ఞానులీరహస్యము నుపలబ్ధినొంది పరాత్పరుని చేతియందలి కీలుబొమ్మలై నృత్యమొనర్చుచున్నారు. భగవదిచ్ఛయే జ్ఞానులయిచ్ఛ యగుచుండును. భగవానుడద్వితీయుడు. కావున నాయనకు బ్రతిద్వంద్విగ నిలచువాడెవడు?

జగత్తునందు ధర్మవిప్లవము గలిగినప్పుడు, మాన

వులు పలువిధబాధలయందు దగుల్కొని యార్తనా
దము లొనర్చెదరు. భగవానుని శరణుజొచ్చెదరు.
అప్పుడు భగవాను డొకస్థలమందు కొంతమందినిగాని,
బహుసంఖ్యాకులనుగాని, నియమించును. వారు
ఝంఝామారుత తుల్యమగు మహోపద్రవమునుండి
విశ్వముయొక్క జ్ఞానమును సంరక్షింతురు. ఈ చతు
ర్యుగములనుండి భగవానునకు ప్రియమైన దేశము
ఆర్యావర్తమని దేలుచున్నది. భగవానుడు రాజసిక
తామసిక పరిభావములతోడ జగత్తును గప్పి ద్వంద్వ
ముల సృష్టించును. అహంకార మను తీవ్రహుతాశ
నుని ప్రజ్వలింపజేయును. కుక్షింభరత్వమును పెంపొం
దించును. హింస, ద్వేషము, కలహములతోగూడిన
విచిత్రాభినయమును ప్రారంభించును. అప్పుడు పృథ్వి
యజ్ఞానాంధకారమున నిమగ్నమగును. జీవులయందు
పరస్త్రీకాతరతయు స్వార్థపరత్వమును దుర్బలత్వము
మొదలగునవి విజృంభించును. ఆర్యావర్తముయొక్క
దివ్యము జ్ఞానము తేజము మొదలగునవి హ్రస్వము ల
గును. భారతీయులు యధఃపతితు లగుదురు. అందువలన
జగత్తునందలి ప్రచండలీలల కంతరాయమును గలిగింప
జాలరు. భగవానుని యంతతమలీలలను నెదుర్కొనలేరు.

తిరిగి భగవానుడు తన విశుద్ధ విష్ణుశక్తి జ్యోతిని వెలుంగ జేయును. నికృష్టవృత్తిలీల నుపసంహరించి నారాయణ రూపమున జగత్తునందు విరాజిల్లుచు, జ్ఞానప్రేమశక్తుల తోడ పృథ్విని పరిపూర్ణ మొనర్చును. ఈలీలకు ముందు భారతవర్షమందు స్థభించియుండు జ్ఞానానందప్రేమలను వికసింపజేయును. అప్పుడు భారతవర్ష మాచార్యపీఠ మధిష్ఠించి మానవకోటికి జ్ఞానదీక్ష నొసంగును. మరియు వారిని భగవానుని దివ్యలీలల కధికారులుగ నొనర్చును.

భగవదాజ్ఞవలన భారతవర్ష మింతకాలము నుండియు, నిద్రింపుచున్నది. భారతవర్షమందలి యోగులు, ఋషులు, మొదలగువారు జగత్తుయొక్క సమస్త జ్ఞానమును తమయం దిమిడ్చుకొని యాత్మానందమున మునింగియున్నారు. మరియు నిధర్మవిప్లవమందు కొంత మంది భక్తులతోడ గిరిశృంగములయందునను, నిబిడారణ్యములయందునను, పరమానందమున కాలము గడుపుచున్నారు. కాని నేడు వారు భగవదాదేశము వలన జగత్తునందు జ్ఞానమును వ్యాపింపజేయుటకు ప్రయత్నింపుచున్నారు. అందువలననే మృతప్రాయమగు భారతవర్షము నేడు మేల్కొనినది. అసహాయులును, బలహీనులును నగు భారతీయులు, క్షీణకంఠముల

తో డను, రిక్తహస్తములతో డను, జగన్మంగళముకొరకు జయజయనినాదము లొనర్పుచున్నారు. ఇంతవరకును అహంకారోద్దీప్తు లగు పలువిధజాతులవారు, భారత వాణిని, దీనులప్రలాపములని దలంచుచుండిరి. కాని కొలదివత్సరములనుండి, మానవకోటి, విస్మయనేత్ర ములతోడ భారతవర్షమువంక జూచుచు, మాతృవాణిని విన బ్రయత్నించుచున్నది. ఆర్యావర్తముయొక్క జాగరితము మిధ్యగాదు; స్వప్నముగాదు; యదార్థము. ఇది యతి తీవ్రవేగమున నడచుచున్నది.

ఆర్యావర్తము తనకు కావలసినవానిని తపోబల మువలన సృష్టించుకొనును. భారతవర్షమునకు సహా యము భగవానుడు. మనదేశమందలి యతీయసంపద జడవాదుల కర్థముగాదు. భగవదాదేశమువలన, ఆర్యా వర్తము భూమండలమునకు జ్ఞానదాన మొసంగును. పృథ్వీసింహాసనమునందు జనకుడు, ధర్మరాజు, మొదలగు రాజులమించిన రాజు లధిష్ఠించి మానవజాతిని శాసించెదరు. జగత్తునందు తిరిగి స్వర్గరాజ్యము స్థాపింప బడును. అందువలన భారతవర్షముయొక్క సాధన, ఒక్కదేశమునకు సంబంధించినది కాదు. మరియు నొక్కజాతికి మాత్రమే యేర్పడినదికాదు. మానవ

జాతి కల్యాణము కొరకు భారతవర్షమందు సాధన ప్రా
రంభింపబడినది.

౨

భగవదిచ్ఛ లేనిది జగత్తునందే కార్యమును జరు
గదు. మంచిచెడుగులయందు భగవదిచ్ఛ యిమిడియు
న్నది. ఆయిచ్ఛవలననే మానవులు క్షామకాలమునందు
కడుపుమంట నాపుకొనజాలక మానవులను భక్షించు
టకు ప్రయత్నింపుచుందురు. జలప్రవాహములు, భూ
కంపములు, భయంకరరోగములు, విప్లవములు, ఘోర
యుద్ధములు, మొదలగువానివలన మానవులు కోట్ల
కొలదిగ నశింపుచుందురు. మరియు భగవానుని యిచ్ఛ
వలన మానవులు శాంతచిత్తులగై ప్రవర్తింపుచుందురు.
భూదేవి విపులసస్యప్రదాయినియై మానవులను ధనైశ్వర్య
పూర్ణులుగ నొనర్చును. ప్రీతి, స్నేహము, దయ మొద
లగు సుగుణములతోడ మానవులు పరస్పర సానుభూ
తిని గలిగియుందురు. ఇది యంతయు భగవల్లీల కాదా ?
భగవానుడు లీలామయుడు.

భగవల్లీలకొరకనంతకోటి బ్రహ్మాండములు
సృష్టింపబడి యనిర్వచనీయసౌందర్యమున నలరారుచు
న్నవి. ఒక్కదినమున గణనాతీతములగు గ్రహములు,

ఉపగ్రహములు, నక్షత్రములు, స్వర్గమర్త్యపాతాళలోకములు మొదలగునవన్నియు నెచ్చటనో దాగుకొనును. అప్పుడు సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మమగును. ప్రకాశబ్రహ్మము, అప్రకాశమును, అరూపబ్రహ్మమునగును. అప్పుడు సమస్త బ్రహ్మాండముల పరిణామము, అవ్యక్తము. దానిని వెల్లడించుటకు భాష చాలదు. భగవల్లీల యనంతము. దాని కాదిలేదు. అది యనాదికాలము నుండి చక్రమునుబోలి తిరుగుచున్నది. లీలయొక్క గుణము, వికాసముల తారతమ్యము ననుసరించి, మానవుడు దానిని సత్య- త్రేత- ద్వాపర- కలియుగములని నాలుగు భాగములుగ విభజించి యున్నాడు. అనంత కాలమునుండి యొక్క-క్రమమున భగవల్లీల మానవమండలియందు జరుగుచున్నది. సత్యయుగము గడచిన పిమ్మట వరుసగ త్రేతాయుగమును, ద్వాపరమును, కలియుగమును వచ్చుచున్నవి. తిరిగి కలియుగము తర్వాత వరుసగ సత్య త్రేత ద్వాపరయుగములు వచ్చుచున్నవి. అందువలన సాధనకు ముఖ్యయుగము కలియుగము. ఏల యన భవిష్యత్స్వర్గరాజ్యము కొరకు, భగవానుడు మానవులను కలియుగమందు సంసిద్ధము చేయుచుండును. చతుర్యుగములలో ప్రథమమును, ప్రధానము నగు సది

సత్యయుగము. ఆయుగమందు దేవజాతి మేల్కొనును. పృథ్వియందు ధర్మము చతుష్పాదముల నడచుచుండును. వసుంధర ప్రచుర సస్యశాలినియై మానవులను బలవంతులుగను, స్వాస్థ్య యుతులుగను నొనర్చును.

బ్రాహ్మణులు వేదవిదులగుదురు. క్షత్రియులు యాగరతులై యుందురు. వైశ్యులు విష్ణుపూజా ధురంధరులై క్రయ విక్రయము లొనర్చుచుందురు. శూద్రులు ద్విజసేవారతులై ప్రవర్తిల్లుదురు. అందువలన వర్ణాశ్రమ ధర్మము లాయుగమందు పూర్ణముగ నడచుచుండును. దొంగతనములు, దోపిడ్లు, వంచన మొదలగు హీన వృత్తులు కలయందైనను గానరావు. మానవులు వ్యాధి రహితులై సులక్షణారోగ్యము గలిగి, పూర్ణపుణ్యమున మహదైశ్వర్యముతోడ, దేవజీవనము నుపభోగింపుచుందురు. భగవానుని పూర్ణానంద మీయుగముననే మానవజీవిత మందు సంపూర్ణముగ విలసిల్లును. ఆయుగమందు మానవుడు ప్రయత్నపూర్వకముగ దేనిని చేయవలసిన పని యుండదు. స్వభావశక్తి నిరంతరము మానవుని సత్య భావాపన్నునిగ నొనర్చును. కాని యిదియును, కాలము అవస్థావిశేషము ననుసరించి యుండుటవలన, ఆకాలము పూర్తియైనంతనే ఆనందలీల క్షీణించుటకు ప్రారంభించు

ను. మానవప్రయత్నము వృద్ధియైనకొలదిని ప్రకృతి
యత్యంతతీవ్రముగ నిమ్నాభిముఖమగును. అందువలన
ధర్మముయొక్క యొకపాదము లోపించును. దానిని
త్రేతాయుగమందురు. స్వభావము మారినప్పుడు మాన
వుడు సహజముగ లభించిన యధికారమును వీడుట కంగీ
కరింపడు. అహంకారోన్మత్తుడగు మానవుడు భగవ
దిచ్ఛాక్రమమును గ్రహించుట కసమర్థుడగును. అందు
వలన పడిపోవుచుండు దానిని సంరక్షించుట కధికతర
ప్రయాసను బొందుచుండును. ద్వాపరయుగమందు
మానవులు బుద్ధివృత్తుల సహాయమున పలువిధములగు
నైతిక, సామాజిక, శాసనములచేత మానవమండలి
యందు దేవయుగమును పట్టియుంచుటకు ప్రయత్నిం
తురు. కాని స్వభావశక్తి సత్యయుగవిధానమును
చాలవరకు వినాశమొనర్చును. ఫాతలమందు మాన
వులు అర్థపుణ్యమును గైకొని సుఖదుఃఖములు, పాప
పుణ్యములచేత మనసమాత్రను గనుపుచుందురు. కలి
యుగమందు సమస్తము విలుప్తమగును. అత్యల్పముగ
నుండు పుణ్యము, పాపప్రాబల్యమువలన నస్పష్టమగును.
కాని కలియుగము సంపూర్ణముగ చెడుయుగము కాదని
యిదివరకు జెప్పియున్నాను. ఏలయన భవిష్యద్యుగ

మును మహత్తరమును పూర్ణముగ నొనర్చుట కీయుగ మందే యనుష్ఠానము జరుగును.

ఇప్పటికి కలియుగమం దయిదువేల వత్సరములు గడచినవి. ఈకాలమున భారతీయుల పురాతనైశ్వర్య ము, జ్ఞానము, సభ్యత మొదలగునవన్నియు ధ్వంస మైనవి. వేదములు, ఉపనిషత్తులు, మొదలగు ప్రాచీన ధర్మ గ్రంథములయందలి కొలదివిషయములు మాత్రము నిలచియున్నవి. కాని నేడు నూతనయుగము ప్రారంభ మైనది. భారతవర్ష మూర్ధ్వగతి నొందుచున్నది. విపద సంకులమగు అంధకారము తొలంగుచున్నది. పూర్వ గగనమందరుణకాంతులు నేత్రపర్వ మొనర్చుచున్నవి. ప్రకృతిమందిరమందు విశ్వేశ్వరునకు మంగళహారతి యొసంగుటకు సన్నాహములు జరుగుచున్నవి. నూతన యుగము నుద్బోధించు ధర్మము, నీతి, విద్య, జ్ఞానము మొదలగునవి యనంతభావములతో గూడి సుస్వరమున మానవజాతియందు ప్రతిధ్వనించుచున్నవి. కాని యింత వర కెవ్వరును సత్యమును సందర్శింపలేదు. మున్ముందుగ భారతవర్ష మీసత్యమును గాంచి కృతార్థతనొందును. జగత్తునందు ప్రకటితమగు భవిష్యద్యుగమునందలి ధర్మ ము, సత్యము, ఐక్యము, మొదలగు వానియందు భగ

వాసుడవతరింప బోవుచున్నాడు. కాని వర్తమాన మాన వచరిత్రియం దొకింత మార్పుగలిగిన మాత్రమున నది సంభవముగాదు. ఆధునిక మానవజాతియందు ఆవశ్య కమగు పరిణామిక నేర్పరచుటకు వీలులేదు. కావున మానవుడు సంపూర్ణముగ నూతనరూపమును దాల్చవల యును. పురాతన సంస్కారములవలన నీకార్యము నెర వేరదు. మానవుని బహిర్జీవనమం దొకింత మార్పు గలి గినను, లేక కార్యపరంపరధారను స్వల్పముగ మార్పు జెందించినను ప్రయోజనములేదు. పునర్నిర్మాణము లోపలనుండి ప్రారంభము గావలయును. కావున మాన వుని యంతఃకరణము సంపూర్ణముగ నూతన రూపమును దాల్చవలయును. మనోప్రాణచిత్తములు పరివర్తనము నొందవలయును. ఏలయన మానవుని స్వభావమును, జగత్తునందలి సమస్తవస్తు నిచయస్వభావమును అనైక్య పూర్ణమై యున్నవి. ప్రతిదానియందుండు సమత్వ స్వరము నే డపస్వరమైనది. ఈస్వభావమును మార్పు నొందించుకొనవలయుననిన యోగము నాశ్రయింపవల యును. కాని రాజకీయ, సాంఘిక, పరివర్తనములవలన గాని, లేక యేదియో యొక ఆదర్శమునవలనగాని, దర్శన సాహిత్యములవలనగాని, పూర్తియగు మార్పు గలుగు

టకు వీలులేదు. యోగసాధనవలన భగవానుని యుప
లబ్ధి నొందవలయును. మనజీవితమును భగవద్ధ్యానము
తోడ పునర్నిర్మాణ మొనర్చుకొనవలయును. మనయం
దును, మానవమండలియందును, విశ్వాభ్యంతరమందును
పరాత్పరుని సందర్శింపజాలనియెడల నీకార్యము నెరవేర
దు. పూర్ణయోగమువలన నిది సంభవమగును. నేను
భారతవర్షము సమస్తైశ్వర్యముల నుండి వంచింపబడినను,
యోగసాధనను మాత్ర మతిగుప్తముగ హృదయమందు
దాచుకొని యున్నది. కావున పూర్ణయోగసిద్ధిని బడసి
భారతవర్షమందు నూతనయుగమును బ్రతిష్ఠింపవలయు
ను. ఏదోయొక కార్యనిర్వహణకుగాను యోగాభ్యాస
మొనర్చుటవలన బ్రయోజనము లేదు. యోగమువలన
ముక్తియు, ఆనందమును గలుగును. కాని మానవుని
యందు భగవానుని స్థాపించుకొనుటయే, యోగము
యొక్క ప్రధానోద్దేశ్యము. అట్లొనర్చిన యెడల పార్థివ
జీవనమందే దేవలీల పరిపూర్ణమగును. కావున మనమీ
మహాసంకల్పముతోడ యోగపథమం దగ్రేసరులము
గావలయును.

3

భగవానుని పాదపద్మము లాశ్రయించువాడు "భగవానుడువేరు పృథ్వివేరు" అని దలంచుచుండు నంతవరకును, పృథ్వియందలి సమస్తబంధనములను వీడక తప్పదు. భగవానుడు సత్యమును నిత్యపదార్థమనియు, జగత్తు మిథ్యయు, మాయయు నని నమ్మువార లనేకులు గలరు. వారు ధర్మసాధనకు గడంగుదురు. త్యాగమంత్ర దీక్షితులగుదురు. కాని ప్రయోజనం బేమి? జగత్సం పర్కశూన్యులగుదురు. జగదైశ్వర్యమును మాత్రపురీ షతుల్యముగ భావింతురు. మరియు వీని నెల్లను బరిత్య జించి జగదాతీతావస్థను బొంద బ్రయత్నింతురు. కాని నేనిప్పుడు చెప్పునది జగన్మిథ్యాతత్వముగాదు. జగత్తుసత్య మనియు, బ్రహ్మసత్యమనియు జెప్పుచున్నాను. మరియు నీ రెండును ఏకమును అభేదముననియు నెరుంగవలయును.

కావున మనము జగత్తును, జగత్తునందలి సమ గ్రవికాసమును, సత్యదృష్టితోడ చూడనలయును. శరీర ము మొదలు ఆత్మవరకుండు సమస్తమును, జగదీశ్వరుని యైశ్వర్యమను జ్ఞానమున, సచ్చిదానందములయం దున్న ట్టులము గావలయును. ఏలయన మనలక్ష్యము, సమాధి జ్ఞానమును, జగత్తునందు కర్మ పర మొనర్చుటయేగదా?

మనమీయుద్దేశ్యమున జీవితమందలి ప్రత్యణు వును నూతనభావమున నిర్మించుకొనవలయును. పురాతన బునాదులను మూలమట్టముదనుక పెకలించి ఆస్థానమందు తిరిగి గోడనుగట్టి సౌధమును నిర్మింపవలయును. మనము దేవజీవనమువలనను, దేవచరిత్రతోడను, భవిష్యత్కాలమందు స్వర్గరాజ్యమును స్థాపించవలయును. ఇందుకొరకు యోగసాధనకు గడంగుదుము. దేవలీల చరితార్థమగుటకు మనమిప్పు డుద్యోగపర్వమందున్నాము. ఈమహాపర్వము నాధార మొనర్చుకొని మనజీవితము నెట్లు నిర్మించుకొనిన భగవల్లీల సిద్ధించు ననువిషయమునుగూర్చి చర్చింతును.

జీవితమును నూతనభావమున నిర్మించుకొనుటకు హఠయోగ, రాజయోగములు కొంతవరకును సహకారులు. కాని వర్తమానావస్థయందవి యతంగకార్యకారులుగావు. త్రిమార్గయోగముగూడ సంపూర్ణముగ మన యుద్దేశ్యమును సఫలీకృత మొనర్పజాలదు. కావున వీనికంటె నున్నతమును సరళమునగు యోగపద్ధతి నవలంబింపవలయును. దానిని యాధ్యాత్మిక యోగమందురు. ఆధ్యాత్మిక యోగపథమున నిర్గమింప దలచినయెడల మున్ముందు దృఢవిశ్వాసమును నార్జించుకొనవలయును.

కాని కేవలము విశ్వాసము మాత్రమే చాలదు. జగత్తు నందు మనము వినుచు చూచుచుండు ఘటనలును, మానవులు, పశుపక్షులు, యక్షరాక్షసులు, ప్రేతపిశాచములు మొదలగునవన్నియు భగవానుడనియు, భగవానుని విచిత్రవికాసములనియు, బుద్ధితోడ ధృడధారణను జేయవలయును. మన కార్యములు ఆచారవ్యవహారములు స్వభావము మొదలగునవన్నియు, అజ్ఞానమున కనుగతములుగ నెంచుకొనవలయును. జగత్తునందు పరబ్రహ్మవ్యతీతమగు మరియొక పదార్థమున్నదని భ్రమ ప్రమాదముననైనను దలంపరాదు. పరాత్పరుని పదపంకజములయందు సంపూర్ణముగ నాత్మసమర్పణమును జేయవలయును. భగవానుడు, పురుషుడు- ప్రకృతిగను; అనంతము- సాంతముగను; ఏకము-బహుగను ప్రకాశింపుచున్నాడు. మరియు సనాతన సత్తాతోడ స్వర్గమర్త్య రసాతలములను సృష్టించి, యందు పర్వతము మొదలు పరమాణువువరకును నిండి నిబిడీకృతుడై యున్నాడు. మానవులయందునను, పశుపక్షికీటకాదులయందునను, త్రిజగత్తులయందునను, సమభావమున సంపూర్ణముగ విరాజిల్లుచున్నాడు.

ఆత్మార్పణము అనాహత నాదమునుబోలి యవి

చ్ఛన్నముగ నుండవలయును. జ్ఞానసూత్ర మెప్పుడును తెగకూడదు. జీవితమందలి సకలావస్థల యందును, సమస్త ఘటనలయందును, సకలకార్యముల యందును భగవానుని యస్తిత్వముగలదను ధారణ ధృఢము గావల యును. మనము నిరంతరము ఈశ్వరజ్ఞాన మందు మెలంగు చుండవలయును. నిమేష కాలమైనను స్వతంత్ర మును మనస్సునకు రానీయజనదు. "నాదియనునది యేమున్నది. సమస్తము భగవానునిది ,, యను ధృఢవిశ్వాస ముండవలయును. భగవానుని కొరకు మనము జీవింప వలయును. మన కోరికలు, అభిప్రాయ ములు, ఆదర్శములు, మంచిచెడుగులు మొదలగు వానిని ఈశ్వరజ్ఞానమున కనుగతముగ నొనర్ప వలయును. హృదయమందలి యాశలు, ఆకాంక్షలును, బుద్ధియందలి యసంపూర్ణత, అశుద్ధత మొదలగు వికారములను, పార దరుమ వలయును. జగత్తునకు నే నభిన్నుడనను విషయ మును ధారణచేయ వలయును. అనంతకోటి బ్రింహ్మాండ ములయందు సచ్చిదానంద స్వరూపుడు విరాజిల్లు చున్నాడు. సమస్తమును పరబ్రిహ్మము యొక్క వికా సము. ఆతడేవిశ్వ పటమందు, జ్ఞానశక్తి ప్రేమలతోడ ననంతలీలలను ప్రికటించుచున్నాడు. భేదజ్ఞానమునుండి

విడినడి విశ్వశిల్పిపాదపద్మములయందు సమస్తమర్పించి నిశ్చింతగ నుండినయెడల పరమానందానుభవము గలుగును. అహంకారము యోగమార్గమునకు ప్రబల విరోధి. అహంకారము నాశనమైన యెడల మనజీవన కుంజమందు భగవల్లీల వికసించును. అనగా మనజీవితమందు పూర్ణజ్ఞానము, ప్రేమయు, ఆనందమును, శాంతమును, పొంగిపొరలుచుండును. దానిని దేవజీవనమందురు. జీవితమప్పుడు భగవల్లీలకు యంత్రమగును.

ఆత్మార్పణము నొనర్చినవాని జీవితమందలి యంథ ప్రయత్నములు కట్టుపడును. అత్యంతస్వేచ్ఛతో గూడిన కర్మప్రేరణ రుద్ధమగును. డ్రైవరు స్వాధీనమందు ఇంజను నుండునటుల జీవితయంత్రమునకు భగవానుడు ప్రభువగును. మనకు మారుగ భగవానుడే సాధకుడగును. జీవితమందలి సమస్తకళంకములు దొలగించి భగవానుడే సిద్ధుడగును. భగవచ్ఛక్తి శుద్ధివిధాన మొనర్చును. మన మవలంబించు కృత్రిమయోగ క్రియ లన్నిసమయముల యందును ఫలప్రదములు గాకపోవచ్చును. కాని భగవదాదేశమునలన సర్వాంతర్యామిని యగు కాళీశక్తి మేల్కొని మనజీవితమును శుద్ధిజేసి దానిని లీలాకుంజముగ నొనర్చును. మనకాల్పనిక సాధన జీవితమందలి

చిరతమసావృతమగు కోణములయం దెచ్చట శత్రువు దాగియున్నను వాని ననుసంధానము చేయగలుగును. కాని ప్రకృతియొక్క యంతర్భేద్యమగు దృష్టినుండి మాత్రము దప్పించుకొనజాలదు. అందువలన రాజయోగము, ప్రాణాయామము, ధ్యానధారణలు, భక్తి త్యాగము మొదలగునవి, ఆధ్యాత్మిక యోగమునకు తుల్యములుగావు. అవి యసంపూర్ణములు. రాజయోగము మొదలగునవి మానవునిశక్తి ననుసరించి యుండును. అందువలన వానివలన గలుగు ఫలమున కొక హద్దుగలదు. ఆధ్యాత్మిక యోగ పరిణామము స్వతంత్రము. ఏలయన భగవదిచ్ఛానుసార మది నెరవేరుచుండును. జగత్కళ్యాణము కొరకు భగవానుడు మానవుని యున్నతి నొందింపుచుండును. ఆయున్నతి, పరిణామము, భగవదిచ్ఛపై యాధారపడియున్నది.

(౪)

ప్రభాతమందు సూర్య భగవాను డఖండ మండలాకారమున నుదయించి, క్రమముగ దశసహస్రకోటి కిరణముల విస్తరింపజేసి దేదీప్యమానముగ వెలుంగుచు, పశ్చిమాద్రి యందస్తమించుట భగవ ద్విలాసముగాదా? శిశిరసిక్తపుష్ప రాజి మలయ మారుత తాడనమువలన

నొండొంటిని గాగలించుకొనుచు, సుగంధమును వెద జల్లుచుండుట భగవద్వైభవము గాదా? మానవుని హర్ష విషాదములు క్రోధభయములు భగవల్లీలలు గావా? జగత్తు నందలి దృశ్యాదృశ్య పదార్థములన్నియు, భగవ త్క్రీడ కేర్పడిన యుపాధులు. లీలాతత్త్వ ముపలబ్ధినొంద వలయునని, ముముక్షువు సాధకుడాత్మసమర్పణ మొన ర్పవలయును. ఆత్మార్పణము ఆధ్యాత్మయోగ మునకు ప్రథమ మాత్రము.

మానవుని యతః కరణమునందు ఆశగాని, ఆకాంక్ష గాని, ధృష్టత రాదర్శము గాని యుండినయెడల, ఆత్మ సమర్పణము నిష్ఫలమగును. కావున సర్వస్వమును భగ వానుని చరణ కమలముల యందర్పింప వలయును. హృదయమందలి శక్తి నంతను యేకోన్ముఖ మొనర్చు కొని యామహావ్రతమునకు గడంగవలయును. అప్పు డు భగవానుడు సాధకుని యుపాధిని యిచ్ఛవచ్చిన కార్యముల యందుప యోగించుకొనును.

మనము జగన్నాటక రంగ మందేదియో యొక పాత్రను ధరించి నృత్యము సల్పుటకు కృతనిశ్చయులమై యుందుము. భగవాను డనుగ్రహించి యావేషమును ధరించుట కవసరమును గల్పింపవచ్చును. లేక గల్పింప

క పోవచ్చును. త్రిలింగస్వామి, నానకు, కబీరు, విజయ కృష్ణ గోస్వామి, రామకృష్ణ పరమహంస స్వామి, వివే కానందస్వామి, లీలాశుకుఁడు, భద్రాద్రి రామదాసు మొదలగు వారి లీలా మాధుర్యమునకు ముగ్ధులమై, యట్టిలీల లొనర్ప నభిలషింపు చుందుము. కానియట్టి యభిలాషగల వానిజీవితము వ్యర్థమగు ననుటకు సంది యము లేదు. మంచి చెడుగుల యందుండు కోరికయు కోరికే గదా? కావున కోరికవిడిచి నే కార్యమును చేయ జనదు. అందువలనే పూర్ణ యోగి తనసర్వస్వమును భగవచ్ఛరణముల యందర్పించి పరమశాంతిని బొందు చుండును. ఏలయన, భగవానుఁడు ధరింపుమనిన వేషము ను ధరింపవలయును గదా? బుద్ధ, చైతన్య, శంకర, రామానుజ, కబీరు మొదలగు మహాపురుషుల వేషముల యందు దేనిని ధరింపవలయు ననిన దానిని ధరించును. అదియును భగవదిచ్ఛయే కదా? అందువలన నాత్మసమ ర్పణ యోగి యందెల్లప్పుడు సమత్వమును, శాంతియు నొక్క విమలజ్యోతియు వెలుఁగుచుండును. ఆత్మసమర్పణ యోగికి సాధింపవలసిన దెద్దియులేదు. ఆతని యుపాధిని గైకొని భగవానుడే లీలయొనర్చినను, నానందింపు చుండును. భక్తవాంఛా కల్పతరువగు భగవానుఁడు

ఆత్మసమర్పణ మంత్రసిద్ధుని యెల్లప్పుడు ప్రేమాలింగ
నంబొనర్చుకొను చుండును. మరియు నాత్మ సమర్పణ
యోగి భగవల్లీలయందు సఖుడై, యనంత సృష్టియం
దనంత కాలము మహదానందమున జీవన్ముక్తుడై విహ
రించుచుండును.

మనమాత్మ సమర్పణయోగమం దగ్రేసరులమగు
నప్పుడు మనయంతఃకరణమందుండు జన్మజన్మాంతముల
యశుద్ధసంస్కారరాసులు మనల నెదుర్కొనును. ఆసం
స్కారములు పురాతనములయినందు ప్రబలానురాగము
గలిగియుండును. మరియు పార్థివవస్తు నిచయముమీద
నాసక్తి గలిగియుండును. కావున నీసంస్కారరాసులు
భస్మమై జీవితము పరిశుద్ధముగాని యెడల సచ్చిదానంద
ము ననుభవించుట కధికారము గలుగదు. రాజయోగ
ము మొదలగు యోగమార్గముల నవలంబించి దేహ
శుద్ధిని, యంతఃకరణశుద్ధిని బడయవచ్చును. కాని యాత్మ
సమర్పణయోగియొక్క సమస్త యశుద్ధతను దొలగించు
వాడు భగవానుడు. కావున మనము కాయ మనోవాక్య
ములను, లీలామయుడగు భగవానుని పాదపద్మములయం
దర్పించినయెడల, భగవచ్ఛక్తి మనయుపాధిని పరిశుద్ధి
చేయుచుండుటను మనము జూచుచుండవచ్చును.

ఇది సాధనయొక్క ద్వితీయసోపానము. ఈయవస్థయందు సాధకుడు నిరతిశయ ధైర్యమును, ఆకుంఠిత సాహసమును ధరింపవలయును. జీవితమువిూద నుండి విపదలవిూద విపదలు, క్లేశములవిూద క్లేశములు ప్రవహింపుచుండును. మరలుచుండును. ఈవిధముగ తిరిగి తిరిగి శుభాశుభ ఘటనల సుడిగుండమందు దగుల్కొని జీవితము దుర్భరమగుచుండును. కాని సాధకుడు హిమగిరినిమించి నిరుద్వేగ చిత్తమున సుస్థిరుడై యుండవలయును. సాధకునియం దపరిశుద్ధ తావేశమున్నను, ప్రకృతిశక్తి శరీరయంత్రములను పరితపింప జేయుచుండును. అపరిశుద్ధతను సంపూర్ణముగ నాశనము జేయుటయే ప్రకృతిశక్తియొక్క యుద్దేశ్యము. కావున జీవసమరణములను పణముగ నొడ్డిసాధన పథమందు నిర్గమింపవలయును. అవిచలితశ్రద్ధ లేనియెడల, జగధీశ్వరుని పాదపద్మములయందు సమస్తమర్పించి ద్వితీయసోపానమందలి భీషణసంగ్రామమందు నిలువజాలము.

సంశయముతోడ బోల్చదగిన యపరిశుద్ధత మరియొకటిలేదు. చతుర్దిక్కులనుండి, ఆకాంక్ష - ఆశాలత ఉద్దేశము మొదలగునవి జీవనమునుజుట్టి దుర్భరమొనర్చునప్పుడు, " ఇక మరణము దప్ప వేరుమార్గము లేదు"

అని దోచును. ఇట్లనేకులు భగవద్విశ్వాసమును గోల్పోయి, అహంకారమునకువశులై, యప్రియ ఘటనా సమూహమును నిరాకరించుటకు బ్రయత్నింతురు. కాని యందువలన నహంకారముయొక్క పూర్ణలీల బ్రారంభమగును. సాధకుడు యోగ చ్యుతుడగును.

అహంకారమును మూలచ్ఛేద మొనర్చుటకు, కాళీశక్తి జీవుని చతుర్దిక్కుల పరిశయాగ్నిహోత్రమును పరిజ్వలింపజేయును. అప్పుడు సాధకుడాత్మసమర్పణ మంత్రసిద్ధుడైన యెడల "మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి" అని స్మరింపుచుండును. అందువలన రక్షింపబడును. "ఆత్మసమర్పణాం బొనర్చితిని. నా జీవితమందలి సమస్త అపరిశుద్ధత భస్మమగుట కెట్టి భీషణ ఘటనలు ఘటిల్లినను గలుగనిమ్ము. గానుగయందు బడవైచి త్రిప్పినను ద్రిప్పనిమ్ము. కానిదానితోడ నాకేమి పని? ఆత్మసమర్పణాం బొనర్చిన నన్ను భగవానుడు రక్షింపదలచిన రక్షించును. భక్షింప నెంచిన భక్షించును." అను ధృడవిశ్వాసము తోడ యోగపథమున నిర్గమించువాడు, ఆధ్యాత్మయోగసిద్ధి నొందునని నిస్సందేహముగ నుడువవచ్చును.

ఈయవస్థయందు సాధకుడీవిషయమును మఱున

జనదు. "భగవానుడు సాధకుని రూపమున నాయందు కార్యములొనర్చుచున్నాడు. ఆయన మహాప్రయత్నము ముందు నా క్షుద్రప్రయత్న మకించత్కరము." ఇట్టి ధారణవలన అహంకారము దొలంగును. భగవత్కరుణ నుపలబ్ధినొంది పరమానందము ననుభవించును. మహా ప్రవాహమునందలి సుడిగుండమందు దగుల్కొని జీవిత నౌక మునుగ నున్నప్పుడు, భగవద్వాణిని నుచ్ఛకంఠ మున నిట్లు స్మరింపవలయును.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయి ష్యామి
మాశుచః.

...మములను, మార్గములను, ఉపాయములను, సంస్కారములను బరిత్యజించుకొని "భగవానుడా! నిన్నే యాశ్రయించిన నన్ను సర్వపాపములనుండి విముక్తి నొందింపుము. నా కభయ మొసంగుము. "మాశుచః" దుఃఖ మొందవలదు. భీతిల్ల జనదు. నిన్ను ముక్తుని జేయు దునని చెప్పియున్నావు. కావున నన్నీ విపత్తునుండి రక్షింపుము." అని సర్వాంతఃకరణముతోడ నెల్లప్పుడును భగవానుని ప్రార్థింపుచుండవలయును. అప్పుడు మనకు విపదలుండునా ? ఉండినను ప్రతిక్రియ నాచరించుటకు

బ్రియత్నింతుమా? మన శక్తి యెంత? మనము భగ
వద్విధానమం దత్యంత సూక్ష్మభాగమునైనను మార్చ
గలమా? ఆత్మార్పణమును జేసినప్పుడు మనకేల సంశ
యము లుండవలయును? మనకు జవాబుదారి యేము
న్నది? సర్వభూతముల కధీశ్వరుడగు పరమేశ్వరుడు,
అనంతజగత్తునకు సృష్టికర్తయై యున్నాడు. ఆతడే
మనకధిపతి; ప్రభువు. మన దేహయంత్రమున కాతడు
యంత్రి. మన కెట్టి విపదలు సంభవించినను, వ్యాధులు
గలిగినను, పాపములు చుట్టి తిరుగుచుండినను, భయపడ
జనదు, తొందరపడవలదు. "అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః" ఓక్షుద్రబుద్ధులగు అల్ప
విశ్వాసులారా! భగవద్వాణిని వినిగూడ అహంకారము
నకు వశులై కల్పిత తపస్సాధనల కేల దాసులరై
చరింపుచుండెదరు? మనోవాక్కాయకర్మల నన్నిటిని
భగవానునకర్పించి మహావీరుని బోలి ప్రవర్తింపుడు.
భగవత్కరుణవలన హిమవత్పర్వత తుల్యములగు అపరి
శుద్ధత రాసులు దొలంగి నష్టమగు, నీవు ఆనందమునకు
నిలయమగుదువు. అపవిత్రత యున్నంతకాలమును,
ద్వంద్వములు, క్లేశములు మొదలగువానివలన బాధింప
బడుచుందువు. అశుద్ధత దొలగి నంతనే యమృతసాగర

మం దోలలాడెదవు.

యోగము యొక్క ద్వితీయసోపానముమీద నిలచి విపుల విఘ్నములతోడ యుద్ధమొనర్చుటకు బ్రయత్నింపకుము. నీ వాయుద్ధమందు ద్రష్టవు మాత్రమే సుమా? కాని ఏమాత్ర చలనము గలిగినను చలింపకుము. భగవానుని నమ్మియుండుము. ఈ యోగమార్గమునందు గొప్పసరులయినవారి సహవాస మొనర్పుము.

ఆత్మసమర్పణయోగము వినుటకు సహజముగను సరళముగను నుండును. కాని సాధనపథమందు గొప్పసరుల మైన కొలదిని మిక్కిలి కఠినమైనదని దలంతుము. ఆత్మసమర్పణం బొనర్చి నంతనే జీవితము పవిత్రమైన యెడల భావింపవలసిన దేమున్నది! కాని జీవితము ఇంద్రజాలము కాదు. మనము క్రమక్రమముగ అహంకారమును వృద్ధిజేసికొని మితిలేని దుఃఖము ననుభవించుచుంటి ము. కావున నహంకారమును క్రమముగ నాశన మొనర్చుకొనవలయును. సాధనయందు దొక్కొకయఘాతము వలన మనకు మరణముదప్పదని దోచుచుండును. కాని భగవానుడు జలదగంభీరస్వరమున "భయపడకుము. భయపడకుము. నేను నిన్నహంకారము నుండి యుద్ధ

ంతును. మాశుచః" అని పల్కు భగవద్వాణిని యా
లింపు చుండవలయును.

౫

సాధకునియందాత్మసమర్పణ మంత్రము స్థిర
మైనయెడల నాతడు కర్తృత్వాభిమాన శూన్యుడై జీవిత
మం దెట్టి ఘటనలు ఘటింపుచుండినను, వానిని నిర్వికా
రచిత్తమున దిలకింపుచుండును. కాని యణుమాత్రమైన
ను వికారము నొందడు. సమస్త కార్యములకు నియం
త భగవానుడు. భగవ దిచ్ఛానుసారము కార్యములు
జరుగుచుండును. అందువలన సాధకుడు ద్రష్టయై
యున్నాడు.

కావున మన దేహయంత్రమును భగవానుని చర
ణకమలములయం దర్పింపవలయును. అప్పుడు భగవా
నుడు మన యుపాధిద్వారమున జేయు నేకార్యమునకును
విపరీతాచరణను జేయ జనదు. సమస్త కార్యములను
సంపూర్ణా మోదమున నొనర్చుచు, అవహితచిత్తమున
కార్యఫలము ననుభవింపు చుండవలయును. సమస్త
కార్యములను భగవానుడొనర్చును. భగవానుడే
క్షాళీరూపమును ధరించి యజ్ఞమును బూర్తి చేయును.
ఇదియే భగవల్లీల. మనము యజమానుని బోలి సమస్త

మును భగవానున కర్పింప వలయును. మనమర్పించిన వాని నన్నిటిని కాళీదేవి శ్రీకృష్ణుని పదసరోజములయం దర్పించును. అప్పుడు మనము జరుగుచుండు ఘటనల ను మాత్రము దిలకింపుచుండవలయును. కాని ప్రతివా దమును చేయజనదు. ప్రతిక్రియకు పూనుకొననలదు. ఏలయన సమర్పించినదానిమీాద మనకేమి హక్కుగల దు. అప్పుడు జీవనయజ్ఞము యొక్క ఫల మనుభ వింపగలము. ఆత్మసమర్పణయోగ గ్రహణానంతరము, ఆధారముల సకలవిధ కార్యకర్తృత్వాభిమానము తిరో హితమగును. నేనను జ్ఞానము తొలంగును "మనము స్థలము. కాళీదేవి కార్యము లొనర్చు చున్నది. అందువలన మనకు ఏకార్యముతోడను సంబంధము లేదు" అను స్థితిని సంపాదింపవలయుననిన, మున్ముందు మన యుపాధిసంబంధమగు జ్ఞానము నార్జించుకొనవ లయును.

శరీరము, ప్రాణము, చిత్తము, మనస్సు, బుద్ధి మొదలగు వానితోడ మనజీవితము నడచుచున్నది. ప్రథ మమున జీవుడు వీనియందుండి సాధనకు గడంగవలయు ను. ఇవియన్నియు సంపూర్ణముగ శుద్ధియైనయెడల బుద్ధికి నతీతమందుండు తురీయాస్థానమును జేరగలము.

దానిని దేవజీవన మందురు. మనస్సు మొదలగు యంత్ర ములతోడ సంబంధ మున్నంతకాలము మనమూర్ధ్వ గతిని బొందలేము. కావున ముస్ముందు మనజీవిత మం దలి సమస్తయాధారములతో మనకుండు సంబంధమును వదలుకొని, వానిని కాళీదేవి హస్తమునం దర్పింపవల యును. "నేను మనోప్రాణబుద్ధులు గాను" అను సత్య ము నుపలబ్ధి నొందవలయును. అనగా మనోప్రాణబుద్ధు లయందలి "నేను" అను నహంకారమును పారదరుముట యని యెరుంగనగును. అందువలన నాధారములయొక్క సమస్తకార్యముల యందును, భగవ దనుభవమును బొందుచుండవలయును "శరీరమునకు గలుగు వ్యాధులు ప్రాణముయొక్క యుద్దండవాసనలు, కోరికలు, చిత్త సంస్కారములు, మనోచాంచల్యము, బుద్ధియొక్క చింత నకల్పనలు మొదలగు వానితోడ మనకు సంబంధము లేదు. ఆధారములయం దపరిశుభ్రిత. శుద్ధి. వికాసము మొదలగునవి కాళీదేవియిచ్ఛవలన గలుగుచున్నవి. ఆమె యిచ్ఛవలననే యంత్రములయందు సమత్వము గలుగు ను" అను విశ్వాసముతోడ నిర్వికారచిత్తమున నుండిన మొదల బుద్ధికి యూర్ధ్వ మందుండు విజ్ఞానమయ కోశమును జేరగలము. అప్పుడు మనయం దవికృతమగు

సత్యమును, జ్ఞానమును, శక్తియు, ఆనందమును విరాజ ల్లుచుండును. యోగిజనవాంఛితమగు ఆదివ్యస్థానమందు "నేను" ఈశ్వరుడ ననుజ్ఞానము గలుగును.

సైన్యాధిపతి యుద్ధమునకు చాలదూరమందుండి బ్యాటరీ సహాయమున ఫిరంగులు కాల్చువిధమున, జీవుడు విజ్ఞానకోశమందుండి, జీవితమును నడపుట కధికారియగు ను. అప్పుడు విశుద్ధమగు ముక్తికలిగినదని భావింపవల యును. భుక్తివానికుపభోగ్యమగును. నిరవచ్ఛిన్నానంద మందోలలాడును.

సత్యయుగమన నేమి ? మానవుడు సాధారణజీవి తమునుండి తురీయస్థానమును జేరునప్పుడు, వాసనలు, కోరికలు, సంస్కారములు మొదలగువానివలన నాక్రమిం పబడడు. మనోప్రాణబుద్ధుల యవస్థాభేదముల నను సరించి తానవస్థాభేదము నొందుచున్నానను కల్పనను వదలుకొనునప్పుడు, జగత్తునందు స్వర్గరాజ్యము స్థాపిం పబడును. అప్పుడాధారములకును, ఆధేయములకుండు భేదము నుపలబ్ధినొందును. నేడు మానవజాతి, శరీర ప్రాణమనోబుద్ధులను తన సర్వస్వమని తలంచి, వాని యందు విహరింపుచున్నది. అందువలన నూర్ధ్వలోక మును, ఊర్ధ్వజీవనమువలన గలుగు నిరవచ్ఛిన్నానంద

మును మఱచియున్నది. కావున మనయందలి సమస్త శక్తులను మేల్కొలుపవలయును. అహంకారమును నూర్ధ్వముఖమునకు ద్రిప్పవలయును. మనము దివ్య జగత్తున కధికారులమను విషయమును దెలిసికొన వలయును. ఈసత్యమును జేరుటకుగాను మనము తప స్సును జేయవలయును. ఒక్కమారీస్వర్గధామమును జేర గలిగినయెడల, మనముముక్తులమును సిద్ధులమునై, యానందలీలలతోడ మర్త్యధామమును వైకుంఠముగ బరిణమింపజేయుటకు సమర్థుల మగుదుము.

ఇదివరకు జీవు డూర్ధ్వలోకవిషయములను గ్రహిం చి, యిహలోక సంపర్కమును వీడి మహానిర్వాణము కొరకు దివ్యధామమునకు పరుగిడుచుండెను. కాని నేడు మనముస్వర్గముయొక్క మహదమృతమున కధికారులమై యిహజగత్తును వీడకుండవలయును. భగీరథుడు స్వర్గము నుండి యమృతధారను శిరమున ధరించుకొనివచ్చి వసుం ధరను పవిత్రమొనర్చినట్లు, మనముస్వర్గమునుండి యమృ తధారను గైకొని వచ్చి, యిహజగత్తునందు విహరిం తము. మానవులకు సత్యయుగఆనందమును గలిగింతము. ఈలీలయే దేవలీల.

"మయ్యేవమన ఆధత్స్వమయి బుద్ధింనివేశయ,
నివసిష్యసి మయ్యేవ అతఊర్ధ్వం నసంశయః"

మనోబుద్ధులను నాయందు సమాహితమొనర్చి, వానిని "అత ఊర్ధ్వం" మనోబుద్ధులకతీతమందుండు తురీయ స్థానమున, అనగా నాయందు నిల్పుము. జీవుడు మాయనుండి తప్పించుకొని ముక్తుడగునప్పుడు తన్ను దాను బ్రహ్మకభిన్నునిగ దలంచును. "సర్వం బ్రహ్మైవ" ఓ సాధకులారా బ్రహ్మజ్ఞాన ప్రకాశమున మర్త్యధామమందు సంచరింపుచు, దివ్యయుగము వచ్చునటుల చేయుభారము మీమీద నున్నది.

౬

యోగముయొక్క తృతీయసోపానమును జేరగలిగినయెడల సర్వభూతములయందును భగవానుని సందర్శింపవచ్చును. ప్రథమమున సర్వకాలములు- సర్వస్థానముల యందు వ్యాప్తమై యొక్క బ్రహ్మపదార్థమున్నదని దోచుచుండును. మరియు, అవ్యక్త అవ్యయ అచల బ్రహ్మము జీవజగత్తునం దున్నాడను విషయము సుస్పష్టమగు. ఇట్టి యనుభవమువలన సాధకుడు క్రమముగ జగత్తునందలి సర్వమును మాయయని దలంచును. క్షణవిధ్వంసినియగు నీమాయాసృష్టి నిత్య

సత్యమగు ఆత్మను నాచ్ఛాదించుకొని యున్నదనియు, పాంచభౌతికమగు సృష్టిచాతుర్యము ఇంద్రజాలమనియు, వీనికతీతమందుండునది సత్యమనియు దోచుచుండును. కానిజ్ఞానమభివృద్ధి నైనకొలదిని "పరబ్రహ్మ మాయని ర్వచనీయ మాయారాజ్యమును ధరించి పోషింపుచుండు టయేగాక తనశక్తివలన సమస్తపదార్థములను పరిపూర్ణ మొనర్చుచుండును. అనగా పరబ్రహ్మమునామరూప ముల ధరించి తనకూటస్థ భావమును వ్యక్తమొనర్చి బ్రహ్మాండ మయుడగుచున్నాడు." అనువిషయము సాధకు నకు గోచరింపు చుండును. వేదఋషులీ యమృత మందోలలాడి జగత్తునందు గభీరజ్ఞానమును ప్రచారమొ నర్చియున్నారు. దీనినే యోగీశ్వరుడగు, శ్రీకృష్ణభగవా నుడు భగవద్గీతారూపమున నుపదేశించి యుండెను. తదనుసారముగ భారతీయులు జీవితమును నిర్మింపదలచు కొనినయెడల, కేవల ముపలబ్ధినొందుటతోడ తృప్తినొం దజనదు. ప్రత్యక్షానుభవమును బొందవలయును. అన గా మననుసర్వ వస్తువులయందును, సర్వవస్తువులను మనయందునను నిరంతరము గాంచుచుండవలయును.

• "సర్వభూతస్థమాత్మానంసర్వభూతానిచాత్మని,
ఈక్షతేయోగయుక్తాత్మాసర్వత్రసమదర్శనః."

"యోగసమాహితచిత్తమున సర్వత్రసమదర్శియై ఆత్మను సర్వభూతములయందుగాంచి సర్వభూతముల నాత్మయందు సందర్శించును." సాధకు డప్పుడు బ్రహ్మ మేజగత్తనియు, సర్వవస్తువులు బహ్మమనియు, తెలిసికొనును, "సర్వం ఖల్విదంబ్రహ్మ."

కొందరేదియో యొక యపౌరుషేయ సత్తా మీద, ననిత్యమగు జగత్తును పరిత్యజించి, ఇహజీవిత మందు విముఖులై, యవ్యక్తగుణాతీతపరబ్రహ్మను సంధానమందుందురు. మరికొందరు బౌద్ధమతశూన్య వాదులనుబోలి జగత్కారణమునకు పశ్చాద్భాగమందుండు నిఖిలగుణశూన్యమగు మహాశూన్యమును భేదించుటకు మహానిర్వాణ మార్గమున నడచు చుందురు. పరమపురుషునకును సృష్టికిని మధ్యనుండు తమసాచ్ఛన్నమగు దీర్ఘపథమే పరబ్రహ్మమును సంసారమాయ నుండి దప్పింపుచున్నది.

"పురుషోవరేణ్యః ఆదిత్యవర్ణస్తమసః పరస్తాత్"

"జగత్ప్రకాశము భగవదిచ్ఛవలన గలుగుచున్నది. కావున భాగవత సత్తాకును దీనికిని దృఢసంబంధము గలదు. భగవానుడు జగల్లీల నొనర్చుచున్నాడు. ఆత డొక్కమారుగ సృష్టికాధేయమును, ఆధారమునై

యున్నాడు. భగవానుడవ్యక్తమగు సృష్టిచాతుర్యము
వలన, క్రమవికసితానందముల నుద్భూతమొనర్చి వానిని
విరాజిల్లజేయుచుండును. స్వసత్తాతోడ సాగరములు,
భూధరములు, విపినారణ్యములు, అసంఖ్య నదీనదముల
తోడ గూడిన యనంతకోటి ప్రాణిసమూహములను, భూమం
డలమును, మానవబుద్ధి కతీతమగు గ్రహ ఉపగ్రహ
సూర్యచంద్రసమన్వితమగు అనంతకోటి బ్రహ్మాండము
లను సృష్టించుచున్నాడు. మరియు ననంతకోటి సృష్టి
వస్తువులయందుండి విపులపులకలతోడ విచిత్రలీలల
ప్రకటించుచున్నాడు. లీలామయుడగు శ్రీకృష్ణుడు, అనా
దియైనను, అవ్యక్తమగు ఈశ్వరుడు. అనంతుడయినను
సాంతుడు. శివమయుడయినను, నారాయణుడు. శ్రీకృ
ష్ణుడు ఆనందపులకలతోడ ననంతకోటిరూపముల సృష్టిం
చెను. స్థూలమందనేక భేదములు గన్పట్టుచుండినను,
ఆసమస్తమును భగవానుని సత్తావలనను, ప్రేమధారల
వలనను, సజీవితమును, పులకితమునగుచుండును. ఒక్క
యాకర్షణయు, ప్రభుత్వమును, సమస్తమందు సమభావ
మున ధారావాహికముగ విలసిల్లుచున్నది. ఈయనాది
లీలయందు భగవానుని ఆనందము, సృష్టిచాతుర్యము,
సౌందర్యము పలుభావముల, నానారూపముల వ్యక్త

మగుచున్నది." అనుజ్ఞానమును ఆత్మసమర్పణయోగి యుపలబ్ధి నొందును.

ఈజగత్తు సచ్చిదానంద పరబ్రహ్మముయొక్క నాట్యమందిరము. ఇందు జడపదార్థ మనునది లేదు. జ్ఞానచక్షువులతోడ జూడ గలిగినయెడల సమస్తమును గుణమయమగును. సత్త్వరజస్తమోగుణవిభేదములతోడ ప్రతిపదార్థమును చైతన్యమయమై విలసిల్లుచున్నది. గుణసంఘాతమువలన పరస్పరసన్నిబద్ధమును, మిళితమ గుటచేత, నదికాఠిన్యమయమూర్తి నిదాల్చును. సాధ కుని నేత్రములకు సమస్తము శ్రీకృష్ణమయము. జగత్తు నం దనంతగుణబ్రహ్మముయొక్క క్రీడ యనాదికాలము నుండి జరుగుచున్నది.

మనజీవితమం దిట్టి యనుభూతి సుస్పష్టమగు నప్పుడు, సనాతనజ్ఞానము ప్రతిరోమకూపమందునను ప్రకటితమగుచుండును. సంశయమువలన మనమాత్మ హారులముగాము. అందువలన క్రోధము, భయము, దుఃఖము, వ్యాధులు, మొదలగువానినుండివిముక్తులమగు దుము. మనయాధారమునుండి యజ్ఞానజనితమగు అని త్యక్రీడ క్రమముగ దొలంగును. అప్పుడు పనిషత్తుల యందు చెప్పబడిన చరమసత్యము, "ఆనందం బ్రహ్మ

ణో విద్వాన్ నభిభేతి కుతశ్చన" వలన పరిపూర్ణుల మగుదుము. బ్రహ్మానందమునం దోలలాడుచు, జగత్తు నందలి యేవస్తువును భయవిహ్వాల నేత్రముల దిలకింపము.

"యస్మిన్ సర్వాణిభూతాని ఆత్మై వాభూద్విజానతః
తత్రకో మోహఃకః శోక ఏకత్వమనుపశ్యతం"

సర్వభూతములు ఆత్మతోడ యేకమును, అభిన్నమగునప్పుడు, ఏకత్వదర్శియగు జ్ఞానికి శోకమోహము లెట్లుండును ? అప్పుడు సమస్తజగన్మూర్తియు సాధకుని సమీపమందు భిన్నరూపమును దాల్చును. కుత్సితమను నది యుండదు. అప్పుడు పృథ్వియొక్క రూపసాగరము లోని యానందతరంగములు మంగళప్రదమగు మధుర నృత్యమొనర్చుచుండును. ఆనందజ యోల్లాసమువలన పరమశాంతియు, అశీమశక్తి సమన్వితమునై జగత్తు పవిత్రమును, బృందావనమునుబోలి, శ్రీకృష్ణునకు లీలానికేతనమగును. మనమప్పుడు చతుర్దిక్కుల యందు శివమును, శుభమును, మంగళమునగు ఆనందలీలను నిరీక్షింపు చుందుము. మరియు సకలప ద్వార్థములతోడ నేకాత్ములమై సర్వభూతములను ఆత్మ యందునను, ఆత్మను సర్వభూతములయందునను సంద

ర్శింపుచుందుము. ఇట్టియే కత్వానుభూతివలన భగవా నునితోడ సంయుక్తత నుస్పష్టమగును; ప్రత్యక్షమగును. ఇదియే బ్రహ్మస్థితి. బ్రహ్మస్థితియందు సచ్చిదానందము లకు మనము కేంద్రమై భగవానునియొక్క విశుద్ధజ్ఞాన శక్తిని, ఆనందామృతధారను, సమస్తజగత్తునందు బ్రస హించ జేయుటకు సమర్థులమగుదుము.

౭

బ్రహ్మపదార్థము అఖండము, అనంతము, భేద విరహితము. పృథ్వియందలి సమస్త వస్తువులయందునను, బ్రహ్మము పరిపూర్ణముగ నిండియున్నాడు. అనంతకోటి బ్రహ్మాండములయందు పరబ్రహ్మము సంపూర్ణముగ నున్నాడు. ఆతడు జగద్వ్యాప్తుడయినను, ఆతని పూర్ణ త్వమునకు హాని గలుగదు. ఏలయన ఆతడు నిత్యపరి పూర్ణుడు. పూర్ణత్వమే యాయన స్వభావము.

ఓం పూర్ణమిదః పూర్ణమదః పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావ శిష్యతే॥

కేవలము చైతన్యసత్తాయందు మాత్రము నారా యణుని, శివుని, శక్తిని ఉపలబ్ధనొందుటయే కాక, విశ్వ మందలి సమస్త అచేతనవస్తు సముదాయమందును, భగవానుని దర్శింప వలయును. జడచక్షువులతోడ జగ

త్తునందెచ్చట జూచినను బ్రహ్మపదార్థము గనుపడదు. గృద్ధివానినిబోలి వేలకొలది వత్సరములు "భగవానుడా" యనియరచుచు పృథ్వీ యంతటను దిరిగినను, భగవద్దర్శనము కాదు. స్వర్గజ్యోతివలన మన నేత్రాంధకారము దొలంగవలయును. అప్పుడు మనము ధన్యులమగుదుము. భువనమోహన సచ్చిదానంద స్వరూపమును గాంచి భక్తి గద్గదకంఠమున స్తవ మొనర్తుము.

దివ్యచక్షువులు వికసింపని సాధన నిష్ప్రయోజనము. జ్ఞానచక్షువులు లభించిన యెడల, అచేతన మనునది మనకు కనుపడదు. సమస్తమును సచ్చిదానందమగును. అన్నిటియందునను ప్రాణము- మనస్సు- విజ్ఞానముండును. సమస్తమందును లీలామయుడగు శ్రీహరి విరాజిల్లుచుండును. అప్పుడు భగవద్గుణానందము ననుభవింపుచుందుము. పృథ్వియందలి సకలవస్తువులు వ్యక్తములు, అవ్యక్తముల (అనగా ప్రకాశోన్ముఖములు) ని యిరువెరంగులు. దివ్యచక్షువులు గలిగినయెడల పరమపురుషుని వికాస మణగియున్న వానియందుగూడ, భగవానుని నిత్యలీలలను గాంచి చరితార్థుల మగుదుము. పత్రిపుష్పములు; పాషాణమృత్తికలు; వృక్షలతలు మొదలగుసమస్త సృష్టియందును భగవదానందము

గలదు. ఆనందముయొక్క యభివ్యక్తిస్వరూపమే, యీసృష్టిచాతుర్యము. ప్రతిదానియందును శ్రీభగవానుడు చిద్రూపమున నధిష్టించి విభిన్నరసముల నాస్వాదింపుచున్నాడు. భగవానుని యపారప్రకాశమునుగాంచి, ఆతడు ఖండమై యనంతసృష్టిని జేయుచున్నాడని తలంపజనదు. భగవానుడు దేశకాలకారణములకు వశుడుగాడు. భేదవిరహితుడై యొక్కమారుగ ననంతసృష్టియందు లీలారతుడై విరాజిల్లుచున్నాడు. ఒకదారమునకు వరుసగ కొంతవర కొకరంగును, మరికొంతమేర దనుక మరియొకరంగును, దానితర్వాత యింకొకరంగును వ్రాసినయెడల ప్రతిరంగునకును హద్దుగన్పడుచుండును. కాని యాహద్దువలన సూత్రముయొక్క చివర నిర్ణయముగాదు. ఈవిధముగ బ్రహ్మముయొక్క వివిధసృష్టిని గాంచి బ్రహ్మమును ఖండమని తలంపరాదు. ఆతడు ప్రతి యాధారమందునను ననుప్రవిష్టుడై యున్నాడు. అనగా జడభావమున నున్నాడని తలంపజనదు. సర్వత్ర సర్వభూతములయందు, భగవానుని చిద్రూపమువిరాజిల్లుచున్నది. భగవానుడు సచ్చిదానందమయుడు. విజ్ఞానము, మనస్సు, ప్రాణము, శరీరమనువానిని భగవానుడు సృష్టించియున్నాడు. ‹‹ఈశావాస్య మిదం సర్వం

యత్కించ్చ జగత్యాం జగత్" సమస్తపృథ్వియు, ప్రకృతియంతర్గతమగు ప్రత్యేకపదార్థమును, భగవానుడుంచుటకు నిర్మింపబడియున్నది.

చేతనాచేతనములయందు శ్రీహరిని దర్శించిన మాత్రమున పూర్తి కాదు. జగత్తునందలి సమస్తఘటనలు భగవానుడని యెరుంగవలయును. మానవుని తరళ మస్తిష్కమందు విరామములేక నడచు చింతాప్రవాము భగవానుడు. మనోచిత్తములయను భూతియు, ప్రాణము యొక్క ప్రబలవాసనయు, జగత్తునందలి పలువిధకార్యములు మొదలగునన్నియు భగవానుడు. అతడు గానిదేదియు లేదు. భాష, భావము, ప్రేమ, రోత, పుణ్యము, పాపము మొదలగునవన్నియు భగవానుడు. మానవుడింతవరకు తెలిసికొన్నది, తెలిసికొనజాలకున్నది గూడ భగవానుడు.

"సర్వం హ్యేతద్ బ్రహ్మ" అనుభావమున సంచరించు సాధకుడు చేయవలసిన కార్యములగూర్చి చెప్పుమన్నాను. ప్రథమమున జీవితమందలి సమస్తకార్యములఫలమును శ్రీభగవానునకు సమర్పింప బ్రయత్నింపవలయును. రెండవది కర్మనుగూడ భగవానుని పదకమలములయం దర్పింపవలయును. ఏలయన కర్మనుచేయు

వాఁడు భగవానుఁడు. దానిఫలము ననుభవించువాఁడు భగవానుఁడు. కావున సాధకుఁడు భగవానునకు యంత్రము. యంత్రమునకు కర్మస్పృహ యుండునా? యంత్రమువలన సంసిద్ధమయినదాని ఫలమును యంత్రమనుభవించునా? కర్మను చేయుచున్న భగవానుఁడే కర్మఫలము ననుభవింపుచున్నాఁడు. కావున మనకు కర్తృత్వాభిమాన మేందుకు? కర్మఫలమును భగవచ్చరణములయం దుత్సర్గ మొనర్చుట వలన, ఫల విముఖులము గావలయునను మాఁట లేదు. ఏదో యొక లక్ష్యమున కభిముఖుఁడవై నిర్గమింపఁగూడదని తలంప రాదు. ఇట్టి భావముదయించిన యెడల మనకు కర్తృత్వాభిమానము దొలంగ లేదని యెరుంగ వలయును. మరియు భగవానునకు సంపూర్ణముగ నాత్మార్పణము చేయ లేదని గ్రహింప వలయును. ఏలయన భగవచ్చరణములయందు సర్వస్వమర్పించి వైరాగ్యము నవలంబింపవలయునని తోఁచుటకు కారణమేమి? సర్వస్వమర్పించిన పిమ్మట చేయుట చేయకుండుట యనునది భగవదిచ్ఛయై యున్నది. మన యిచ్ఛ, అభిప్రాయము, ధారణ, మొదలగునవి యెట్లుండవలయునను విషయము మనకనావశ్యము. కర్తవ్యా కర్తవ్యములు, మంచిచెడుగుల విచారణభార

మును భగవత్పదముల యందర్పించుము. ఆతడేది యొసఁ
గ్గిన యదియే యావశ్యకమగును. కాని యది యనావ
శ్యకమని తోఁచినను, దానిని యావశ్యకమని దృఢచిత్త
మున దలంపుచుండ వలయును. మనధారణ యందది
యన్యాయమైనను భగవానుడు గలిగించుటవలన కర్త
వ్యమని నమ్ముము. ఈవిధముగ కర్తవ్యకార్యములను
జేయుచుండవలయును. కాని ఫలముతోఁడమనకణుమాత్ర
మైనను సంబంధములేదు. మరియు నావిషయమందు
లక్ష్యముంచుట వలన ప్రయోజనము లేదు. మనము
కోరుదానిని, ఇచ్ఛయించు దానిని దూరమొనర్చు కొన
వలయును. భగవానుడు కోరుదానిని, భగవదిచ్ఛను
గ్రహించుటకు ప్రయత్నింప వలయును. మనము బుద్ధిని
విశ్వసింపరాదు. వాసనా సముదాయమునకు జలాంజలిని
యొడవలయును. అర్జుననిబోలి సమస్తవిధ యతీతసంస్కా
రముల యాకర్షణను పదతాడనంబొనర్చుకొని, శ్రీకృష్ణుని
యాదేశానుసారము కర్తవ్యకర్మయం దగ్రేసరులము
గావలయును. భగవదిచ్ఛలేని కార్యమేదియు జగత్తు
నందు జరుగదని నమ్ముము. సంశాంతఃకరణమున సకల
కర్మలను, కర్మఫలమును, భగవానునకర్పించి నిర్ద్వందుడ
వగుము. అప్పుడు జీవితమందు కర్తవ్య కార్యములు నిర

వేరుచుండుటను గాంచగలవు. అహంకార మున్నంత వరకును, జీవితమందలి యనేక కార్యము లప్రియములుగ దోచుచుండును. నిరానందమును గలిగింపుచుండును. కాని కర్మను, కర్మఫలమును బరిత్యజించినప్పు డానంద నిరానందములతోడ బనియేమున్నది? భగవానుడు మన జీవితమం దేవిధముగ క్రీడింపదలచిన నట్లు క్రీడించును. ఈభావము స్థిరమైనప్పుడు సాధనప్రారంభ మైనదని యెంచవలయును. మన మొనర్చు కార్యముల శుభాశుభ ములగూర్చి విచారించుటవలన లాభ మేమి? మహాజ్ఞాన యుక్తమగు శక్తి సమస్తపృథ్విని నడిపింపుచున్నది. కావున నాశక్తి మనతోడ పరామర్శనొనర్చి మనజీవిత మందు క్రీడింపవలసిన యావశ్యకత లేదు. భగవానుడే మన కార్యములకు ద్రష్ట. కావున మనము ముక్తులము; సిద్ధులము; సదానందులము.

మన మనేక సమయములయందు కర్తవ్య కార్యా లోచనయందు మునింగి, ద్వంద్వములయందు దగుల్కొం దుము. ఆత్మార్పణము సుసిద్ధమైనయెడల, సాధనకు వేరుయోచన యుండదు. కానిసాధనకు పూర్వమనేక జిజ్ఞాస విషయము లుండును. ఇంగ్లీషునందు కర్తవ్య కార్యములను (duty) డ్యూటీ యని యందురు. డ్యూటీ

యననేమి? వివేకబుద్ధికి సంబంధించిన నీతికిని, న్యాయమునకును తోడగు దానిని చేయుటను కర్తవ్యమందురు. సంఘమునకును, జాతికిని, దేశాభివృద్ధికిని సంబంధించిన, కార్యముల నొనర్చుచుండుటను కర్తవ్యమందురు. ఇట్టి యాదర్శాను సారముగ నడచుచుండువారి జీవిత మున్నతిని బొందును. వారు జగత్తునందు సన్మార్గులు, దేశాభిమానులను కీర్తిని నార్జించు కొందురు. కాని యనేకులు వ్యక్తిగత జీవనోన్నతి నాసించుటవలనను, స్వజాత్యభివృద్ధిని గోరుచుండుట వలనను విశిష్ట ధర్మానుశాసనమందు చిక్కుకొని నిర్జీవప్రతిమ లగుచుందురు. జీవనమందలి యశుద్ధ సంస్కారముల యహంకారముయొక్కయు, వాసనయొక్కయు, బీజములు హృదయమందు గుప్తముగ నుండునప్పుడు, ఉన్నత కార్యములయందు సంబంధము గలిగించు కొనుట వలన ప్రయోజనం బేమి? మానవులవలన నుత్తమపురుషుడనని యనిపించుకొన వచ్చును. కాని యందువలన యోగోద్దేశ్యము నెరవేరదు; పరిపూర్ణ జీవనము లభింపదు; తపోసిద్ధి గలుగదు. ఏల యన అప్పుడు కోరిక యొకవిధమగు ఫలాకాంక్షను వీడి మరియొకవిధమగు ఫలాకాంక్షతోడ తల్లడిల్లును. మానవుడీ మధుర ఫలాశతోడ యత్యంత ప్రయా

సకు లోనగును. పూర్వముకంటెను నత్యధిక యుత్తే
జమున నున్మత్తుడగును. ఆశాభంగ మయినప్పుడు
హృదయవేదనను బొందుచు తీవ్రవిషాదమువలన నవస
న్నుడై యకర్మణ్యుడగును. "నేను సత్యమని నమ్మి
దానిని చేసితీరుదును" అను నమ్మకమున చేయుకార్య
ములును, వాని యుత్తేజమును భయంకరముగ నుం
డును. వీరిక్రోధమద్భుతము. అహంకారము దృఢమై
యణుమాత్రమైనను చలింపదు. వీరికి భగవద్విధానము
ప్రత్యక్షమైనను కన్నెత్తిచూడరు. ఇట్టివారికి కార్యవిఫల
విచారము గలుగనియెడల దుర్జయ కర్తృత్వాభిమాన
ము వీరిని రాజసిక కర్మయందు నియుక్తమొనర్చి వృథా
క్లేశములు, ద్వంద్వభోగముల ననుభవించునట్లు చేయు
చుండును. అందువలన వారెప్పుడును త్రిగుణాతీతులై
విశ్వేశ్వరుని యపారానందము ననుభవింప జాలరు.
మరియు త్రిగుణములకు దాసానదాసులై ప్రవర్తింపు
చుందురు.

౮

కురుక్షేత్ర సంగ్రామమందర్జునుని పార్శ్వమందు
శ్రీకృష్ణభగవానుడుండెను. కాని యర్జునుడు వ్యక్తిగత
ధర్మమునకును, సమాజిక విధానమునకును వశవర్తియై,

ధర్మయుద్ధ మొనర్చుటకు విరక్తిని గనుపరచెను. అప్పుడు శ్రీకృష్ణభగవానుడు ముముక్షులకొరకు శాస్త్రమును, ముక్తపురుషులకొరకు త్యాగమును లక్ష్యముగజూపించెను. భగవచ్చరణములయందు కర్మఫల సమర్పణము పూర్ణత్యాగముకాదు. కర్త్రార్పణమే సంపూర్ణత్యాగము.

బద్ధావస్థయందు స్త్రీపురుషులు ముక్తినిగోరుచు భగవత్కరుణ కెదురుచూచుచుందురు. వారికొరకు భగవానుడు శాస్త్రములయందు నిర్దేసించిన లక్ష్యమిది. వ్యక్తిగత జీవితమందలి ఆశ, ఆకాంక్షలును, బుద్ధివివేచనలును, యుక్తితర్కములును, ఆహ్లాదవిషాదములు మొదలగు పలువిధ యహంకారములకు వెలుపలనుండు, దివ్యవిధానమున కనువర్తులై, జీవననౌకను నడిపించుకొనుచుండవలయును. అట్టివాడు "సంయమి, స్థితధి" యగుటయేకాక, సాత్వికాహంకారమును నిరసన మొనర్చుకొని ముక్తులగుటకు కోరుమానవులను సంసిద్ధ మొనర్చుచుండును. మానవుని యహంకారమునకును, సర్వవిధ సంకీర్ణస్వార్థపరత్వములకు వెలుపలనుండు నీశాస్త్రీయవిధానము, మానవుని జీవితమును, పరిపూర్ణ మొనర్పజాలదు.

ఈశాస్త్రము ప్రాచీన యుగమందు ధర్మముగ

నుండెను. మానవుని యాధ్యాత్మిక జ్ఞానము మీదనే యది ప్రతిష్ఠింప బడినది. దీనికి బునాది జగత్సంబంధమగు దివ్యనియమములు. ఈశాస్త్రానుసారము జీవనమును గడు పుమానవుడు, ఆత్మ తత్వము నుపలబ్ధినొందుచుండెను. స్వీయస్వభావానుసారముగ తననుదాను నిర్మించు కొను చుండెను. కాలము గడచినకొలదిని నీయుత్తమ వైదికధర్మ ము స్మృతివిధానముగ బరిణమించెను. వేదోక్త చాతుర్వ ర్ణ్యానుసారముగ మానవజాతిని విభక్తమొనర్చి, స్మృతి వేదములయందుజెప్పు గమ్యస్థానమును నిర్దేశింప జొచ్చె ను. కాని స్మృతి విధానము, వైదికధర్మమువంటి సూక్ష్మవిధానముకాదు. అయినను స్మృతి స్థూలముగ మనుష్యజాతికి ముక్తిమార్గమును జూపింపుచుండెను. కలియుగము వచ్చినది. నేడు సర్వోత్తమమగు శాస్త్రనీతి, మానవుని స్వాభావికయాచార విచారములకును, సమా జికవ్యవహారములకును, కొంత యున్నతస్థాన మందున్నది. ఇప్పుడు కాలకర్మవశమున శాస్త్రమున కర్థముమారినది. దీనిని యార్యఋషి ప్రచారితమగు వైదికధర్మమని చెప్పుటకు వీలులేదు. ఏమియు లేకుండుటకంటె యీయు న్నదానివలన నొకింత మేలుగలదనుట నిక్కువము. మానవుడు వాసనా పరవశుడై స్వేచ్ఛాచారియగుట

కంటె, లోకాచారము ననుసరించి నడచుట కొంతవరకు శ్రేయస్కరముగదా ? ఇందువలన మానవుని దురహంకారము కొంతవరకు పరిమితమగును. కానియిట్టి విధానమునకు శక్తిలేనప్పుడును, ముక్తిపథమును నిర్దేశింప జాలనప్పుడును, నిదిమానవునకొక బంధనవిశేషము మాత్రమగును. అయినను వర్తమానమందజ్ఞులకు శాస్త్ర విధింతోడ బ్రయోజనము గలదు. ధార్మికులమనియు, సంస్కారులమనియు, స్వమత మభ్రాంతమను గర్వమున మునింగియుండు, దాంభికజనుల హస్తమం దున్నతశాస్త్ర విధులు, సరిగ వ్యవహరింప బడుటలేదు. సరిగ శాస్త్రము నవలంబించి నడచినయెడల, నది ముక్తిపథమునకు మిక్కిలిగ దోడ్పడును. శాస్త్రమే శబ్దబ్రహ్మము.

ఎవడు భగవచ్చరణములయం దాత్మోత్సర్గమొనర్చునో, ఆత్మను నిత్యముక్తమని గ్రహించునో, శరీరప్రాణములను, కర్మను, కర్మఫలమును భగవానుని కర్పించి ముక్తసాధకుడగు చున్నాడో, వాడుద్యోగపర్వమందుండుట-కిచ్ఛగింపడు. శాస్త్ర విధానమునకు బంధింపబడడు. సర్వోత్కృష్టమగు శాస్త్రవిధుల పరిసరముల నతిక్రమించి సర్వకర్మలయందునను, సర్వావస్థలయందునను, ఆనందమును ననుభవింపుచుండును. ఇట్టివారలే ముక్త

లు. భగవత్పదములయందు సర్వస్వమర్పించు వారలకు బంధనము లెక్కడవి?

శ్రీకృష్ణుని చరణముల యందు కర్మనుగూడ నర్పింపవలయుననిన యర్థమేమి? ప్రకృతిని యుపలబ్ధి నొందవలయును. మన సమస్త కార్యములను భగవదాదేశము వలన ప్రకృతి యొనర్చుచున్నదను ధారణ సుస్థిరముగ నుండవలయును. భగవానుడే మనస్వభావమందుండి కర్మను నిర్ణయించుచున్నాడను జ్ఞానము మనహృదయమందు సుస్థిరముగ నాటుకొను నప్పటినుండియు, సకల కర్మలకు నియంత భగవానుడనియు, మనకేమియు, సంబంధములేదనియు గ్రహింతుము. అప్పుడు మనకే కర్మకును జవాబుదారి యుండదు. కర్మబంధనమందు దగుల్కొనవలసిన యావశ్యకత యుండదు. భగవానుడొనర్చు కార్యముల కాతడెవ్వరికిని జవాబు చెప్పవలసిన పనిలేదు. ఏలయన ఆతడు సర్వమయుడగుకర్త; సచ్చిదానందమయుడు.

శాస్త్రవిధి ననుసరించి నడచుచుండు సాధకబృందముయొక్క కర్మయు, స్వభావ నియతియు, ప్రకృతి వలన నుశ్శృంఖలమై యుండును. అందువలన దానిని ధర్మమనుచున్నాము. మనకర్మ యందుగూడ స్వభావ

నియతియున్నది. కాని యీస్వభావ నియతి యంత్రస్వ రూపము. అది శ్రీభగవానునివలన నియమితమును, సుసం యతమునై నడిపింపబడుచున్నది. ఖండసంస్కారముల వలన నాక్రమింపబడియుండు మనమిట్టి యుత్కృష్ట జ్ఞాన ముతోడ నెల్లప్పుడుండుట సహజముకాదు; సంభవము నుగాదు. కాని యీక్రింద వివరించిన యవస్థా త్రయము ననుసరించి, మన మతిశీఘ్రముగ నిట్టి సజ్జ్ఞానమును బొందగలము. ప్రథమమున "త్వయా హృషీకేశ హృదిస్థితేన యథానియుక్తోస్మి తథా కరోమి" ఈమంత్ర మువలన ప్రబుద్ధులమై యుండవలయును. సకలావస్థల యందును "ఓహృషీకేశుడా? నాహృద్దేశమందుండి దేనిని చేయించిన దానిని చేయుచుందును." అనువిష యమును మనస్సు నందుంచుకొనవలయును. శయన, భోజన, భ్రమణ, ప్రసంగ, ఉచ్ఛ్వాస, ప్రశ్వాసలయం దీమంత్రమును జపించుచుండ వలయును. ఈవిశ్వాస ము మనయస్థిమజ్జాగత మైనప్పుడు, మనము సర్వకర్మల యందును హృషీకేశుని నిర్దేశమును గాంచి పరమానం దమును బొందుచుందుము. ఈసర్వోత్కృష్ట భావము వలన మనహృదయకమలము వికసించినప్పుడు సాధనా పథమందలి ద్వితీయసోపానమును జేరుట సులభమగును.

భగవద్గీత యందలి విద్యుఛ్ఛక్తి సంచారిణి యగు మహా మంత్రమిది.

" ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి
భ్రామయన్ సర్వ భూతాని యంత్రా రూఢాని
మాయయా ? "

"శ్రీభగవానుడు సర్వజీవుల, యంతః కరణమందు నివసింపుచు, గుణత్రయ సహయోగమున మాయాకర్తృకముగ భూతగణమను యంత్రమందుండి నడిపింపుచున్నాడు." అను మహాభావ ముపలబ్ధి యగును. గుణత్రయము మనయందు కర్మయొనర్చు విధమును గ్రహింపగలము. మరియు యంత్రారూఢమగు నీ దేహము యంత్ర సహాయ్యమున, నెట్టి స్వభావమున, నడిపింప బడుచున్న దియు తెలిసికొందుము. అప్పుడు సాధకుడు పూర్వమంత్రముయొక్క 'తథా కరోమి' యని యనక 'గుణా వర్తత్తైవ' నేను చేయుటలేదు. గుణావళియే నన్ను చేయింపుచున్నది. ఆగుణత్రయము భగవానునకు జెందినదని నుడువుదుము. ఈయవస్థయందు విశేషవిపత్తులు గలుగును. గుణాదిజనితకర్మను బ్రతికింప జాలనియెడల, మన స్వభావ జనితమగు దారుణయశుద్ధత ప్రకాశింపును. అప్పుడు కల్పిత పాపపుణ్యముల జ్ఞానము మన

లను పీల్చి పిప్పిచేయుచుండును. పాప పంకిలమందు నిమగ్నులమై రోదనము చేయవలసివచ్చును. పూర్వజన్మ సంస్కారములవలన గలుగునేదియో యొక పుణ్యకర్మ మొనర్చినప్పుడు హర్షానందములవలన నాక్రమింపబడు దుము. కావున నీస్థితియందాత్మ సమర్పణయోగిని స్మరింపు చుండవలయును. భగవానుని పదపద్మముల యందు సర్వస్వమర్పించు ముహూర్తమునుండియు, జీవిత కార్యముల నన్నిటిని భగవాను డొనర్చుచుండును. మరియు మన జీవితమును గైకొని పాపపుణ్యముల లీల యొనర్చుచుండును. కాని మనకాలీలయందాసక్తి యుండజనదు. మనోప్రాణ శరీరములను యంత్రమంద ధిష్టించి, భగవానుడేవిధముగ నాడించిన నట్లు నృత్యము చేయుచుందుము. అప్పుడు మనకు పాపపుణ్యముల తోడ సంబంధ మేమున్నది? జగద్రక్షకుడగు భగవా నుడు, "నమేభక్త వినశ్యతి". నాభక్తునకు నాశనము లేదు. "ప్రతిజానే" అని ప్రతిజ్ఞ చేయుచున్నాడు. కావున నోనవీనయుగ సాధకులారా? రండు. శ్రీకృష్ణ భగవా నుడు కురుక్షేత్ర సంగ్రామమందు భవిష్యద్భారతవర్ష మహత్తర వికాసము కొరకు ప్రచార మొనర్చిన మహా మంత్రమును స్మరింపుచు నూతనయుగ మాహ్వానింతము.

౯

యోగముయొక్క ద్వితీయ సోపానమును దాటిన పిమ్మట తృతీయ సోపానమును జేరుదుము. పరిపూర్ణముగ భగవదుపలబ్ధియైనను, లేక భగవత్కరుణగలిగినను తృతీయసోపానమును జేరగలము. పురుషునితోడ సంయుక్తమై స్వతంత్రులమైన మాత్రమున ప్రయోజనము లేదు. త్రిగుణాతీతులము గానలయును. గుణసంయోగము వలన ప్రకృతి లీలలొనర్చుచున్నది. కావున ప్రకృతిని త్రిగుణములనుండి విముక్తి నొందింపవలయును.

సత్త్వము, రజస్సు, తమస్సు, అనిగుణములు త్రివిధములు. సత్త్వము విశుద్ధప్రకాశమందు విలీనమగును. అనగా ప్రకృతి విశుద్ధమును, ముక్తమును, అనంతమునగు నాత్మచైతన్య మందుండును. రజస్సు విశుద్ధ తపస్వరూపమగును. అనగా ప్రకృతి మహత్తరమగు భగవచ్ఛక్తియొక్క ప్రవాహమగును. మరియు నది మనయిన్ద్రియములయందు దివ్యజ్యోతి రూపమున పొంగిపొరలుచుండును. తమస్సు, శమముగను, శాంతిగను మారును. అప్పుడు ప్రకృతి యనిర్వచనీయ శాంతితోగూడియుండుమన యింద్రియములయందు స్థిరనివాస మేర్పరచుకొనును.

అప్పుడు భాగవత జ్ఞానము జీవుని యందు కర్మ రూపమున స్వతస్సిద్ధముగ బ్రకాశించును. కావున భగవదిచ్ఛకును దీనికిని భేదముండదు. కాని యాధారములు అపరిశుద్ధముగను, అపరిణతావస్థ యందుండినప్పుడు, భగవదిచ్ఛ గుణయుక్తమై ప్రకాశింప దలచినయెడల, గుణత్రియము పరిపూర్ణముగ బ్రకాశింప జాలదు. అందువలన వికృతాకారమును దాల్చును. ఆధారములు విశుద్ధమైనయెడల సత్వరజస్తమోగుణములు, ప్రకాశముగను, తపస్సుగను, శమముగను, మారి మానవుని దేవునిగ బరిణమింప జేయును. అప్పుడ నంతప్రకాశమును, విపులశక్తియు, అసాధారణ ధైర్యమును గలుగును.

మనకిట్టి స్థితి లభించి నప్పుడొక మహాశక్తి మనయందుండి, మన కొరకు జింతింపుచుండును; కార్యముల జేయుచుండును. మన యాధారములయం దా శక్తి నివసింప జొచ్చిన యెడల, నది మనశక్తి కాదని తెలిసికొందుము. ఆదేవశక్తియే మనసమస్తేంద్రియములను నడిపింపుచుండును. ఆయనంతశక్తి బుద్ధిద్వారమున చింతింపుచు, హృదయముతోడ ననుభవింపుచు, దేహముతోడ కర్మనొనర్చుచుండును. వానిని మన ముపభోగించెదము. కాని దానిచేత మనము బంధింపబడము. మరియు దానిమీద

మనయధికార ముండదు. "కర్మాణి ప్రవిలీయంతే" అప్పుడు మనకు ప్రత్యేక కార్యమనునది యుండదు. తామరాకునందలి నీటిబొట్టు జారిపడినయెడల నాయాకునందు దానిగుర్తుగూడ నుండదుగదా? అటులనే మనకప్పు డేవిధమగు కర్మసంస్కారము లంటవు. సముద్రమందు తరంగములు బుట్టుచుండును. తిరిగి లయమగుచుండును. కాని యాగుర్తులు సముద్ర మందంకితములై యుండునా? అటులనే మనజీవితమందు కర్మతరంగములు బుట్టుచు విలీన మగుచుండును. కాని వానిచిహ్నములు గూడ మనస్సును స్పర్శింపజాలవు. అప్పుడు దేహమనోప్రాణములు మొదలగు నవన్నియు భగవానునకు సంబంధించిన వగును. మరియు మనము కేంద్రముగమాత్ర ముందుము. భగవానుని సచ్చిదానందలీల పొంగిపొరలుచు మనమీాదనుండి బ్రవహింపు చుండును.

ఈస్థితి యందు "తచ్చిత్త" ముగ నుండ వలయును. సమస్తమును భగవదర్పిత మొనర్చిన యెడల యట్టిస్థితి గలుగును. భగవద్గీతయందు భగవాను డిట్లు జెప్పు చున్నాడు. "యస్య నాహం కృతోభావః బుద్ధిర్యస్య నలిప్యతే" అహంకార వివర్జితుని బుద్ధియేభావముచేతను లిప్తముకాదు. దీనినే సర్వకర్మ సమ

ర్పణ మందురు. అందువలననే శ్రీకృష్ణ భగవానుడిట్లు చెప్పియున్నాడు.

" మయి సర్వాణి కర్మాణి సంన్న్యస్యా ధ్యాత్మ చేతసా।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః॥

నాకు సమస్త కర్మల నర్పించి, యంతర్యామి యధీనుడనై కర్మనొనర్చు చున్నానను జ్ఞాన విశ్వాసము లతోడ, ఆధ్యాత్మ యోగద్వారమున, మమత్వ శూన్యుడవై యుద్ధ మొనర్పుము. అప్పుడాత్మకు వ్యాధిస్వరూప మగు శోకము తొలంగును.

ఇట్టి పూర్ణముక్తి బొందగోరినయెడల నిస్పృహుల మును, నిర్ద్వంద్వులమును, నిర్వికారులమును గావల యును. ఉచ్చనీచములు, మంచిచెడుగులు, పాపపుణ్యా ములను ద్వంద్వ సంస్కారములను, లోభమును, అహం కారమును నొక్కమారుగ బరిత్యజింప వలయును. ఈమూటను ఆత్మ సమర్పణ యోగమునకు ప్రబల శత్రువులు.

మనము నిర్ద్వంద్వుల మైనయెడల, నిస్పృహుల ము కాగలము. ద్వంద్వాతీతావస్థ లభించినగాని, నిస్పృ హుడగుటకు వీలులేదు. ప్రతిద్వంద్వమును మనస్సునందు ప్రవేశించి తల్లడిల్ల జేయుచుండును. స్వభావసిద్ధముగ

మనస్సు రాగద్వేషయుక్తమై యుండును. అందువలన నేదియో యొక వస్తువునం దాసక్తియు, మరికొన్ని వస్తువులయం దసహ్యముండును. కావున నీద్వంద్వావస్థను మూడు భాగములుగ విభజింపనగును. దేహ సంయోగము వలన మనస్సునందు బ్రవేశించు క్షుధతృష్ణలు, శీతగ్రీష్మములు, శ్రమవిశ్రాంతులు మొదలగునవి యధమ ద్వంద్వములు. ప్రాణాకాంక్ష వలనను, మానసికానుభవము వలనను బుట్టుచుండు, జయ పరా జయములు, విఫల సఫలములు, సౌభాగ్య దుర్భాగ్యములు, సుఖ దుఃఖములు, శాంతియశాంతులు మొదలగునవి మధ్యమ ద్వంద్వములు. బుద్ధిసహాయమున మనస్సునం దుదయింపుచుండు పాపపుణ్యములు, సత్యాసత్యములు మొదలగునవి యుత్తమ ద్వంద్వములు జ్ఞానసహాయమున నీద్వంద్వముల నన్నిటిని నశింప జేసికొన వచ్చును.

"ఒక్క భగవానుడు తప్ప మరివేరు వస్తువు లేదు. సమస్త వస్తువులయందును, సర్వకర్మలయందును, భగవానుడు విరాజిల్లుచున్నాడు". అనుజ్ఞానము నిరంతర ముండవలయును. కాని యట్టి జ్ఞానసహాయ్యమున వస్తు నిచయమునందు పరస్పర సంబంధము గన్పడు టెట్లు? లీలామయుని యుద్దేశ్య సాధనకొరకు విచిత్రమును, విష

-శీతమునగు మూర్తులు వికసింపుచుండును. కాని వాని యందే విధమగు భేదమును లేదు.

భక్తివలనకూడ మనము నిర్ద్వంద్వులము గావచ్చును. జగత్తునందలి సమస్తవస్తువులును, ఘటనలును, అవస్థలును ప్రేమ మయుని యిచ్ఛాను సారము బుట్టుచున్నవి. అందువలన మనమా సమస్తమును పరమానందమున గైకొనవలయును. సర్వభూతముల యందును భగవానుని సందర్శింపుచుండువాడు, సమస్త ద్వంద్వములను సమత్వమున జూచు ననుటయం దాశ్చర్యమేమున్నది ?

కర్మవలనగూడ మనము ద్వంద్వాతీతావస్థను పొందవచ్చును. సమస్త కర్మలను భగవానున కర్పించినప్పుడు, సుఖదుఃఖములు, మానాభిమానములను నవి యెట్లుండును ? అప్పుడు మనకర్మయు భోగమును భగవానున కుపభోగ్య మగును. భగవానుని సృష్టియందు మనకు నిరానందము గలిగినయెడల, మనము సంపూర్ణముగ నాత్మసమర్పణమును చేయలేదని గ్రహింప వలయును. ఈవిధముగ జ్ఞాన భక్తి కర్మలతోడ, నాత్మ సమర్పణ సంకల్పము దృఢమైనయెడల మనము సాధ్యమును జేరగలము.

౧౦

మనల నిర్లిప్తులుగ నుండనీ యనిది అహంకార ము. జగత్తునందు మనము పలువిషయములతోడ సంబంధము గలిగి యున్నాము. వాని యొత్తిడివలన మనస్సునందు పలువిధ భావము లుద్భవిల్లు చున్నవి. ఆభావములనే ద్వాంద్వములందురు. మనమీద్వంద్వములను ఇనుపగొలుసులచేత బంధింపబడి సుఖదుఃఖములు, శోక మోహములు మొదలగు వానితోడ కాలముగడుపు చుందుము. మన జీవితమందును, సాధనయందును, అహంకారలీల వెల్లడి యగుచున్నది. ఇది గుణభేదమువలన సత్వ రజ స్తమో గుణములని మూడువిధములు.

వాసనయే, రాజసిక అహంకారమునకు, ప్రధాన కారణము. ఇది యెప్పుడును మనల నాశ్రయించి యుండును. మరియు నిది కర్మకును, కర్మ ఫలమునకును వెనుకనుండి మనలను పీల్చి పిప్పిచేయు చుండును. ఈబంధన విముక్తి గావలయుననిన "మాకర్మ ఫలహేతుర్భూః" అను భగవద్గీతా వాక్యమును స్మరణయుందుంచుకొన వలయును. కర్మనుగూడ భగవానున కర్పింపవలయును.

దౌర్బల్యము తామసిక అహంకారమునకు మూ

లస్తంభము. ఇది మనలనెప్పుడును, సోమరులుగను, క్రియా రహితులుగను, నిరాశులుగను, జేయుచుండును. దీని ప్రభావమున మనము హతబుద్ధులమును, తేజోరహితులమును, హతాశులమును నగుచున్నాము. ఇందువలననే కార్యము నొనర్చుట కుత్సాహ ముండదు. అత్యంత సామాన్య కార్యమొనర్చుటకుగూడ భయము గలుగును. అసారముగ జీవితమును గడపుచు సంతోష విహీనులమై, యేకార్య మొనర్చుటకును శక్తి లేక, జీవచ్ఛవములుగ బడియుందుము. ఇట్టి జడత్వము నుండి దప్పించుకొనవలయు ననిన " మాతే సంగోస్త్వ కర్మణి" "కర్మను నొనర్పని ప్రవృత్తి యెప్పుడును గలుగకుండును గాత" అను భగవద్గీత వాణిని యెప్పుడును స్మరింపు చుండవలయును. " యోగస్థః కురుకర్మాణి " సర్వదా యోగమందుండి కర్మనొనర్పుచుండ వలయును.
" సిద్ధ్యాసిద్ధ్యోఃసమోభూత్వాసమత్వంయోగఉచ్యతే "

సిద్ధించినను, సిద్ధింప కుండినను, సమత్వము గలిగి యుండుటను యోగమందురు. ముందుకేగ గలిగితిని, లేక క్రమముగ వెనుక బడితిననియు, కర్మవలన మేలు గలిగినది, లేకకీడుగలిగినదనియు,సిద్ధిలభించినది, లేక విఫలమనోరథుడ నైతిననియు దలంచుటకు నీకధికారము

లేదు. "సంగంత్యక్త్వా" ఆసక్తి నిడిచి కర్మ నొనర్పుము" అను విధమున కర్మ నొనర్చుటయే, యీశ్వరాదేశమను విశ్వాసమును, దృఢపరచు కొనవలయును. మరియు భగ వదాదేశమువలన కర్మనొనర్పుచున్నాను. కావున నేనొ నర్చు కార్యములం దెట్టి యడ్డంకులు గలిగినను వెను దీయనను దీక్ష యుండ వలయును, ప్రఫుల్లచిత్తమున "దుఃఖే ష్వనుద్విగ్న మానాః సుఖేషు విగతస్పృహాః" దుఃఖమువలన మనస్సు క్షోభింపక, సుఖములన సంత సింపక, అవికల చిత్తమున కర్మ చేయు చుండవలయును. "అనిర్విణ్ణ చేతసా" సాత్త్వికా అహంకారము దృఢమైన నది. అందువలన జ్ఞానానందములచేత సాధకుడు బాధిం పబడును. అర్జునుడు రణరంగమునందు బ్రవేశించి, యు భయసేనల యందుండు బంధుమిత్రులగాంచి, గాండివ మునువీడి, శ్రీకృష్ణభగవానుని బ్రశ్నించిన ప్రశ్నలు యుక్తాయుక్తములుగావని నుడువుటకు వీలు లేదు. కుల క్షయము వలన గలుగు మహాపాపమును దగుల్కొని రాజ్యసుఖ మనుభవింప దలచుట యధర్మమని యర్జును నకు దోచెను.

"గురూన హత్వాహి మహానుభావాన్ ।
శ్రేయశ్చర్తుం భైక్ష్య మపీహ లోకే ।

హత్వార్థ కామాంస్తు గురూనిహైవ।
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥

"మహానుభావులును నాకు గురువులునైన భీష్మద్రోణాదులను జంపుటచేత లభించెడి భోగముల ననుభవించుట కంటెను, వారిని జంపక భిక్షమెత్తుకొనుట యైనను మేలు. వారు విరక్తులు గారు. మనవలెనే భోగములయందు మిక్కిలి యాసక్తి గలిగి యున్నారు. అట్టివారిని జంపి వారిభోగముల ననుభవింపు నపుడెల్ల నవినెత్తుట తడసినయాగురువులను జ్ఞప్తికి దెచ్చుటవలన, నవియును నెత్తుట దడసిన వానివలెనే యసహ్యములుగ దోచును. కాని వానివలన ఇహలోక సుఖమును లేదు. వారనుభవింపుచుండిన భోగములనే, వారుండిన తావులయందే గూర్చుండి యెట్లనుభ వింతును" ఈవాక్యములు పార్థుని యుదార హృదయమును దెలుపుచున్నవి. కాని శ్రీకృష్ణ భగవానుడు కులక్షయ కారియగు మహాయుద్ధ మొనర్చుటకు మానవుని నియమించుచున విషయము అర్జునుకు దెలియదు.

"యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణేహన్యు స్తన్మేక్షేమ తరం భవేత్"

"శస్త్రాస్త్రములు పరిత్యజించి, ప్రతి యుద్ధము

చేయని నన్ను, శస్త్ర పాణులయిన దుర్యోధనాధులు యుద్ధమునందు వధించి రేని యదియును నాకు మరింత క్షేమమేయగును. " అని నుడువుచు అర్జునుడు అస్త్రము లను బరిత్యజించెను.

అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు, పార్థుని మోహ విదూరినిగ నొనర్చుట కిట్లు నుడివెను. మానవునకు ఖండధర్మము లభించినంతనే, తాను పూర్ణుడనని తలంచి సంపూర్ణముగ యోగయుక్తుడు కాజాలడు. కాని యీ యహంకారము సాత్త్వికఅహంకారమే యైనను అహంకారమే గదా ? అందువలన సాత్త్వికఅహంకారి భాగవతకర్మను గూడ తన యోచనాను సారముగ నొనర్చి గైకొనుటకు ప్రయత్నించును. హితాహితములు, పాప పుణ్యములు, మంచిచెడుగులు మొదలగునవి, మానవుని వ్యక్తిగత జీవితమునకు సంబంధించినవి. కాని భగవాను నకు ధర్మాధర్మములులేవు. అతడేది యొనర్చిన నదియే ధర్మము; పుణ్యము; ఆనందము.

సాత్త్విక అహంకారమును దప్పించుకొని, పూర్ణ యోగమును బొందవలయుననిన, పాపపుణ్యాజ్ఞాన వివర్జి తుడై "ఉభే సుకృత దుష్కృతే" సుకృత దుష్కృత ములయందు సమభావమున నుండవలయును. పరబ్రహ్మ

మందు సకలకర్మల నర్పించి "మయిసర్వాణి కర్మాణి సన్న్యస్యా ధ్యాత్మ చేతసా" యని కర్మపథమున నడువ వలయును. కర్మ యొనర్చునప్పుడు, న్యాయా న్యాయ జనితమగు సంక్షోభము గలిగినయెడల, అహం కార మున్నదని గ్రహింపవలయును. భగవాను డేది యొనర్పదలచిన దానిని నిర్ద్వంద్వముగ నొనర్చు చుండ వలయును.

సనాతన యోగమార్గమున నిర్గమించు వారలు, అనగా యాత్మసమర్పణముచేయవలయునను సంకల్పము మాత్రముండి, భగవానునకు సంపూర్ణముగ సమస్తము ను నర్పింపజాలని వానికి, గుణత్రయమందలి యేదియో యొక అహంకార మస్తువచ్చుచుండును. ఆత్మసమ ర్పణ మంత్రమున దీక్షితుడగు రజోగుణ సాధకుడిట్లు దలంచును. "నేనుసాధకుడను. యోగమార్గ మవలంబిం చితిని, చాలమందికంటెను నేనీమార్గమునముందు కేగితిని. నేనుభగవానుని క్రీడకు యుత్కృష్ట యంత్రమై యున్నా ను." అను ధారణవలన నహంకారమును వృద్ధిచేసి కొనుచుండును. మరియు తానొనర్చుచుండు వాసనాజనిత కర్మను భగవానుడొనర్చు కర్మయని దలచి, దానినొన ర్చుటకు ప్రాణపణముగ బ్రయత్నింపు చుండును. ప్రతి

పద మందునను విఘ్నములు గలుగుచున్నను, ధర్మపథ మునం దనేక కంటకము లుండునని దలచి, మిక్కిలి యుత్సాహమున కార్యములొనర్పుచుండును. మరియు నా కార్య నిర్వాహణమునకు భగవానునికంటె నాతనికి మిక్కుటమగు అనురాగమును ఆతురతయు నుండును. కావున రాజసిక అహంకారి తానొనర్చు కార్యములు భగవానుడొనర్పుచున్నాడను భ్రమయం దుండును. కానియవి భగవానుడొనర్చు కార్యములు గావు. అవి కేవలము వానిబుద్ధికి సంబంధించి యున్నవి. అందువలన రాజసిక అహంకారియగు సాధకుడు ఉద్భ్రాంతుడగు చుండును. యోగియెల్లప్పుడు సమస్త పదార్థముల యందు భగవానుడు విరాజిల్లుచుండునను భావమున నుండును. మరియు వ్యక్తిగత స్పృహనువీడి యభ్యంతర మందు నడచుచున్న కర్మయందు లక్ష్యముంచును. భగ వానుడు జ్ఞానజ్యోతిని ప్రజ్వాలింపజేయ నంతవరకును 'జ్ఞానదీపేన భాస్వతా.' అభ్యంతర మందలి యంధత్వ మును దొలగింప నంతవరకును, సాధకుడు మోహాయు క్తుడై యుండును.

తమోగుణమందు ద్వివిధములగు విపదలు గలవు. (౧) సాధకుడు " నేనుదుర్బలుడను, పాపిని, బుద్ధిహీనుడ

ను, పనికిమాలినవాడను, పరమమూర్ఖుడను, అధమాధ
ముడను, కావున నాద్వారమున భగవత్కార్యము
లెల్ల నెరవేరును." అని దలంచు చుండును. మరియు
భగవచ్ఛక్తి యవస్థా విశేషము ననుసరించి
యుండునని గాని, 'పంగును' గిరోల్లంఘనమును, మూ
గను వాచాలునిగను నొనర్పగలశక్తి భగవానునకు
గలదని విశ్వసింపడు. (౨) సాధకు డొకింత స్వాతంత్ర్య
మనుభవింపు చుండును. శాంతికి మారుగ నొకింత
తృప్తిని యాస్వాదించును. అందువలన తననావరించి
యుండు సమస్త దుఃఖములు దొలగినవని, శాంతి గలి
గినదని తలంచి, కర్మ జీవనము నుండి మరలి నిరుపద్రవ
మగు తృప్తిని బొందుచు, కాలము గడుపు చుండును.

కానిసాధకుడా! నీవు బ్రహ్మమని యెరుంగుము.
కాళీశక్తి నీయందు పనిచేయుచున్నది. కావున సర్వశక్తి
యుతుడగు భగవానుని లీలవలన నీకు నిరానంద మేల
గలుగును. భగవాను డెట్టి యుత్పాతముల సృష్టించినను
వానిని యుత్పాతములని దలంపకుము. అది భగవదా
నంద లీలాభివ్యక్తియని యెరుంగుము. అహంకార
ముున్నంతకాల మిట్టి యనుభూతి గలుటకు వీలులేదు.
కర్మ బంధనములు దొలంగినను మనము కర్మనొనర్చి

దీరవలయును. శ్రీకృష్ణ భగవాను డర్జునునకిట్లు చెప్పి యున్నాడు.

"నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కింఞ్చన
నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి"

ఓయర్జునా ఇాదు నాకర్తవ్య మేమియులేదు. ఏల యన త్రిలోకములయందు నాకప్రాప్తమైనది కాని, లేక ప్రాప్తి యోగ్యమైనది కాని, కొంచెమైనను లేదు. అయి నను నేనుకర్మయందు ప్రవృత్తుడనై యున్నాను.

"లోక సంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి"

జగద్రక్షణ కొరకు కార్యము లొనర్చుచుండవల యును. మహదైశ్వర్య వంతమగు నీజగత్తు ప్రకృతి గర్భమునుండి యుద్భవిల్లి యున్నది. కాని యది తిరిగి ప్రకృతియందు విలుప్తము గావలయునను కోరిక భగవా నునకు లేదు. కావున సమస్త కర్మలనొనర్చు భగవాను నకు మనకర్మనర్పింప వలయును.

"ఉత్సీదే యు రి మేలోకా నకుర్యాం కర్మచేదహామ్"

నేనుకర్మ నొనర్పని యెడల నీజగత్తంతయు తమో గుణాచ్ఛన్నమై ప్రకృతి గర్భమందు విలుప్త మగును. కర్మను విరమించుటయన, కర్మను భగవానున కర్పించి విముక్తుడగుటయని తలంప జనదు. అట్లు దలంచిన

యెడల మనము తామసికఅహంకారమునకు సర్వస్వమ ర్పించి జడత్వముయొక్క దృఢశృంఖలములచేత బాధిం పబడుటయగును. మరియునది జీవితముకాదు; మృత్యువు. అది స్వర్గముకాదు; నరకము. అదిముక్తికాదు; అనంత బంధనము.

సాత్వికఅహంకారము సాధకుని మరియొక దిక్కు నకు లాగును. ఏదియోయొక సాధనపద్ధతి నవలంబించి ఆసాధనసిద్ధియందు తన్మయుడై యుండునట్లు జేయును. దయ పరోపకారము మొదలగు వానియందొక శక్తినా ర్జించుటకు యోగరతుడగును. మరియు స్వసాధనాను సారముగ ధర్మ సాధనయందు సంతృప్తుడై యుండును. సాధకుడు తాను శ్రేయమని తలంచు దానిదిక్కునకు నడ చుచు, మిగిలిన దిక్కులనుండి దృష్టినిమరలించు కొనును. కాని సాధన వ్యక్తిగత జీవితము కొరకు గాదు. మరియు సిద్ధులను గాని, దయ మొదలగు వానినిగాని, సంపాదించు కొనుటకు గాదు. అట్టి దానిని పూర్ణసిద్ధియని నుడువు టకు వీలులేదు. ఏలయన మనము యోగదీక్షకు బూర్వ మే దేనినిగాని భగవానుని కోరమని స్థిర మొనర్చు కొం టిమి. అందువలన భగవాను డొసంగిన దానిని నిర్వి కారచిత్తమున గ్రహింతుము. భగవానునకు సర్వస్వ

మర్పించు వానికి లభింపని యానందమేమున్నది ? భగ వానుని సమస్తలీలలు ఆనంద తరంగములు. అందువలన భగవానుడు మనజీవితముతోడ నేవిధముగ క్రీడించినను నది యంతయు నానందమే కదా ?

సాత్త్వికఅహంకారమువలన సిద్ధులు గలుగును. కాని పూర్ణయోగి సాత్త్వికఅహంకారమును గూడ వీడవలయును. ముక్తి, నిర్వాణము మొదలగు సర్వోత్త మ లక్షణముల యందుగూడ సాధకున కాసక్తి యుండ జనదు. కేవలము నిరవచ్ఛిన్న భావమున సాధకుడు భగ వానుని భగవల్లీలను గాంచుచుండవలయును. త్రిగుణాతీ తుడగు సాధకుడు భగవద్గీతయందు చెప్పబడిన లక్ష్యము నకు మూర్తియై యానందము ననుభవింపు చుండును.

(౧౧)

ఆత్మ సమర్పణ యోగమందు మూడు సోపాన ములు గలవు. అందు ఆత్మసమర్పణ సంకల్పము ప్రథ మ సోపానము. ఆధారముల కతీతుడై విజ్ఞానకోశ మందుండుట ద్వితీయ సోపానము. సర్వభూతముల యందును, సర్వావస్థల యందును, భగవానుని సంద ర్శించుట తృతీయ సోపానము.

సాధకుడు తన సర్వస్వమును, సమస్త కర్మలను

వాని వలన గలుగు ఫలసముదాయమును, భగవానుని పద
పద్మముల యందర్పిప వలయును. అప్పుడు జీవితము
నందెట్టి కర్మ బ్రవహింపు చున్నను, కర్తృత్వాభిమాన
ముండదు. మరియు కర్మజనిత ఫలమున కధికారినను
జ్ఞానముగూడ నుండదు. ఈవిధముగ సమస్త బంధనముల
నుండి విముక్తుడైనప్పుడు సాధకుని స్వభావము, ఆత్మ
యొక్క విమలానందమును ననుభవించును. ఇదియే
జీవుని సిద్ధావస్థ. "నిత్యముక్తస్వభావవాన్"

"దేహము, ప్రాణము, మనస్సు, బుద్ధి, మొదలగు
నవి నేను గాను. నేనానందమయ సత్పదార్థమును. అందు
వలన సుఖమందు ప్రవృత్తిలేదు. దుఃఖమందు నివృత్తి
లేదు. పుణ్యమం దభిరుచి లేదు. పాపమందు విరక్తి
లేదు. నాజీవితమందెట్టి ఘటనలు గలుగుచున్నను
నేను నిర్వికారుడను. అవి నన్ను స్పర్శింప జాలవు.
నేను సచ్చిదానంద స్వరూపుడను. కావున నానం
దము దోలలాడు చుందును. నాకు ప్రియాప్రియము
లనునవి లేవు. నాకు సంతోషమును దుఃఖమును గలిగించు
నవి లేవు. ఏలయన భగవానుడే సమస్తము నగు
చున్నాడను విషయము నాకు హృదయంగమము. మాన
వులు, పశుపక్షులు, కీటకపతంగములు, తరులతలు, గిరి

నదులు, ఇల్లువాకిలి మొదలగు సమస్తమును భగవానుడు. అందువలన నాకొక దానియం దాకాంక్షగాని, మరియొక దానియందు విరక్తిగాని లేదు. ఘటనాప్రవాహమం దేది సంభవించినను, నది యానందమయ సత్తాయొక్క ప్రకాశము మాత్రము. నాజీవితమందు సంభవింపుచుండు సుఖదుఃఖములు, మంచిచెడుగులు మొదలగునవన్నియు, బ్రహ్మముయొక్క విభిన్నమూర్తులు. అందువలన నేను సర్వావస్థలయందును సమభావమున నుందును" అని సిద్ధపురుషుడు నుడువుచుండును. ఇట్టి యానందము ననుభవింప వలయుననిన, మానవుడు సాధనను జేయవలయును. సాధననొనర్పక సిద్ధిగలుగదు.

ఆత్మ సమర్పణ సంకల్పమును దృఢ మొనర్చుకొనవలయుననిన "అనుమతి" "స్మృతి" యను వాని నవలంబింపవలయును. 'అనుమతి' యన సమ్మతి. అనగా జీవితమం దేది సంభవించినను, నవియన్నియు, భగవదిచ్ఛవలన గలుగుచున్నవని దలంపవలయును. మరియు సర్వఘటనలు భగవానునివని దలచి ప్రవర్తింప వలయును. ప్రథమమున నీసమ్మతి యపరిపక్వావస్థయం దుండును. అప్రియములగు ఘటనలు గలిగినప్పుడు సాధకుడు విచలితుడగును. కాని యది భగవానుడొసంగిన దుఃఖమని

-యాంగీకరించి నడచుట కంగీకరింపడు.

సమస్తమును సమత్వమున జూడవలయుననిన సాధనను జేయవలయును. ఏలయన సకల కర్మలు భగవానునివని విశ్వసించి ననుగూడ, ననేక జన్మలయందలి 'నేను' అను సంస్కార మొక్కదినమున దొలంగదు. చిత్తసంస్కార సంబంధమగు అప్రియములు, వర్జనీయములగు ఘటనలు సంభవించిన యెడల సాధకుడు తలక్రిందు లగుచుండును. కాని 'యనుమతి' యపరిణతావస్థ యందుండినను, భగవత్కార్యముల ననుసరింపుచు నానందము నుపభోగింప వలయునను నిశ్చయము గలుగును. అప్పుడు సుఖదుఃఖములకు సంబంధించిన కార్యములవలన గలుగు ఫలము, హృదయమందు వికసించి నప్పుడు, వానిని భగవానుని దానముని గ్రహించుట కొకు మాత్రమైనను జంకడు.

'సమ్మతి' క్రమాభివృద్ధినొంది పరిపక్వమైన యెడల, కర్మఫలమునుగూర్చి యోచింపవలసిన యావశ్యకత యుండదు. కర్మయు, కర్మఫలమును, భగవదిచ్ఛవలననే గలుగుచున్నవని గ్రహించునప్పుడు, భగవదిచ్ఛతోడ తనయిచ్ఛ సంయుక్తమైనదని సాధకుడు గ్రహించును.

"స్మృతి" యనగా స్మరణ యందుంచు కొనుట యని యర్థము. అనగా "భగవానునకు నేను సమస్తము నర్పించితిని. కావున నాదియను నది లేదు. అంతయు భగవానునిది." అని మనమునం దుంచుకొనుటయై యున్నది. ఆత్మసమర్పణ మాత్రము, సాధకుని జీవన మందు జాగరూకత నొందిన యెడల, ఎట్టి ఘటనల వలన గూడ నాత డుద్భ్రాంతుడు గాడు. ఏలయన సమస్తము సాధనకొరకు గలుగుచున్నదనియు, భగవాను డాధార ములను తన లీల కొరకుపయోగ మగునట్లు జేసికొను టకు పలువిధ విచిత్రఘటనలను సృష్టింపు చున్నాడని యును దెలిసికొనును. "స్మృతి" లేని యెడల సాధకుడు యోగభ్రష్టుడగును. మరియు నేదయిన దుర్ఘటన గలి గినప్పుడు, దానినుండి దప్పించుకొనుటకు పలువిధముల బ్రయత్నింపు చుండును. ఆత్మసమర్పణ మొనర్చిన సాధ కుడు నిరహంకారిగ నుండ వలయును. కాని స్మృతి లేకుండుటవలన, అహంకారియై యోగభ్రష్టుడగు చుండు ను. మరియు పలువిధ దుఃఖములయందు దగుల్కొను ను. శిశువు క్రిందపడుచు లేచుచు చివరకు నడకనేర్చి నట్లు స్మృతి దరిగినకొలదిని భయపడక దానిని వృద్ధిలో నికి దెచ్చుకొనుచుండ వలయును. జీవనపణ మొనర్చి

యోగసాధన మార్గమున నిర్గమింప వలయును. స్మృతి నెప్పుడును మరువజనదు. "ఎట్టి యుత్పాతముల నైనను అంతము గలదు. కావున నేను విచలితుడనుగాను. ఇది భగవానునిలీల. చివరకు నేను శుద్ధముక్తసిద్ధుడ నగుదును. భగవానుడాధారముల శుద్ధికొరకిట్టి యనర్థముల సృష్టించుచున్నాడు." అనుస్మృతియెల్లప్పుడుండవలయును. సాధన సమయమందు సాధకుడు ధృతిని, యుత్సాహమును అవలంబింప వలయును. సిద్ధిగలుగుటకు కాలవిలంబన మయినకొలదిని ధైర్య మవలంబింప వలయును. కానిభయపడజనదు. అనంతధైర్యమున నుండవలయును. ప్రతికూలఘటనలకు జంకగూడదు. సర్వశక్తిమయుడగు భగవానుడు మననెట్టి దుర్గమపథమందు నడిపించినను, చివరకు సమస్త దుఃఖముల దొలగించి తనయంకమందు జేర్చుకొనునని నమ్మవలయును.

సాధక జీవనమందు వ్యాకులత్వమును, ఉత్తేజనమును విసర్జింపవలయును. ప్రథమమున చేయుతీవ్రప్రియత్నమువలన నాడంబరము గలుగును. అందువలన సాధకుడు ముందున కేగుచున్నానని దలంచును. కాని య్యది భ్రమ. ఆడంబరముగలిగిన వాడొకయడుగయినను ముందునకు వేయజాలడనుట నిక్కువము. ఆత్మసమర్పణ

యోగి భగవానునకు సమస్త ముత్సర్గమొనర్చి సుస్థిరుడైన కొలదిని, సిద్ధిని సమీపింపుచుండును. ప్రయత్నమందును, వ్యాకులత్వమునందునను "నేను సాధన జేయుచున్నాను. భగవద్దర్శనము గలుగును. సిద్ధినొందుదును" అను అహంకార ముండును. నేననునది యున్నంతకాలము సిద్ధి గలుగుట యసంభవము. కట్టతెగిన చెరువునందు నీరెట్లుండును? అహంకార మున్నంతవరకును సిద్ధి గలుగదు.

ఆత్మసమర్పణ సంకల్పము దృఢమైన కొలదిని, సాధకుడప్రమత్తుడై సమస్త విపత్తులను ధీరప్రశాంత చిత్తమున ధారణ జేయుచుండును. కాని యీసాధన మిక్కిలి కఠినము. అయినను ప్రథమమునుండియు దీని యందాసక్తి గలిగిన యెడల నిట్టి సహజమార్గము మరి యొకటి యుండదని గ్రహింతుము. ఏలయన స్వభావమే సాధనపథమున కనుకూలమగు శక్తి. ఆత్మసమర్పణ మంత్రదీక్ష వలన నుద్బుద్ధుడైన యెడల, వృథా ప్రయత్నమువలనగాని, ప్రాణముయొక్క వ్యాకులత్వమువలన గాని, ప్రయోజన మేమున్నది?

౧౨

సనత్సుజాతీయమను గ్రంథమందు శాస్త్రమును

ఉత్సాహము, గురువు, కాలము, అను నాలుగుమార్గ ములు చెప్పబడియున్నవి. ప్రథమమున సాధనశిక్ష నొంద వలయును. పిమ్మట దాని ననుసరించి నడుచుట కు దృఢ సంకల్ప ముండవలయును. దానితర్వాత గురు వును, చివరకు కాలమును ననుసరింపవలయును.

ఇదివరకు పూర్ణ యోగమందు చెప్పిన "అను మతిని" "స్మృతిని" యుత్సాహమని యెరుంగ వలయును. భగవానుడే సాధనకు గురువు. కాలమనునది యనంత వ్యాపియై మన సమ్ముఖమునం దున్నది. మానవుని యందు జ్ఞానజ్యోతి వెలింగినయెడల, భగవానుడే గురు వను విషయము గోచరించును. ఆయనంత జ్ఞాన ధారనుండి యే, యత్యల్ప ఘటనలుగూడ మానవుని బాహ్యాభ్యంత రములయందు ప్రవహింపుచున్నవి. మరియునవి మన యందుండు సహజమును సరళమునగు యోగమార్గము ను వికసింప జేయుచున్నవి. ఆధ్యాత్మికమును, ఆదిభౌతి కమునునగు సమస్తగతులను, సుశృంఖలితముగ నొనర్చి పరస్పరము కర్మనొనర్చుటకు సరిగనుంచుచున్నవి. ఏల యన నవియును పరిపూర్ణమును పరిశుద్ధమును నగుటకు నడచుచున్నవి. మానవ హృదయమం దనంతప్రేమ యున్నది. మహాజ్ఞానము మన జీవనగతిని యూర్ధ్వగామి

గ నొనర్చుచున్నది. కావున మన మధైర్యమును బొంద జనదు. కాల విలంబన మైననేమి? మనలను, అశక్తతయు అధైర్యమును నడ్డగింపు చుండును. కాని యుత్సాహ మపరిమితమై యుండవలయును. అందువలన నార్యాగ్నితోడ నప్రమత్తులమై ధీరత్వమున భగవానుని పదకమలముల యందు, మనసమస్తమును నర్పించి యానందమును బొందుచుండ వలయును.

కాలసముద్ర మనంతము. అందు తరంగముల మీద తరంగములుబుట్టుచు, భగవానుని కొరకు పరుగిడు చున్నవి. కావున దాని మీదనుండి మనము ముందునకు నడువ వలయును. కాలమే జీవనగతికి, సర్వోత్తమమగు సహాయము.

మనయందొక యసాధారణ కర్మనెరవేర వలసి యున్నది. మానవత్వమును పరివర్తిత మొనర్చుకొని దేవత్వమును బొందవలయును. అనేక శతాబ్దములనుండి వచ్చుచున్న క్రమవివర్తన మొక్కదినమున బూర్తికాలేదని వెరపొంద జనదు.

సాధన మార్గము లనేకములు. అందుకొన్ని యత్యంత శీఘ్రముగ నొకింత ఫలము నొసంగును. మనము స్వయముగ నిర్ణయించుకొని చేయుచుండు కర్మ

యందు కొంతమనో సంతుష్టి యుండును. ఏలయన మన మీ కార్యమును చేయుచున్నామను జ్ఞానము ప్రతిక్షణ మందునను మనయందు మేల్కొను చుండును. ప్రాణా యామము, ఆసనములు, జపము మొదలగు క్రియల ద్వారమున జీవనోన్నతి గలుగుచున్నదని దలంచు చుం దుము. గతించిన దినమునకంటె నేడు ప్రాణాయామము నెక్కువ కాల మొనర్చితిమనియు, లక్షమారు లెక్కు డుగ జపించితి మనియు దలంతుము. మరియు నిటులనే క్రమముగ వృద్ధియగుచుండిన యెడల, సాధన పథమం దగ్రేసరుల మగుచున్నామను జ్ఞానము వృద్ధియగు చుం డును. అందువలన అహంకారము వృద్ధి యగును. కాని యాత్మ సమర్పణ యోగదీక్షను గైకొనినయెడల, మనలను అహంకారము స్పృశింపజాలదు.

ప్రాణాయామము, జపములు మొదలగునవి మానవ కల్పితములు. కాని వానియందు భగవానుని యనంతశక్తి కార్యములొనర్పు చుండదు. మానవ ప్రయత్నమునకు హద్దుగలదు. ఆత్మసమర్పణ యోగి కార్యముల యందాడంబర ముండదు. ఆతని సాధన నీరసముగ జరుగు చుండును. మరియు నది యింద్రియ ములకగోచరముగ నడచుచు జీవనగతిని సిద్ధమార్గమున

నడిపింపు చుండును. ఈయోగ మొక స్థలమందు తీవ్ర ముగను, మరియొక స్థలమందు నెమ్మదిగను నడచు చుండును. మరికొన్నిచోట్ల స్థంభించి నట్లుండును. కాని యది యోగశక్తి ద్వారమున తీవ్రవేగమున, విజయోల్లాసము తోడ యపూర్వ యాదర్శమును ప్రకాశింప జేయును.

మానవరచిత మార్గములు కృత్రిమ జలప్రవాహ ముల వంటివి. అవి మానవుని బుద్ధినుండి బహిర్గత మగుచుండును. నిర్దిష్టమగు సీమయందు బ్రవహింపు చుండును. ఆప్రవాహమం దాపదలు లేక, జీవితనౌకను నడిపింప వచ్చును. కాని యాస్థానమునుండి మరియొక స్థానమున కేగుట యసంభవ మగును. ఆత్మ సమర్పణ యోగమార్గ మనంత సాగర తుల్యము. అందువలన నందేదియోయొక నిర్దిష్ట ధారను ననుసరింప వలసిన పనిలేదు. మన యిచ్ఛాను సారము దానియందే భాగ మునుండి యైనను జగత్తంతటను సంచరింప వచ్చును.

మహాసముద్రమందు యాత్ర యొనర్పదలచిన యెడల యుత్కృష్టమగు నౌక గావలయును. దానికి చుక్కానియు, దిక్నిర్ణయ యంత్రమును, నడిపించు శక్తి యు, సుదక్షుడగు నావికుడు నుండవలయును. అనంత సాగరమున నడచుటకు బ్రహ్మవిద్యయే మహానౌక.

విశ్వాసము చుక్కాని. ఆత్మ సమర్పణము కంపాసు. సృష్టి స్థితి ప్రళయ కారియగు మహాశక్తియే ప్రవృత్తి. భగవానుడే కర్ణధారుడు. భగవానుని కర్మపద్ధతి మన మనకొను నట్లుండదు. అందువలన నామార్గము వేరు. ఆతడే కాలమందు దేని నొనర్చినను, ఆకాలము, ఆఘటనగూడ భగవానుడే. కావున మనమా పథము కొరకును, కాలము కొరకును, నిరీక్షింపు చుండ వలయును.

ఈవిషయమును, పాశ్చాత్యజ్ఞాన మంగీకరింపదు. ఆజ్ఞానము మానవ బుద్ధిస్వాతంత్ర్యమును నణుమాత్రమైనను దగ్గించుటకు సమ్మతింపదు. అందు వలన వారు యుక్తిననుసరించి నడువవలయునని చెప్పుచుందురు. బుద్ధి యపరిణతావస్థ యందుండినను, విచారణ యందది యసమర్థమైనను, బుద్ధిననుసరించి నడచిన యెడల, క్రమముగనది, పూర్ణత్వము నొందించుననివారు నుడువుచుందురు.

కాని యీవాదమునుండి దప్పించుకొన వలయు ననిన, శాస్త్రములమీాద దృఢవిశ్వాసమును, గురువునకాత్మ సమర్పణమును జేయవలయును. ఇట్లొనర్చిన యెడల యుక్తియను సమ్మోహనాస్త్రమునుండి దప్పించుకొన వచ్చును.

ఇక్కాలమున వైజ్ఞానికులును, దార్శనికులును యుక్తిద్వారమున, అద్వైత విషయములగూర్చి, విచారించుచుండుటను సాధారణముగ గాంచవచ్చును. తర్క వితర్కములు మిక్కుటముగ జేయువాడు మహాజ్ఞానిగ పరిగణింపబడుచుండును.

కాని మనమీ మార్గమును ననుసరింప జనదు. మరియు సంకీర్ణులము కాకూడదు. మనో శంకల సమాధాన మొసంగ వలయునను దలంపున కాలమును వృధాబుచ్చ వలదు. విజ్ఞానము వికసించినప్పుడు, సకల సంశయములు దూరమగును. సమస్త ప్రశ్నలకును చరమ సిద్ధాంతమును బొందుదుము.

మనోవిజ్ఞానము వలన నెకింత బ్రయోజనము కలదు. కానియది యాధ్యాత్మిక విజ్ఞానమునకు దాస్యము చేయుచుండును. మనోవిజ్ఞానముగూడ అప్పుడప్పుడు మార్గమును జూపుచుండును. కానియది సంపూర్ణముగ యాధ్యాత్మిక విజ్ఞానమున కధీనమై యుండుటవలన, ఆయపరోక్షానుభూతి వలననే, మనోవిజ్ఞానము బలయుత మగుచున్నది. మనోవిజ్ఞానము పాండిత్యమునకు సంబంధించినది. మరియు నది వెలుపలనుండు అవాంతర వస్తువు మాత్రము. అందు వలన సాధనకు

ప్రిబలవిఘ్నమును గలిగింపు చుండును.

పూర్ణయోగమును స్వీకరింప దలచిన యెడల తర్క విర్కముల తోడ కాలమును వ్యయ పరచు కొనక, దానిసంబధమగు శాస్త్రమును ననుసరింప వల యును. మనము గాడాంధకారమందు, సమ్ముఖమందలి వస్తువులను జూడలేము. ఆటులనే, ప్రిధమమున మనకు సమస్తమును గాడాంధ కారముగ నుండును. అట్టిస్థితి యందు అభ్యంతర స్థితమగు జ్యోతి ప్రజ్వలించు దను కను లేచియుండ వలయును. మరియు నిరహం కారుడై పూర్ణయోగ మార్గమున నడచుచుండు సాధకుని సహా యమును బొందవలయును. కాని మనమాత్మ వికాసము కొరకాతురులము గాగూడదు. పరిపూర్ణమగు అభిజ్ఞత కొరకును, తేజము కొరకును, జగద్గురువు మీద నిర్భర పడి యుండవలయును. అప్పుడు భగవానుడే మనయం దుండి నడిపింపు చుండును.

౧౩

అద్వైతవాదము, మాయా వాదముల గూర్చి, యొకింత విచారించుట యావశ్యకము. నేడివి యూరపు దేశమందలి యుక్తివాదము, నాస్తిక వాదముల తోగలసి, మానవుని తలక్రిందు లొనర్చుచున్నవి. ఏకదేశమును

మాత్రము దర్శించువాని దర్శనము, సత్యముయొక్క యొకదిక్కును మాత్రము వెల్లడించును. దర్శన శాస్త్రజ్ఞుని యాలోచనానుసారముగ జగదీశ్వరుడీ జగత్తును సృష్టింపలేడు. ఇది మురళీ నినాదమును బోలి యనంత వైచిత్ర్యములయొక్క మహత్తర సమన్వయమై యున్నది. భగవానుని స్వరూపము తర్క వితర్కములకు గోచరించునది కాదు. సమస్త ధర్మముల సత్యమును స్వీకరింప గలిగినదే సర్వోత్కృష్టమగు ధర్మము. సమస్త దర్శన శాస్త్రముల యందలి సత్యము నంగీకరించి, వానికి తగిన స్థానమొసంగునది యుత్తమ మగు దర్శనశాస్త్రము.

మాయ యనునది యొక యనుభవము. శ్రీశంకరాచార్యస్వామి మాయ ననుభవించి యుండెను. అందు వలననే మాయను గూర్చి నొక్కి వక్కాణించెను. కావున మనమీ మాయను గౌరవముగ నంగీకరించి, భగవల్లీలను దృఢముగ ధారణజేయ వలయును. 'మాయ' శబ్దమునకంటెను, లీలయను పదమందలి భావము గంభీరమును హృదయస్పర్శియునై యున్నది. మాయాలక్ష్యము లీలయందు గలదు. మరియు లీల, మాయాపరిధి నతిక్రమించి జగత్తునందలి నిగూఢ తమమగు ఆనంద రహస్య

మును వెల్లడింపు చుండును.

పృథ్వియందు నివసింపుచు దానిని మిథ్యయని యుపలబ్ధి నొందుటవలన ప్రయోజనం బేమి? శ్రీకృష్ణ భగవానుని నిత్య బృందావన లీలయు, మధురాపుర లీలయు ననంత కాలమునుండి జరుగుచున్నవి. కావున నాలీలయందు జేరి పరమానందము ననుభవింపు చుండుటయే మానవ ధర్మము.

భగవాను డొక్కడు. కాని యొక్కడనుట వలన నాతడా యేకత్వమందు బాధింపబడి యుండడు. మనము భగవానుని యేకత్వము నుపలబ్ధి నొందు చున్నారము. భగవాను డనంతరూపముల బ్రకాసింపు చున్నాడు. అట్లు ప్రకాశింపని యెడల భగవానుడు నిర్వ్యాజాలడని తలంప జనదు. అది భగవానుని బహిర్వికాసము; భగవల్లీల. భగవానుడు వర్ణనాతీతుడు. అనిర్దేశ్యుడు. భగవానుడు, ఏకమా? అనేకమా?, అను విషయమును నిశ్చయముగ జెప్పజాలము. ఈవిషయమునే యుపనిషత్తులు మొదలగు ధర్మగ్రంథములు వ్యక్తపరచు చున్నవి.

"అవ్యక్తాత్తుపరః పురుషోవ్యాపకోలింగ ఏవచ"
సర్వవ్యాపియు, సర్వచిహ్న వివర్జితుడగు పురుషుడు

అవ్యక్తమునకంటె శ్రేష్ఠుడు. ఆతడు "ఏకమేవా ద్వితీయమ్" భగవానునకు వ్యతిరేక మనునది యేదియులేదు. అందు వలన పర్వతము మొదలు పరమాణువు వరకును భగవానుడై యున్నాడు. కావున భగవానుడు శాంతుడును, అనంతుడును, జీవుడును, బ్రహ్మమునై యున్నాడు. "నేనశ్వర్థవృక్షమును, మృత్యువును, వైశ్వానరుడను, క్షుధను, వ్యాసుడను, వాసుదేవుడను." అని భగవద్గీతయందు శ్రీకృష్ణ భగవానుడు చెప్పియున్నాడు.

"నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప"

ఓయర్జునా? నాదివ్యవిభూతి యనంతము. భగవానుని యసీమ సత్తాయందలి చైతన్యమే, లీలా విలాసము. కావున నాతడే సమస్తమునై యున్నాడు. అందు వలన సమస్తమును సత్యమును, సుందరమును, ఆనంద పూర్ణములని యెరుంగ వలయును.

బ్రహ్మము ప్రకాశించు విముక్త ద్వారమును మాయ యందురు. భగవానుని విచిత్రమగు ఆత్మప్రకాశమున కంతములేదు. ఏదియోయొక యవస్థా విశేషమందది బంధింపబడి యుండదు. స్వరచిత మాయాద్వారమున భగవానుడు నిత్యనూతనుడై యానందము ననుభవింపుచున్నాడు.

కావున నీమాయను మన మతిక్రమింప వలయును. మన దివ్యదృష్టిని యడ్డగించి యేది సృష్టిని, భగవానుని, వేరుగ జూపింపు చుండునో; చైతన్య సత్తాను, జడపదార్థమను భ్రమను గలిగింపు చుండునో; అసీమను ససీమగను; ముక్తిని బంధనముగను, దోచునట్లు చేయుచుండునో; దానిని మాయ యందురు. బృందావన లీలలను మనము స్మరణయం దుంచుకొనవలయును. నారదు డే గోపిక గృహమున కేగినను, అచ్చట శ్రీకృష్ణ భగవానుడు విరాజిల్లు చుండెను. ఈపౌరాణిక రచనయందు నిగూఢమైయుండు భక్తిరహస్యమును వదలినను గూడ, దానిని భగవానునియొక్క జగల్లీలలకు యుత్కృష్ట నిదర్శనమని నుడువుటకు సందియము లేదు.

సమష్టియు, వ్యష్టియు భగవానుడు. విభిన్న ప్రకృతుల వలన వేర్వేరు పురుషులుగ నుండినను నాతడే పురుషోత్తముడు. అతడు శ్రీరాధికా రమణితోడ విరాజిల్లు చుండును. మరియు భగవానుడు దలంచినయెడల సమస్త వైచిత్ర్యముల నొక్కత్రుటిలోన తనయందు విలీన మొనర్చుకొనును. తిరిగి వానిని యొక్కనిముసమున బ్రకాశింప జేయును. ఒక దిక్కునుండి చూచినయెడల సమస్తము భగవానుడు. మరియొక దిక్కునుండి చూచిన

మొదల, సమస్త పదార్థములు వేరు వేరుగ గన్పడు చుండు ను. మరియు నాపదార్థములు వ్యక్తయవ్యక్త భావముల తోడ, భగవానుని యానంద పరికాశము వెల్లడి యగు టకు ద్వారములై యున్నవి.

ఈతత్వము తర్కమున కందునది కాదు. కావు న ధీరచిత్తమున భగవద్దర్శనమునకు వేచి యుండ వల యును. భగవత్కరుణ గలిగినయెడల నిన్నునీవు, దెలిసి కొందువు. భగవానుని దర్శింతువు. అప్పుడు తర్క వితర్కములతోడ బనియేమున్నది ?

౧౪

అద్వైత వాదము, మాయా వాదము మొదలగు వానిని లెక్కింపుచు, మనము సిద్ధిమార్గమున నడువ జాలము. కాని వానిని గూర్చి దెలిసికొనిన జాలును. మన యభివృద్ధి శ్రీకృష్ణుని బట్టి యున్నది. శ్రీకృష్ణ భగవానుని తోడ మనము క్రీడింప వలయును. మరియు భగవానుని యనంతశక్తి కాధారులము గావల యును. భగవదైశ్వర్యములకు మనము యంత్రములుగ నుండవలయును. ఈ యాదేశమే నిరంతరము మనల మేల్కొలుపు చున్నది.

అమంగళ ప్రేమను దానియందే, విముక్తికొంద

వలయును. భగవానుని ప్రేరణవలన, ఆత్మయభినవ గూఢ ముసు దాల్చును. భగవానుడు విద్యుచ్ఛక్తి సమన్వితమగు వైజ్ఞానిక యంత్రమును బోలి మానవ జాతి యందు మాతన జ్ఞానమును విస్తరింపజేయునుగాత. "డైనామైటు" (తుపాకిమందు) భూగర్భ మందుండి గంభీర గర్జనముతో శ క్తివనుండు పర్వతపంక్తులను పగుల గొట్టునటులనే, మ నము దేశమందు పుంజీభూతమై యుండు అశుద్ధత క్రింద నుండి, దానిని నొక్కమారుగ భస్మముచేయుదుముగాత. మానవ మండలియం దొక్కొక్క సాధకుడు వేలకొలది మానవులయందు జ్ఞానము, శక్తియొక్క హుతాశనల మును ప్రజ్వలింపజేసి, వారిని యవిద్యనుండి యుద్ధరించె దరుగాత. ఒక్కొక్క సాధకుని తపశ్శక్తి ప్రభావము వలన వేలకొలది మానవులు భాగవత భావమున పరి పూర్ణు లగుదురు గాత. ఒక్కొక్క సాధకుని యంగస్ప ర్శవలన లక్షలకొలది మానవులు సచ్చిదానంద సాగర మున నిమగ్ను లగుదురు గాత.

దేవాలయముల యందును, మసీదుల లోను, చర్చియందునను, ప్రచార మొనర్చు ధర్మమువలన మాన వజాతి యెప్పుడును విముక్తి నొందజాలదు. ధర్మోప దేశములు, స్తోత్ర వాక్యములు మొదలగునవి, మానవునకు

సిద్ధిమార్గమును జూపింప లేవు. ఇవి యన్నియు మానవ బుద్ధినుండి బుట్టినవి. అందువలన గణనాతీతమగు ఆదర్శములను ప్రచారము చేయుచుండును. ప్రస్తుతకాలమందలి ధర్మనీతియు, ప్రాచీన అనుష్ఠాన పద్ధతియు, మతవాదములును, ఆచారములు మొదలగువాని వలన నవితమమహాత్మ్యమును వెల్లడించుకొను చుండును. కాని యవి యెప్పుడును మానవజాతి నుద్ధరింప జాలవు.

చిరకాలము నుండి మానవుడు దివ్య జీవనమును బొందు మార్గమును మరచి యున్నాడు. ఆమరచిన మార్గమే, శక్తిసాధన; ఆత్మోపలబ్ధి.

ప్రకృతి వెరింగి, ప్రకృతి సహాయమున, ఆత్మముక్తిని బొందని యెడల, జీవిత సాఫల్యము గలుగుట అసంభవము. కావున మనము తిరిగి క్రైస్తుయొక్క పూర్ణతయు; పవిత్రతయు, మహమ్మదుయొక్క ఆత్మసమర్పణమును, భగవద్విశ్వాసమును, శ్రీచైతన్యుని ప్రేమానందములు, శ్రీరామకృష్ణ పరమ హంసస్వామియొక్క సర్వధర్మ సమన్వయమును దేవత్వమును, బొందింప జేసిన, ఆనిగూఢ శక్తి నాశ్రయింప వలయును.

ఈభావముల నేకత్రితమొనర్చి యొక్క ప్రబల ప్రవాహమును నిర్మింప వలయును. పతితోద్ధారిణి

యగు గంగాపరివాహమును, జీవచ్ఛవములైయున్న మానవ జాతిమీద బ్రవహింప జేయవలయును. భగీరథుడు తనపూర్వపురుషుల భస్మరాసులమీద విష్ణుపద పద్మోద్భవయగు గంగాప్రవాహమును బ్రవహింపజేసి వారికి దివ్యజీవన మొసంగి నటుల, నూతన ధర్మపరివాహము వలన, మానవజాతి మేల్కొనును గాత. అత్యల్పకాలమున పృథ్వియందు, స్వర్గరాజ్యము విరాజిల్లును గాత. ఈలీలకొరకే భగవానుడు, పరితియుగ మందును భూమండల మందవతరింపు చున్నాడు. మానవజాతిని క్రమోన్నతి మార్గమందుంచి యత్యున్నత ప్రదేశమునకు దీసికొని యేగి, దేవీసంపదతోడను, విపులానందము తోడను, మానవుని దేవతగ నొనర్చు బ్రయత్నమే, భగవల్లీల. భగవాను డనంత యుగములనుండి యీ కార్య మొనర్చుచున్నాడు. మానవ జీవితమందు భగవానుని యపూర్వలీలయు, భావమును బ్రకాశింపు చున్నవి. ఆతడు స్వర్గమును మర్త్యలోకమునకు దీసికొని వచ్చుచున్నాడు. అమృతముతోడ పృథ్వినంతయు నింపు చున్నాడు. స్వర్గ మర్త్యము లేకము కానంత వరకు మనకు విరామములేదు. ఈయద్వైత సిద్ధిగానంత వరకును మనకు సిద్ధిలేదు, భారత వర్షము సచ్చిదానందములతోడ

పరిపూర్ణమయిన మాత్రముననే బ్రయోజనము లేదు. భూమండల మంతయు సచ్చిదానందములతోడ బరిపూర్ణము గావలయును.

ఈమహాయజ్ఞము నారంభించిన సాధకునిధర్మ మనంతము; గభీరము. ఏలయన, యాతని యోగము జగదుద్ధరణకు సంబంధించి యుండును. మానవజాతియొక్క శుద్ధి, ముక్తి, సిద్ధియే, వాని జీవిత వ్రతము.. అట్టి విశ్వప్రేమికుల చరణ కమలముల కెప్పుడును నమస్కరించెదము..

"ఓంకాళీ"



# సరస్వతీగ్రంథమాలిక.

## ఆంధ్రమహాజనుల కొక విన్నపము.

కొలదివత్సరములనుండి వంగభాషలోని ఉత్కృష్టగ్రంథములలో కొన్నిటిని తెనిగించియుంటిమి. ఇంకను కొన్ని గ్రంథముల ననువదించి ప్రకటింపవలయునను సంకల్పము కలదు. ప్రస్తుతకాలమున గ్రంథప్రకటనము మిక్కిలి వ్యయప్రయాసలతో గూడుకొనియున్నదని వేరుగ విన్నవింప నవసరము లేదు. సంవత్సరమునకు మూడు గ్రంథములను ప్రకటింతుము. ఆగ్రంథముల వెల నాలుగు రూప్యములకు లోపు గనుండును. చందాదారులు ప్రవేశరుసుము నీయనక్కరలేదు. పోస్టు ఖర్చులను మేముభరించి, చందాదారులకు గ్రంథములను వి. పి. గా బంపుచుందుము. కావున మాధర్మగ్రంథమాలికకు, చందాదారులుగ జేరి, మాప్రయత్నమును కొనసాగించవలయునని ప్రార్థన.

## ఆత్మరామాయణము.

### శ్రీ శంకరానంద యతీశ్వరప్రణీతము.

శ్రీమద్రామాయణ మహాకావ్యముయొక్క గుప్తార్థము, బహుహృద్యముగ వెల్లడింపబడినది. శైలి సులలితము. మంచికాగితముమీద సొగసుగ ముద్రింపబడినది. స్త్రీలుగూడ చదివి ఆనందించునటుల తేట తెలుగున వ్రాయబడినది. ౨౪౦ పుటలు వెల రు ౧-౮-౦.

## భక్తియోగము.

(౧) భక్తి యనిదేనినందురు? (౨) భక్తిమార్గమందుండు కంటకములు. (౩) వానిని తొలగించుకొను మార్గములు (౪) సాధారణోపాయములు, (౫) కామక్రోధలోభ మదమాత్సర్యములు, పనికిమాలితనము, లోకనింద, ధర్మాడంబరము, మొదలగు దుర్గుణములను తొలగించుకొను మార్గములు॥ (౬) సత్సంగము, సాధుసేవ, తీర్థయాత్రలు, నామగానము, భాగవతపారాయణము, (౭) ప్రేమతత్వము. నానామత ప్రవక్తల జీవితములనుండి ఉదాహరణములు గైకొనబడినవి.        పుటలు ౩౬౦ క్యాలికోబైండు ౧-౮-౦.

# వాల్మీకి విజయము.

—— :o: ——

మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి, ఎమ్. ఎ., విరచితము.

బంగాళీ భాషనుండి తెనిగింపబడినది.

ఈ గ్రంథము యూరపియను భాషలలోగూడ భాషాంతరీకరింపబడి, పాశ్చాత్యపండితులచే నెక్కువగ పొగడ్తగాంచినది. కథాచమత్కృతియందు, పాత్రౌచిత్యమునందు, రసపోషణయందు, భావలాలిత్యమునందు, వంగభాషలో నిట్టి గ్రంథము మరియొకటి కానరాదు

వెల రు ౦-౧౦-౦

(౪) విదుషీమణులు :— కాలికోబైండు వెల రు ౦-౧౨-౦

(౫) తుకారాముచరిత్ర :— ౦-౧౦-౦

(౬) మల్లికాగుచ్ఛము :— ౦-౧౪-౦

(౭) సీతాదేవి వనవాసము :— ౦-౧౦-౦

(౮) పార్థివపదార్థ చికిత్సాచంద్రిక :— ౨-౦-౦

(౯) సతీదేవి }
(౧౦) సావిత్రిదేవి } తిరిగి ముద్రించ దలచినాము.

౮-౧-౨౧ } ప్రకాశకుడు,
బందరు } సరస్వతీనికేతనము,

కృష్ణాస్వదేశీ, ముద్రాక్షరశాల, మచిలీపట్టణము.